కాపీరైట్
రచయితది



తొలిముద్రణ : "ఖైదీ" 1952

ద్వితీయముద్రణ : "దొంగా-దొర" 1956

తృతీయముద్రణ ఖైదీ, 1990



వెల :
రూ. 20

ముద్రణ
వంశీ ప్రింటర్స్
రాజమండ్రి - 533103

# అంకితం

తుపాకితో వెన్నుపై కాల్చబడి తన కవోష్ణ
రుధిర తర్పణతో తెలుగు పుడమిని పునీతం
చేసి తనువుచాలించిన పవిత్ర శ్రామికమూర్తి
కందికట్ల నాగభూషణంకు.

"The Proletarians have nothing to lose but their chains. They have a world to win."

— Karl Marx.

# నివేదన

నిజానికిది నివేదనకాదు—ఆవేదన.

దొరల్లో దొంగల్ని పట్టాలంటె కష్టపడి కావ్యమే రాయ నక్కరలేదు. యింత ఆవేదనా చెందనక్కర లేదు. కారణం; యీ రోజుల్లో ఏ అసెంబ్లీ గేటుముందు నిలబడి చూచినా, మంచానికి పట్టే నల్లుల్లా వీళ్ళు కొల్లలుగా కనబడతారు.

వీళ్ళు సమాజంలో కాస్త బాగున్న ఎవడ్ని చూచినా కళ్లు పొడుచుకొని వాడి వినాశనానికి కంటిపై కునుకు లేకుండా పనిచేసే స్వార్థ పురుగులకు, దరిద్రంతో కుమిలిపోయే ఏ పేదోడ్ని చూచినా వాడిపై నిందలు మోపి, చేతులకు బేడీలు తొడింగించిందాకా మెతుకు ముట్టమని శపథాలు చేసే పాషండ పీనుగులకు ప్రతినిధులు.

అంచేత నా ఆవేదన వీళ్ళగురించి కాదు.

కాని దొంగల్లో దొరలున్నారు—క్షీరనీరన్యాయంగా. వాళ్ళ హృదయాలు వెన్నెల తరగలు. పరాయివాడు పాడవుతుంటే కళ్లు పొడుచుకోక, నెత్తురిచ్చి జీవం పోయడానికైనా సందేహించని విందు మానవులు వారు.

పరాయివాడు కుబేరుడైనా వాడి క్షేమాన్ని కోరుకుంటూ, వాడి గొప్పనే పొగుడుకుంటూ, యింటికొచ్చి, కుక్కిమంచంలో తలదూర్చి, కడుపులో కాళ్ళు పెట్టుకొని క్రుంగిపోయే దరిద్ర నారాయణులు—వారు.

కల్లాకపటం తెలియని కారుణ్యమూర్తి — ఆ మానవుడు. బుద్ధదేవుని గుడి—అతని గుండె. వాడికే, దొరల్లో దొంగలు, దొంగని ముద్రవేస్తారు. వాళ్లు కాకపోయినా వాళ్ళే సమాజానికి ప్రతి విధులో ఆ సమాజమైనా వేస్తుంది -- పరోక్షంగానో, ప్రత్యక్షంగానో.

అలా ముద్రవేయబడ్డ దొంగల్లో దొరల్ని గమనించలేక పోతోందే—యీ సమాజంలో 'మంచి' అనే ఆవేదనతోనే యింత సుదీర్ఘమైన నవల రాయాల్సొచ్చింది.

ఈ నవలలో 41వ ప్రకరణం వరకూ నేను జైలులో వుందగా రాసిందే. అది 'ఖైదీ'గా మీ అందరి ఆదరాభిమానాల్ని సంపాదించుకుంది.

జైలునుండి బయటికొచ్చాక కొద్దిపాటి అక్షరజ్ఞానంతో ఇంకో 9 ప్రకరణాలు చేర్చి "దొంగా—దొర"గా వెలువరించాను. ఇప్పుడు మీ చేతిలోనున్న నా మూడో ముద్రణ "ఖైదీ"ని నా అనుభవజ్ఞానంగా స్వీకరించమని వేడుతున్నా.

ఇందలి పాత్రలన్నీ కల్పితాలే. ఘటనలన్నీ — కొన్ని మినహా—యధార్థాలే. ఈ నవల చదివి మీరు నేర్చుకున్నవీ, నేను నేర్చుకోవలసినవీ రాసి పంపితే సంతోషిస్తా.

విజయదశమి
1990

భవదీయుడు
పడాల రామారావు

# ఖైదీ

చేతిలో నాలుగు పిక్కలుంటే చాలు – దొంగ దొరై పోతున్న యీ రోజుల్లో నా మాటెవ డింటాడు? విన్నా – బూటకమంటారు. మీరు వినండి వినకపోండి; నమ్మండి – నమ్మకపోండి; మీరు వినే రోజులూ, నేను చెప్పింది – నమ్మి ముమ్మాటికీ నిజమనే రోజులూ ముందున్నాయనే విశ్వాసము నాకుంది. అందుకే "ఇదంతా సొద" అని మీరు త్రోసేసినా రాదెత్తి మరీ చెప్పదలిచా.

అసలు మాది తూర్పు – చీపురుపల్లి తాలూకా – పడమ టన్నలకు మే మంటే బలే వేళాకోళం. చీపురుపల్లి తాలూకాలో మాదో జమిందారీ గ్రామం. జమిందారుగా రుండేది – విజయనగరమైనా – పంటలన్నీ వాళ్ళ గాదులకీ అప్పులన్నీ మా కొంపలకీ చేరేవి ఇవి గాక కాస్త పల్లంగా ఉన్న భూమంతా వారి సొంత కమతమే. పూర్వం ఓ రాక్షసుడు భూమినంతటినీ చాపలా చుట్టేసి సముద్రంలో దాగొన్నాడని – మీరు వినే వుంటారు. అధి నిజమో కాదో గాని యీ జమింగారుగారు భూములన్నీ దస్తావేజుల్లో చుట్టేసి వారి బోషాణాల్లో దాచుకున్నది మాత్రం నిజం; మా వూళ్ళో పూతిక పంటకు పే రెళ్ళిన మెరకలో మాబాబ్ధి రెండెకరాలు.

మా వూళ్ళో పాతిక కొంప లుంటాయేమో గాని – పండగలొస్తే మాత్రం కోడిపందేలూ, పేకాటలూ, ఓ మాంచి జోరుగా సాగిపోతుంటాయ్ జమీందారీ గ్రామం కదండీ మరీ; యీ కాస్తూరికే వున్న పెద్దల్లో ఒకడు – మా బాబు మా బాబంటే నాకు బలే మంటలెండి; ఎందుకంటారా – పక్కా త్రాగుబోతు మా అమ్మ మాత్రం చాలా మంచిది. ఏమైనా కాస్త ఇంటిలో

పడ్తే మా అమ్మ కష్టమే. వేరుశెనగ తీతలకి, గొప్పు త్రవ్వులకీ వెళ్ళి ఏదో నాలుగు డబ్బులు తెస్తుంటాది. నొసట అర్థణాకాసంత బొట్టూ, ముక్కుకు అడ్డ పూసా. మీరు చూస్తే పట్టి మూర్ఖపు మనిషి అంటారు. నిత్యం తాగొచ్చి మా బాబు చావగొట్టడమువల్ల మా అమ్మ శరీరం కాయకాచి పోయింది

యీ దశలో నేను పుట్టా. నేను కాస్త ఎదిగాక అనుకున్నా "ఎందుకు పుట్టానురా బాబూ." అని. కాని నేను పుట్టగానే అనుకున్నాడు మా బాబు – "వీ డెందుకు పుట్టాడురా నాయనా," అని. అయితే మా బాబుకు దర్భదరిద్రంలో నా పుట్టుక. మూలిగే నక్కపై తాటికాయపడ్డట్టయి వుండాలి. నేను అలా అనుకోడానికి మాత్రం – దరిద్రభూతానికి భయపడి కాదు సుమండీ. మరెందు కంటారా? వినండి.

## 2

ఆ యేడు పరిస్థితులన్నీ పూర్తిగా తారుమారై పోయాయ్. పిందు సంసారాలన్నీ తల్లక్రిందులై పోయాయ్. చల్లకదలని కడుపుల్లో కార్చిచ్చు రగిలింది. భయంకరమైన తుఫాన్. రాక్షసుడిలా రొప్పుతూ, రోదుతూ అరుస్తూ పిచి ప్రశాంత జీవనాన్ని అమాంతంగా హరించి వేసింది.

ఎంత భయంకరమైన తుఫాననుకున్నారు? మా వూళ్ళో ఒక మిద్దింటిపై తాటేకుటోపీరం ఎగిరిపోయి, మా ప్రక్కూరి పొలిమేరలోని తాటిచెట్టు తలపై పడింది. పీధిలోంచి వస్తున్న ఒక ముసలమ్మను – ఆ తుఫాన్ ఎత్తుకుపోయి ఎక్కడో పారేసింది. మరి ఏ లోకంలో పారేసిందో. మా ఇల్లు నిలువునా కూలిపోయింది. మా బాబు మూటాముల్లె కట్టి మా అమ్మతో –

"పదవే" అన్నాడు. అప్పటికి కాస్త వూహవచ్చింది నాకు.

"ఎక్కడికి?" అంది — మా అమ్మ భయపడుతూ — ఏమో ఎదురాడితే భంకాదేమో!

తప్ప లేదు మా బాబు. పైగా బిక్కమొగ మేసాడు — చిన్నపిల్లవాడిలా వూహించరాని మార్పు మా బాబులో ఆవేళ కనపడింది. అన్నాడు—గద్గదంగా—

"ఏం చేస్తామే! విజయనగరంలో మా తమ్ముడుగారింటికయినా పోయి తలదాచుకొందాం."

"దగ్గిరోడెవడాదుకుంటాడు — నీ పిచ్చిగాని" అంది మా అమ్మ. మా అమ్మకు బాగా తెలుసు — అసలు కష్టాల్లో ఆదుకుంటే దూరపోడే ఆదుకుంటాడనే సంగతి.

"ఏమైనా — ఒక ప్రేగున పుట్టాం యింత గడ్డుదినంలో కాదవడని. నాకు" బేలగా ఏదో మాబాబు పూర్తి చేస్తున్నాడో లేదో మా అమ్మ చటుక్కున చొరవ తీసుకొని అనేసింది.

ఏంటో — సంసారమంతా ఇలాగే తగలెట్టావ్ — ఒకడిమీద ఆధారపడమని ఎవడు చెప్పాడు — మన రెండెకరాల మెరకమ్మేసి. ఏ కూలో నాలో చేసుకొని యిక్కడేపడి వద్దాం.

మాబాబు హడలిపోయాడు. మా అమ్మ ఆమె జీవితంలోనే మాట్లాడెరుగదు. అవును మరి చెప్పండి — ఎంత దగ్గరోడన్నా — ఒకరోజూ రెండు రోజులూ చూస్తాడు. తరువాత పాతరోతే గదండీ! ఇకటువంటప్పుడు వాళ్ళ మోచేతి నీళ్ళకు పడుంటే స్థితి ఎవడు సహిస్తాడు — చెప్పండి. నిజంగా మా అమ్మ చెప్పిందే రైటు.

మా బాబుకు నాలుక తడబడుతూవుంది. మాట బయటికి రావడం లేదు. అనలేక — అనలేక అసలు లోగుట్టు బయట పెట్టేసాడు.

ఆ మెరక తాకట్టులో వుండే అని, మా అమ్మ దిగాలు పడిపోయింది. ఇక మా బాబు చెప్పిన త్రోవే — గత్యైంది.

బయలు దేరాం విజయనగరం మా బాబు ముందు ఓ కావిడి భుజాన వేసాడు. ఆ కావిడిలో ఓ కుక్కి మంచం, ఓ రంగం పెట్టె, కుండలూ, మండలూ వున్నాయ్. మధ్య నేను మా బాబు చేయి పట్టుకుని — ఆయాసంతో పరుగెడుతున్నా. వెనుక మా అమ్మ — మాసిన చింకిరిగుడ్డల మూట తలపై పెట్టుకొనే వస్తోంది. తరతరాలుగా కాపురమున్న వూరు — ఇక మమ్మల్ని విడిచి పెట్టేసింది. నా భుజంపై వేడిగా పడింది. వెనక్కి తిరిగి చూచా .... అది మా అమ్మ కన్నులనుండి కార్చిన కన్నీటి బిందువు— కాదు కాదు రక్త బిందువు. కాకపోతే అంత వేడిగా ఎందుకుంటుంది — చెప్పండి.

# 3

విజయనగరం ప్రవేశించాం ఈ విజయనగరంలో వున్న జమీందారే పూర్వం మా పంటల్ని కొల్లగొట్టి యిక్కడకు చేరవేసుకొనేవాడు. ఆ జమీందారుని కొండగుహలాంటి వుక్కుకోరల నోటిలోకి—తిన్నగా మేం ప్రవేశించినట్టుగా నాకు తోచింది ఇదేదో అతిశయోక్తి అనుకునేరుగన్క — హరిశ్చంద్రుని విశ్వామిత్రు డెంత దాన మడిగాడో మీకు తెలుసుకదూ! అంటె ఎత్తైన ఏమగుపై బలమైన మానవుడు నిలబడి, బలంగాపూని, సమతూనికైన రాయి పైకివిసిరితే ఎంతెత్తు వెడుతుందో, అంతెత్తు నుండి చూచినా చూపుకందనంతటి విస్తీర్ణమైన జమీగల జమీందారుకి కడుపెంతుంటుందో — నోరెంతుంటుందో ఆలోచించండి! ఇక యీ విజయనగరం గండు దోమల్కి మాంచి ప్రసిద్ధి అసలు ఏకోస్తాకైనా యిక్కడనుండే దోమలు ఎగుమతి అవుతుంటాయి.

మేము గుమ్మంలో అడుగు పెట్టేటప్పటికి ఒక వ్యక్తి ఆ గుమ్మం దిగుతూ....

"ఎప్పు డొచ్చావ్ అన్నా!" అంటూ పలకరించాడు. అప్పుడు నే నను కున్నా ఇతనే మా చినబాబని. ప్రశ్న వినగానే మేం బయలుదేరేటప్పుడు మా అమ్మ అన్న మాటలు గుర్తుకొచ్చాయి. లేకపోతే వాడెవరుగుండానే మేం వస్తే "ఎప్పుడొచ్చావ్ అన్న అ ప్రశ్నేమిటండీ? ఈ ప్రశ్నను బట్టి నేనూహించుకొన్నా అతని నైజాన్ని. ముఖం చూవా కందగడ్డలా వుంది.

మేం యిన్ని మైళ్ళు కాళ్ళకు బొబ్బలెత్తి నడిచి వస్తోంటే కుశల మైనా అడగకుండా. వెనుకే వస్తున్న భార్యతో —

"చూడే – మా అన్న మంచీ - చెడ్డా!" అనేసి గబగబా ఎక్కడికో వెళ్ళిపోయాడు.

"రా వదినా!" అంటూ మా పిన్నమ్మ లోపలికి తీసుకెళ్ళింది ఆమె నన్నా కాస్త కాళ్ళకు నీళ్ళన్నా యివ్వలేదు.

మా సంసారం ఆఖరికి మా చినబాబు గారింటిలోకి నడిచింది. లోపల మా అమ్మ. పిన్నమ్మ ఏవేవో మాట్లాడుకుంటున్నారు బయట మా బాబు!

"రారా! అలా వెడదాం" అని నన్ను తిన్నగా పెద్దబజారుకు తీసుకు పోయాడు ఆవేళే వారమో గాని, బజారు తిరునాళ్ళలా సాగుతోంది. బజా రులో మధ్య నిటారుగా వున్న గడియారం స్తంభంపై "టంగ్! టంగ్!" మంటూ తొమ్మిది గంటలు కొట్టాయ్.

'జయం! రారా! ........" అంటూ మా బాబు నా రెక్కట్టుకుంటూ లాక్కెళ్ళాడు. అవును మరి కష్టాల్లో వున్నోడు ఆఖరికి యిలా సంతృప్తి పడుతుంటాడు

ఎదురుగా ఓ అల్యూమినియం కొట్టు ముందు మా బాబాగాడు—

"మేమేం తుఫానుకు కొట్టుకుపోకుండా వున్నామనా దుకాణ మంతా మా కొంపకు చేర్చావ్!" అన్నాడు. ఎవరు? – ఏదో క్షణానికి వెడితే కసిరి కొట్టే ఎవడో సాహుకారు - కాదు - మా చినబాబే!

మా బాబుకు ఆ మాటలు "గియ్ మనేంతటి గట్టిగా తగిలుంటాయ్– తమాయించుకొని ప్రాధేయ పూర్వకంగా—

"రెండు రోజులు కనిపెట్టరా! తరువాత ఏదో దారి చూసుకుంటాం' అనేసి ఓ ఆటబొమ్మల దుకాణంవద్ద నున్న నా వీపుపై చెల్లున బాదాడు.

"చూసుకుంటారు ఇప్పుడు మమ్మల్ని చూస్తున్నారుగా" అని మా చినబాబు గొణుక్కుంటూనే వున్నాడు

# 4

ఆ వేళరాత్రి మా అమ్మ, మా బాబుకేదో చెబుతోంది - అదేదో అని అనుకొనేరు గనుక. అబ్బె ఏమీ లేదు - మీ తమ్ముడి అల్యూమినియం కొట్టులో పనిచేసి. ఏదో అడక్కూడదమా? అని - అంతే

మా బాబు చరబుర లాడ్డం మొదలెట్టాడు. కాని మా అమ్మ మొత్తం మీద మా బాబును ఒప్పించింది.

నేను నిద్రలో కెవ్వు మన్నాను — పుదయాన్ని మా బాబు కొట్టిన దెబ్బ గుర్తుకొచ్చి. వెంటనే మా అమ్మ చెల్లున చరిచింది – మాయముండా బుచ్చిగాడు – వీడితో ఏగలేకపోతున్నా నని.

నా కేడుపు ఆగడంలేదు. దానిపై మా బాబు. ఇంకో రెండంటగ తిచ్చాడు - నే నేదో వాళ్ళ రహస్యాలు వెల్లడించేస్తానేమో ననే వారి బాధ!

అంటె నా ఏడుపు విని ప్రక్కనున్న చినబాబు లేస్తే ప్రమాదం కదండీ – మరి అంగులోనూ. వారికీ మాకూ – ఒక వొంటిబుక గోడడ్డు. ఏ వుద్దే శంతో మా బాబు నన్ను బాదాడో — అది నెరవేరలేదు — నేనేడుస్తూనే పున్నా. యింతలో మా యమ్మ - పిడికిలా కాదు. అని లో తొడల్లో సొంటి సిక్క పెట్టేసింది. నేను పై కప్పు ఎగిరేటంతటి రొదపెట్టేసాను. వారేదో మాట్లాడుకుంటూనే యున్నారు

నా ఏడుపు సన్నగిల్లుతోంది. వాళ్ళు కునికిపాట్లుపడ్డారు. నా ఏడుపు ఆగిపోయి మైమరచేను – నిజానికి నన్ను ఏడిపించి. ఏడిపించి పడుకోబెట్ట డంలో మా అమ్మకు మాంచిసర్వీసులెండి మా చచ్చిపోయిన మామ్మ – ఒకసారి ఓ కథలో ........ అలా చిన్నవాడ్ని దాది జోలపాడుతూ జోకొ డుతూ నిద్రబుచ్చింది. అంటూ ముగించింది. అంతేలెండి. పెద్దవారి పిల్లలు జోలపాటల్లో నిద్రిస్తారు – ఇది సహజమే గదండీ"

మరునాడుదయాన్నే మాబాబు మాచినబాబు కొట్టువద్దకు వెళ్ళి — రాత్రి వచ్చిన అభిప్రాయాన్ని చెప్పగా – నా దగ్గరే అరుగురు పనిలేకుండా జీతాలు పుచ్చుకుంటూ మేస్తున్నారు - నీవొకడివా? అని చీదరించి – పైగా ఇవా రాత్రి మీరాలోచిస్తున్న దురాలోచనః అవి గపిరేడు – చూసావా. ఎంత రహస్యంగా రాత్రి మాట్లాడుకున్నా వెల్లడయిపోయింది – గోడకు చెవు లుంటాయంటారు - ఇదే కాబోలు పోనీలెండి. - అరుగురు పనివాళ్ళను పని లేకుండా పెంచుకున్న మా చినబాబు అన్నగదా అనైనా మా బాబుకేదో పని చెప్పి కూలిడబ్బు లివ్వచ్చుగా, అంతేలెండి, దూరపుకొండలు ఏలాగూ నునుపే

# 5

శివిగాడు నెత్తినెక్కి నాట్యం చేస్తున్నాడేమో. మాబాబు కాళ్ళరిగేటట్టు తిరిగి, తిరిగి యింటికివస్తూ పోతుండడంతో రోజులు గడిచిపోతున్నాయ్

ఇక్కడ యింటివద్ద - తోడికోడలు దెప్పుటతో మా అమ్మ కృంగిపోతోంది. బలవంతంగా బయటకు పొమ్మనే దశ వచ్చేసింది. మా అమ్మ మరీ బెగిలిపోతుంది. అందులోనూ మా అమ్మ కడుపులో యిప్పుడు నాకో తమ్ముడు పుట్టబోతున్నాడు. ఈ నారాయణ - నా పేరులెండి ప్రక్క ఏ అవతారం ఎత్తబోతాడో?

నా పని మరీ చులకనై పోయింది. ఒకరోజున వర్షం వచ్చింది. వీధిలో గుమ్మం ముందు నీరు పారిన కాల్వలో యిసుకతో గూడు కట్టుకుంటున్నా ఇంతలోనే మా చినబాబుకొడుకు "రంయ్" మంటూ వచ్చి నా గూడును త్రొక్కేసాడు నాకు వొళ్లు మండింది మీకొంప ఎవడైనా కూల్చేస్తే మీకెలా వుంటుందో చెప్పండి అమట్టుకు వాడ్ని పట్టుకొని వాళ్ళ బాబుపేరు తల్చుకునేవరకూ బావగొట్టేసాను. మా అమ్మవచ్చి నన్ను బావగొట్టింది. ఇంకోరోజు - నేను వీధిలో అగ్గిపెట్టెల ముక్కలాడుకొంటే - నేను గెలుచుకొన్న ముక్కలన్నీ చూస్తుంటానని చెప్పి పుచ్చుకొని ఎత్తుకుపోయి వాళ్ళమ్మ ఒడిలో దాగొన్నాడు ఈదఫా మా పిన్నమ్మ అనరానిమాటలన్నీ అని గుమ్మంలోంచి బయటకు త్రోచేసింది. నా మోచేతులూ, మోకాళ్ళూ కొట్టుకుపోయాయ్. నను లేవదీయడానికి వచ్చిన మాఅమ్మ మరో నాలుగు కొట్టి లోపలికి లాక్కుపోయి నన్ను వొడిలో పెట్టుకొని ఏడవటం మొదలెట్టింది. అప్పుడు నేననుకున్నా - మా అమ్మకు మా పిన్నమ్మాడిన మాటలు ములుకుల్లా గుచ్చుకొన్నాయిగదా - అని. నాకూ గుచ్చుకున్నాయనుకోండి. మా

అమ్మగారి వీధిలోపడ్డ నన్ను లాక్కుపోకపోతే మా పిన్నమ్మ వీపు విమానపుమోత మ్రోగించేవాడివి. ఇంతకీ మా యీ దుర్దినాలు ఎప్పుడు మంచిగా మారతాయో?

●

# 6

వీధిలోంచి మాబాబు మంచిహుషారుగా వస్తున్నాడు. నేను "చక్" మని మా అమ్మ ఒడిలోంచిలేచి మా బాబు కెదురెళ్ళి కాళ్ళ మధ్యపడ్డా. ఎన్నడూలేనిది ఆవేళ మాబాబు నన్నెత్తుకొని పకోడీల పొట్లాం చేతికందిచ్చాడు – మరెక్కడ సంపాదించాడో? ఎలాగైనా మాబాబు మనస్సు చాలా మంచిదిలెండి! త్రాగుబోతైతే మాత్రం నీతి విప్పులాంటిది.

నేను మాబాబు భుజాలనుండి దిగి మా అమ్మ దగ్గరకు పరుగెత్తు కెళ్ళా. మా బాబుకూడ వచ్చి సంతోషంగా___

"నూనె మిల్లులో పని కుదిరిందిలేవే!" అన్నాడు. మా అమ్మ సంతోషానికి మేరలేదు.

యింతకీ ఆ పనేంటో ఎలా వచ్చిందో వినండి!

ఎవరో – స్నేహితుడొకడు – మాలాగే చెదిరిపోయి వచ్చిన వాడే వట! నూనెమిల్లులో కనబడి – వేరుశనగ సొరపోతలో – ఒకడు ఆ పని చేయలేక జాయింటుయిస్తా నన్నాడట. ఇంతకీ కూలి రోజుకో ముప్పావలా వస్తుందంటంతే ఎంతైతేనేమండి! ఆ సమయంలో అదే – పదివేలు.

చూశారా! తగ్గిలోరికంటే దూరపోదే చూస్తాదని మాఅమ్మ చెప్పింది నిజమంటారా? కాదంటారా? పూర్వకాలపు మనిషవ్వడంవల్ల మా అమ్మ ఏం చెప్పినా "వేదవాక్కే" అనుకోండి!

మా బాబు పనిలో ప్రవేశించాడు. ఆ వేళే మా అమ్మ కూడా ప్రసవించింది. నాకు తమ్ముడు పుట్టాడు. పుట్టగానే బొండాంలా వున్నాడు. ఇక పెద్దయితే వుద్దండపిండమే కదండీ!

మా బాబు పనయ్యాక చిత్తుగా తాగేసి వచ్చాడు. నేను ఎదురెళ్ళి — అన్నా—

నాన్నా! తమ్ముడు పుట్టాడు అని.

పుట్టాడూ? అని తూగుతూ అన్నాడు మా బాబు.

ఇంటికి వచ్చీ రాగానే పచ్చి బాలింతరాలైన మా అమ్మపై కారాలు, మిరియాలూ నూరుతూ—

కన్నావ్ — యింకొకడ్ని. నా ప్రాణం తీయించడానికి?

"అదేంటయ్యా — బంగారం లాంటి కొడుకు పుడితే ఆ మాటలు?" అంది మా అమ్మ నీరసంగా.

పుడతాడు — బంగారం లాంటోడు. మొయ్ — ఆ బంగారమంతా నువ్వే. అనేసి మా బాబు నిషాలో తూలి పురిటి మంచంపై పడ్డాడు.

"పోన్లే. నీవేమీ పెంచవక్కర్లేదు. నా కొడుకును పెంచుకోడానికి నే నేదైనా పనిచేస్తా. అని అమ్మ అనేసరికి మా నాన్న విరుచుకుపడి—

ఎంవే లంజా, నీ మొగుడు చచ్చాడనుకున్నావా? పనిలో కెడతావేం? అని పెధేబున కొట్టాడు.

మా అమ్మ సొమ్మసిల్లి పడిపోయింది. ఇరుగు పొరుగువారంతా మా యింటిలో చొరబడి మా బాబుకు అఢా పెఢా చీవాట్లు పెట్టారు. దాంతో ఆ పూటకు మాబాబుకు మత్తొదిలింది.

చూసారా? దరిద్రానికి ఎంత శక్తివుందో? తనకూ, పిల్లలకూ మధ్య ఎంత ద్వేషాన్ని కల్పించిందో.

# 7

మరునాడు మా బాబు పనిలోకి వెళ్ళాడు. నన్ను మా అమ్మ ముస్తాబుచేసి — అంటె, కోటూ, పంట్లాము తొడిగించనుకునేరు. కాదు — గోచీ, బనేనూనూ, తొడిగి బడికి పంపింది.

నేను బడిలో అడుగు పెట్టానో లేదో పిల్లలంతా ఘొల్లున నవ్వారు. అంతా నా వైపు చూసేవాళ్ళే.

అందులో ఒక పీటుగా తయారైన కుర్రోడు —

చూడండ్రా స్టూడెంటు — పాకీ గోచీ పీడూనూ అని పకాలున నవ్వాడు.

దాంతో అంతా నవ్వారు. నాకు వొళ్లు చచ్చిపోయింది. ఇంకో చోట యితేనా, నా సామిరంగా వీళ్ళ చిన్నప్పుడేసిన దొండాకు పసర పిండేవాణ్ని

అంతలోనే యింకొకడు —

"చూడండ్రా, పలకా, పుస్తకాలూ లేని స్టూడెంటు" అని లేవిడీ కొట్టాడు.

ఇంటివద్ద బయలుదేరే టప్పుడు — అక్కడికీ మా అమ్మ దగ్గర పలక కోసం పేచీ పెట్టాను. మా అమ్మ మాత్రం ఎక్కడ నుండి తెస్తుంది? ఆ జ్ఞానం యీ కుర్రకుంకలకు ఏడవ వద్దూ?

ఇంతలో దూరాన్నుండి పంతులుగారు బల్లపై బెత్తంతో కొడుతూ —

ఏంటిరా అల్లరి. ఎవర్రా వాడు? అన్నాడు. నన్ను ఆయన చూడ లేదు. అసలు పంతులుగారు బెత్తమెత్తే టప్పటికి నన్నే కొడతారేమో — నా వాలకంచూచి అనుకున్నా. కాని అలా జరగనందుకు నాలో ప్రాణం లేచివచ్చినట్టయింది.

పంతులుగారి ఆ మాటకు ఒకడు — వాడు మంచి దాబుసరిగా బంగిని పల్లి మామిడికాయలా వున్నాడులెండి—

వీడాండి త్రాగుబోతు లక్ష్మయ్య కొడుకండీ అని చటుక్కున అందు కున్నాడు.

నాలో కోపానికి బదులు ఏడుపు పొర్లివచ్చింది. ఇక నలుగురిలో వుండలేక పోయా. రివ్వున పరుగెత్తుకుంటూ యింటికి వచ్చేసా?

మధ్యాహ్నం మా బాబు తిండికి వచ్చేటప్పటిక్కి వుబ్బివున్న నా ముఖాన్ని చూచి మా అమ్మను అడిగాడు.

ఏంటే కుర్రోడి ముఖమలా కందిపోయింది?

ఏంటా? బడికి పంపితే త్రాగుబోతు కొడుకని తిట్టి గెంటేసారు.

ఎందుకు పంపావు. నా పసువు తియ్యడానికా? అని మా అమ్మను దభీ దభీ బాదాదు — మా బాబు. నే నడ్డెళ్ళాను. నన్ను జుట్టుపట్టుకొని తల గోడకేసి అదే కొట్టడం కొట్టి తిండి తినకుండా వెళ్ళిపోయాడు.

నేను తల పట్టుకొని కూలబడి పోయాను. మా అమ్మ వేడినీళ్ళతో తలకాచి నానా వుపచర్యలు చేసింది. సాయంత్రానికి గాని నా తలనొప్పి తగ్గ లేదు. ఇకప్పటినుండి నేను బడి ముఖమే చూడలేదు. పదిమందిలో పసువు కోసమైనా మా బాబు త్రాగుడు మాపలేదు.

# 8

రోజులూ, నెలలూ, ఏళ్ళూ గడచిపోతువున్నాయి. మా అమ్మకు మా తమ్ముడుపై ప్రేమ పెరుగుతోంది. వాడప్పుదే నాయంతయ్యాడు. నేను దగుతున్న కొద్దీ చీపురుకట్టల దెబ్బలు ఎక్కువవుతున్నాయి. ఈ దెబ్బలు

పడలేక మా బాబుతో మిల్లులోకి పోతున్నా. మిల్లులో కొంతకాలం కుర్రోడిగా పనిజేస్తున్నా. రోజుకెలా లేదన్నా — మూడుశేర్ల శెనక్కాయలు దొరుకుతాయ్ లెండి. మూడుశేర్లు మూడణాల పరక కిమ్మత్తు. అయితే యిక్కడ మా బాబుతోనూ దెబ్బలు తప్పడంలేదు. నా బ్రతుకలా బండబారి పోతోంది.

ఇంతలో ఆ మిల్లుకూడా మూత పడిపోయింది. ధరలు పెరిగితే లాభాలు రావడం సహజంగాని శనక్కాయలకు ధరలు పెరగడంవల్ల మిల్లులో నూనెకెవడిస్తాడు? ఆ ఫలంగానే అమ్మకుంటాడు గాని.

మిల్లు మూతపడ్డంతో మా నోళ్ళు మూతపడిపోయాయి. కాని ఆ మిల్లు యజమాని మా బాబుపై అభిమానం కొద్దీ అన్నాడు.

ఒరేయ్ లక్ష్మయ్యా. నేను రాజమండ్రిలో మా బావగారి కర్రల అడ్తీలో వాటా పుచ్చుకున్నా. నీ కిక్కడేం పనీ దొరక్కపోతే అక్కడ కొచ్చేయి అని.

మిల్లు మూతపడ్డ కొన్నాళ్ళవరకూ పనిలేక తిరిగాం యిక జీవనం గడవడమే దుర్లభమైపోయింది. రాజమండ్రికి పయనమయ్యాం తిన్నగా — మిగిలిన ఆస్తితో. అంటే ఏవో మడి మాన్యాలూ అనుకునేరు గనుక, కాదు - రెండు కుంచాల శనక్కాయల బుట్టతో. మా బాబు ముందూ మధ్య నేనూ, మా తమ్ముడు పల్లం. వెనుక మా అమ్మ - శనక్కాయలు తింటూ త్రోవలో మంచినీళ్ళు త్రాగుతూ — "నీరం నారాయణ స్వరూపం" అన్నారుగా పెద్దలు. కాళ్ళీడ్చుకుంటూ వారం రోజులకు రాజమండ్రి చేరుకున్నాం.

పోన్లెండి దేముడి దయవల్ల, వెళ్ళగానే ఆ సాహుకారు మా బాబుకో అడ్తీలో పనిచ్చాడు. అందులోనూ మేస్త్రీ. లింగాలపేటలో తాటాకిల్లు మా నివాసం.

ఇదీ నా గతం - ఇక ప్రస్తుతం—.......

# 9

కాలం గడుస్తోంది. గడుస్తున్న కొద్దీ, ఏదో కొత్తదనం అందరి లోనూ పొటమరించింది. నాలో ఏపనైనా చేయగల జవం, యవం తొణికిస లాడుతోంది. మా బాబుతోపాటు నేనూ అడ్డీలోనే పనిచేస్తున్నా. అయితే మా బాబును మేస్త్రీ ఆవీ అంతా గౌరవంగా చూస్తున్నారు. ఇకనన్నా — హం చేతిలో నాలుగు పిక్కాలున్న —

ఈ ప్రపంచం వుంచి చూసారూ — వెదవ ప్రపంచం — నన్ను దొంగంటుంది. ఇలా అనేరకాళ్ళే నేను గజదొంగలంటాను. ఈ గోదావరి వీళ్ళ బాబుసొమ్మా? ఆ మాటకొస్తే ఐదేండ్ల బట్టి యీ గోదావరంతా నాకు కొట్టినపిండే. నాకు స్వేచ్ఛా జీవితాన్ని ప్రసాదించినది యీ నదీమతల్లే. మస్కాలు కొట్టించడంలో వీళ్ళకంటె నేనూ మొనగాడినే. ఈ గోదావరి పైనుండే కలపను త్రినేత్రుడికి కనపడకుండా మటుమాయం చేయడంలో గడిదేరిన ఢకాన్నే నా తమ్ముడు సల్లయ్యున్నాడే వాడలా వా పక్కనుంటే చాలు — వాడు మహా చురుకైన రకంలెండి. ఎంత పెద్దసలకైనాసరే అమాంతంగా లాక్కుపోయి ఏఒడ్డుకైనాసరే చేర్చగల చేయి తిరిగిన ఘటాన్నే.

ఈ నదీమతల్లే నాకు స్వేచ్ఛాజీవితాన్ని ప్రసాదించిందన్నానే — వాకే కాదులెండి. యీ పట్టణంలో లక్షయాభై వేల మందికి ప్రాణభిక్ష పెట్టినడిదే ఇంతెందుకు? యీ గోదావరే కనుక లేకపోతే యీ పట్నం ఇంతఅయ్యే ' దేమిటి? ఎందుకన్నానంటారా ఆ విషయం చెబితే నేను స్వేచ్ఛాజీవినేనని మీరు ఒప్పుకోకతప్పదు. నాకు బాగా జ్ఞాపకం — నాకు వూహవచ్చిన లగా యితూ మా అమ్మచే నేనుపడ్డ చీపురుకట్టల దెబ్బలూ, మా బాబు కాలి తన్నులూ ప్రక్కవోట్లూ.... ఒకటా ... రెండా.... మరచిపోదామన్నా మరపు

రావనుకోండి!.... అయితే ఇప్పుడవి తప్పేయా? అంటారేమో. తప్పలేదనుకోండి! కాని ఇప్పుడు ఓ అరగంట తిట్టులతో సరిపోతోంది. యీ ఘటనలే వన్నీ గోదావరికి మార్గం చూపించాయి "ఏదారీ లేకపోతే గోదారే" అంటారుగా మరి అంతా వినండి!

అది శరత్కాలపు వెన్నెలరాత్రి.గోదావరి ఎంత ప్రశాంతంగా వుందనుకున్నారు! వర్షాకాలంలోలాగ ఇప్పుడు వరదలు గ్రక్కడం లేదు. వర్షాకాలంలో గోదావరి తన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను బాహాటంగా చాటుతూ అడ్డువచ్చిన మానులను. అనకట్ట మీదనుండి విసిరేస్తుంది. మహోత్సాహంతో వుప్పొంగి ప్రవహించడమే కాకుండా చూస్తున్నవారి నెవర్నైనాసరే స్వేచ్ఛా స్వాతంత్రాలకోసం ఆటంకాలను అధిగమించమని వుత్తేజపరుస్తుంది.

కాని నాడో, ఆ శరద్రాత్రి జరీబుటాల తెల్లని చీరకట్టుకొని, విరగబడి నవ్వుతుంటె గౌతమీ గంగకూడా ప్రతినవ్వులందివ్వడానికి తన అలలతో లేవబోతూంటే కనుచూపు మేరవరకూ క్రమ్మివున్న కలప పలకలు ఆ అలలను అణిచేస్తున్నాయి.

చూసారా! పవన భాగీరధి తోబుట్టు అగచాట్లు వర్షకాలంలో వున్న స్వేచ్ఛ శరత్కాలంలో లేదు. ఆ త్రొక్కి పెడుతున్న కలప పలకలకోసమే నేనూ నా తమ్ముడూ, కోటిలింగాల రేవులో రావిచెట్టు ప్రశాంత నీడలో నున్న సమాధిపై కూర్చొని ఆలోచిస్తున్నాం, ఎలాగైనా ఆ పలకలను వీటిలో కొన్నింటినైనా లాక్కుపోయి మరోఒడ్డు చేరుద్దామనే మా ఆలోచనంతా.

గుడిలో "గణ గణ" మని విజయగంట మ్రోగింది. ఇక ఇప్పుడు పనికుంకించామా? విజయంమాదే. కోటిలింగాల గుడిలోని గంట మ్రోగడం అంటె - అందులోనూ. మేం - ఆలోచిస్తున్నప్పుడూ మాటలనుకున్నారా.

దేశదేశాలనుంచి యీ కోటిలింగాలు పుణ్యక్షేత్రమనేగా అంతా వచ్చి గంట మ్రోగించి ఫలపుష్పాదులు సమర్పించడం! అటువంటప్పుడూ మేమాగంటకు విలువివ్వక పోవడం తీరని అపచారం కదూ?

తెప్పలపై కాపలావాళ్ళు ఇంకా కబుర్లు చెప్పుకుంటున్నారు. నేనూ నా తమ్ముడు పల్లయ్యా నెమ్మదిగా ప్రక్కరేవుకు బయలుదేరాం. వాళ్ళు చూడకుండా – ఒడ్డున చూచినా పరవాలేదనుకోండి! యేటిమీద చూడకపోతే చాలు. అయినా కాస్త జాగ్రత్తగా వుంటాననే మా పల్లయ్య నన్ను ఎంతో మెచ్చుకుంటాడు.

నెమ్మదిగా ప్రక్కరేవులోడిగి బారవేస్తూ తెప్పల చివరికి యీదుకు పోతున్నాం. మా కెదురుగా ఇసుకపర్రల వద్ద ఓ చిన్న పల్లెటూరిలా పడవలు వరుసలుదీర్చి వున్నాయి. వాటిలోని దీపాలూ మింట మెరుస్తున్న నక్షత్రాలు మాకు విపరీతమైన వుత్సాహాన్నిస్తున్నాయి.ఎందుకంటారా? ఆ దీపాల కాంతులూ యేటిపైబడి నిజంగా గౌతమీ గోదావరిదేవి నడుంకు బంగారు వడ్డాణం మెడలో మంచి ముత్యాలహారం ధరించిన కన్యలా మెరసిపోతూంది

తెప్పలపై నున్న కాపలాదార్లు యిప్పుడు మాకు దూరమైపోయారు. చివర తేలియాడుతున్న దూలాన్ని చూచి "ఒరేయ్! పల్లం? నీవు యీ చివర పట్టుకో" అని నేను గబగబా రెండు అంగలేపి దూలంచివర పట్టుకున్నా.

"ఊఁ! ముందుకు తోసెయ్! ఒకటి చాల్లే. ఇది టేకుదూలమే!" అని నేననగానే మా పల్లం ముందుకు తోసేడు దూలాన్ని. ఇరువురమూ రెండు చివరలూ పట్టుకొని ఆనదిమీద తేలిపోతూ పెద్దపెద్ద అంగలేసుకొని చాకిరేవులకు యీదుకుపోయాం. బలేదూలం లెండి! ముప్ఫైరూపాయలైనా వుంటుంది. పల్లయ్యను దూలంవద్ద కూర్చోబెట్టి నేను షావుకారి వద్దకు వెళ్ళాను. ఆ షావుకారు ఎవరోకాదు ఆ ద్వీప రక్షకుడే అయితే ఏం? మేమే

కలపదీపుకు వెళ్ళినా కొంటాడు. అతన్ని తీసుకొచ్చి మాలాన్ని చూపించాను పదిరూపాయ లిచ్చాడు. నాతమ్ముని చేతిలో రెండురూపాయలు పెట్టి ఇంటికి పొమ్మని నేవెళ్ళిపోయాను.

* * * *

రాత్రి చాలాభాగం గడిచిపోయింది. నేను మంచి పదునుమీద వచ్చేను లెండి అమాత్రం పుచ్చుకోకుండా ఇంటికి వస్తే మాబాబు బందబూతులు సహించగలనా? అరుగుపై అలికిడిగా ఉంది. నెమ్మదిగా తేరిచూస్తే మా బాబే. కమ్మటి వాసనకూడా కొడుతోంది. అప్పుదేవచ్చి పడుకున్నట్టుగా ఉన్నాడు కూలిసంపకం అయ్యేప్పట్కి పనికద్దీ రోజులేమో ఆలస్యమవుతుంది లెండి! యీ మాయదారి కలప మోత – ఇంకో రెండు నెలలుంటుందేమో అంతే. ఏడాదినవికి —— ఆదేవి నాలుగుమాసాలేగా మా బాబు లక్ష్మయ్య వున్నాడే! అ డ్డీలో మేస్త్రీగదండీ – నేనంటె ముక్కుమీదికి వస్తుంది —— కోపం. అంచేత నెమ్మదిగా గుమ్మం దగ్గరికి వచ్చాను. తలుపు జేరవేసుంది. మా అమ్మ గుమ్మానికి అడ్డంగా. ద్వారబంధంపై తలపెట్టుకు పడుకుంది. చిన్నదిపం లోపల మిణుకు మిణుకు మంటోంది మా తమ్ముడు లోపల నిద్రిస్తున్నాడు – వచ్చి పరాకత్తుగా భోజనం చేసినట్టున్నాడు. అందుకే మంచి నిద్రు పెడుతున్నాడు. మా తమ్ముడంటే మా బాబుకు, అమ్మకుకూడా ఎంతో ప్రేమ. మాబాబు వాడ్ని కాస్త కేకలేస్తుంటాడు. అదైనా "పెద్ద లంజాకొడుకు ఎలాగూ పాడయ్యాడు. వాడితో తిరుగుతా వేమిట్రా వెధవా" అనే మా అమ్మకు వాడిమీద అమితమైన ప్రేమ. ఎందుకంటారా నాలాగ వచ్చిన డబ్బంతా తగలేయకుండా. ఏదోకాస్త చేతికిస్తాడని. అంతేగాకుండా. ఎలాగూ నేను పాడయిపోయానని. వాడినైనా బాగుచేద్దామనికోనం. కేక లేస్తే ఇంటిపట్టున లేకుండా పోతాడేమోనని ఏమీ అనదు. తల్లికి చిన్న కొడుకుమీద ప్రేమ సహజమే గదండీ!

చూచాను మాబాబు కాస్త ఎడమవైపు వొత్తిగిల్లాక నెమ్మదిగా అరు గెక్కాను. ఎక్కిఎక్కగానే మాదు నెత్తికి తకీయని తగులుతుంది. మా అమ్మ తుళుక్కుపడి లేచింది మా అమ్మకు అనవాలేగా, ఆ సమయంలో నేను తప్ప ఎవరూ రాదని. అదీగాక వెన్నెలరాత్రి. లేచిచూసేసరికి స్పష్టంగా కనబడతున్నా.

ఏమిరా బుచ్చిగా! ఏకోటిలింగాల సత్రంలోనైనా చోట్ల లేకపోయావా, అంది.

కర్మం కాలితే తాడు పామై కరుస్తుందని. ఎంత నెమ్మదిగా వచ్చినా యీ వెధవదూరు తగులుతుంది. మాబాబు ఎక్కడ లేస్తాడేమోనని గుండె బితుకు బితుకు మని కొట్టుకొంటోంది. అంత పనీ జరిగింది లేవాడు. ఇక విప్పాడు బూతుల పంచాంగం.

ఏమిరా లంజాకొడకా! గౌరవంగా బ్రతుకుతున్న కొంప వచ్చేట కళ పుతా వేంటిరా! పో వెధవా! నా కండ్లముందు లే పో! అని తిట్టాడు.

బండబారిపోయిన నాకు యీ తిట్లు తగులుతాయా!

మా అమ్మ కలుగజేసుకొని—

"ఏమిటా గొంతుక! అంతా లేవరూ! యీ వెధవ సంసారం యింకా కాకిపందిరి వేసుకోవా లేమిటి! పోనీలే వాడి త్రోవన వాడు పోతాడు, మొక్కప్పు దొంగవిది మానయ్యాక పొంగుతాడా!" అంది.

ప్రక్క కాపురమున్న వెంకన్న పొల్లిరుచుకొంటూ లేచి—

"ఏమిటండీ లక్ష్మయ్యగారూ, రోజు కీగొడవే. మాకు నిద్రలు పట్టక్కర లేదేమిటి! అన్నాడు.

దానితో అల్లరి అణగిపోయింది.

ఇదంతా కండ్లుమూసుకు వింటున్న మా తమ్ముడు నెమ్మదిగా లేచి వీధిలోనున్న నా వద్దకు వచ్చాడు. నేను అప్పటికే – గొడవవుతుందేమోనని నెమ్మదిగా రోడ్డువైపుకు సాగటం మొదలెట్టాను. పెద్దవాళ్ళు కేకలేస్తే ఏదో తా... ఆ సమయానికి ముఖం చాటేసుకోడం మంచిది కదండీ.

నా కూడా వచ్చి నా భుజంమీద చేయివేస్తూ నా తమ్ముడు—

"ఒరే, అన్నా నాకు మంచి ఐడియా తట్టిందిరా" అన్నాడు

"ఏమిటో చెప్పు."

"మరి వింటానంటే?"

"చెప్పరా........"

అమ్మకేం. ఏదైనా, నాలుగయిదు కాసుల నాను కొని పారేస్తే మన కీగొడవుండదురా! ఒకవేళ బాబేమన్నా అంటే – సర్దేస్తుంది కూడాను. ఏం? ఏంటంటావు?"

"బలే ఐడియా చెప్పావురా. వయస్సుకి చిన్నయినా బుద్దికి బృహన్నలివిరా. సరే రేపు" అని నేను వెళ్ళిపోయాను.

# 10

పుచ్చపువ్వులా వెన్నెల కాస్తోంది. మే మిద్దరమూ చాకిరేవుల్లో కలుసుకున్నాం. గట్టుప్రక్క కాపురముంటున్న చాకళ్ళనడిగి దోనెలు తెద్దామని బయలుదేరాం. మా పల్లం—

"దోనెలెందుకురా. ఉబ్బు దండగ. ప్రశాంతంగా వుంది గోదావరి, ఇదే యీదలేమేమిటి" అన్నాడు.

వాడు నాకు లోకువేగపండీ. దబాయిద్దామనుకున్నా. కాని వాడు చెప్పిందే బాగుంది.

"సరే, నీ విక్కడుండరా. నేను అలా వెళ్ళి ఏమైనా తిట్లు వచ్చేలా వున్నాయేమో చూసొస్తా." అని పర్యవేక్షణకు బయలుదేరా.

ఆవేళ ఎక్కడ చూచినా పెసరు తెప్పలే కనబడుతున్నాయి. పేకు పలకకోసం పరిశోధిస్తూ నెమ్మదిగా బయలుదేరా. అన్నట్టు మీకు జ్ఞాపకముండే వుంటుంది మా అమ్మకు నాను చేయించాలిగా. అలా జరగాలంటే పెద్దవేటకే పూనుకోవాలి మరి. యీ ఎద్దడికాలం ఇంకో నెలకంటే ఎక్కువ వుండదాయె

ఆ డ్రీరేవుకు వచ్చా. మనుష్యుల సంభాషణలు వినబడుతున్నాయ్. కొంచెం వెనక్కి తగ్గి చెట్టుచాటుకు వెళ్ళా — ఏమిటో ఆ సంభాషణ విందామని.

పెదప అంపంగాళ్లు వినబడని స్తేగా? రాత్రిం బగళ్ళు చెవులు కోసిన నక్కల్లా ఒకటే అరుపు. ఆ ధ్వనిలో ఆ మనుష్యుల అరుపులు కుక్క అరుపులుగా వినబడుతున్నాయి. గట్టుదిగి వెదురులాటు ప్రక్క నిలబడ్డా. యీ సారి బాగా వినబడుతున్నాయి.

"ఒరే మనరేవులో జాగ్రత్తగా కవిపెట్టండి. లంజాకొడుకుల కాళ్లు విరగగొడదాం" అన్నాడొకడు.

కోపంగా ధ్వనించిన యీ మాట వినబడి. అదేమిటో విందామనే కుతూహలంతో ఇంకొంచెం ముందుకు జరిగా.

పాపం వెంకన్నమామ కడుపు కొట్టారు. ఆ మాటానికి వాడికూలంతా విరగ్గోసా డా సాహుకారు.

అసాహంకారికి బుద్ధుండక్కర్లేదూ, వెంకన్నమామ దూలాన్ని కొరుక్కుతినేసాడా? అన్నాడు ఇంకొకడు.

ఇప్పుడర్థమైంది నాకు. నిన్న మేము తీసుకుపోయిన దూలం గొడవ్వే అది ఇక నాకు వాళ్ళు కాళ్ళరగొడతానంటే కోపంరాలేదు, పైగా ఎంతో జాలేసింది.

ఎందుకంటారా? పాపం! గడుమన్యంనుంచి, ఈ కలప తీసుకొస్తారు యీ కోయవాళ్ళు, కలపనంతటినీ, వరదలు గ్రక్కే నదిగోదావరిమీద, చలికి వాణికిపోతూ అన్ని గండాలూ దాటి ఏలాగైతే, యీరేవు చేరవేస్తారు,, ఆఖరికి మిగిలేవి మొండిచేతులు. అంతబాధపడి తెచ్చిన యీ కోయదొరలకు, రోజుకు అయిదణాల కూలి మరియెన్ని బాధలు పడతారో చూడండి.

ఈసారి యిటువంటి పేదవాళ్ళకు దెబ్బతగలకూడ దనుకున్నాను. నెమ్మదిగా వాళ్ళకు కనపడకుండా కోటిలింగాల రేవు చేరుకున్నా. రేవులో ఎక్కడ చూచినా వెదురు తెప్పలే. నదిగోదావరిలో ఎంతో ప్రశాంతంగా వున్నా విందుకుండ తొణుకుతుందా మరి — గట్టున ఎర్రరాళ్ళకు ఒక్కొక్క అలా ఢీకొంటూ, తుషారములు వెదజల్లుతూ, మధ్యలో ఏటిలోకి గల గల కేరింతలు కొడుతూ పోతున్నాయి, ఆ ఘటనలు నేను చూచి నప్పుడు గోదావరీనదీ నా కండ్ల ముందు వరకూవచ్చి, నవ్వి మళ్ళీ లోపలికి వెళ్ళిపోతున్నట్టు కనబడు తోంది.

స్మసానాలరేవు చేరుకున్నా. సాధారణంగా అర్ధరాత్రి స్మశానంలోకి వెళ్ళడం అంటే ఎవరూ తెగించరు. ఏవోభూతాలుంటాయంటారు. కాని నేనది నమ్మను, నమ్మడానికి కూడా తగినంత కారణాలున్నాయ్. ఒక్కొక్కసారి స్మశానంలో పెద్దమంటల్లా వస్తాయి. దానిగురించి నేను మా బాబు

సాహుంకారు కొడుకును అడిగాను – నాకు కాస్త చనువులెండి. అతని పేరు రవి. బాగా చదువుకున్నవాడు కూడాను: అడిగితే అంటాడు గదా:

"ఏమీ లేదురా నారాయణా: అదంతా వొట్టి భ్రమ" అని.

చూచినవాడ్ని నన్నే దబాయిస్తూంటే ఎలాగు? నేనూ దబాయించాను.

చూస్తే భ్రమంటారు ఏమిటండీ!

చిటికిన వ్రేలితో బుర్రగోక్కుంటూ అన్నాడు.

అయితే ఒకటి జరిగుంటుంది. శవాన్ని కాల్చినపుడు ఆ కట్టెనుండి వెలువడ్డ కొన్ని రసాయనిక పదార్థాలు గాలిలో వుండిపోయి తద్వ్యతిరేకమైన రసాయనిక పదార్థాలు ఆ గాలినుండి బయలుదేరినపుడు అవి భగ్గున మండిపోతాయి. ఆ మంటలే అవి" అన్నాడు.

ఆ మాటలు నాకర్థం కాలేకపోయినా అది భూతం కాదని మాత్రం నాకొక నమ్మకం. స్మశానాల రేవులో కనుచూపుమేరలో రేవు అంతా కాళీగా వుంది. రేవుకు కొంచెం దూరములో మాత్రం రే కు ప ల క లు తేలాడుతున్నాయి. పుచ్చపువ్వులాంటి వెన్నెలలో రేవులోని నీటితరగలు తళ తళ మెరుస్తున్నాయి. ప్రకాశవంతమైన చల్లని చంద్రకిరణాలుపడి స్మశానంలో మెరసిపోతున్న గోరీలు ఏవో తలపుకు తెస్తున్నట్టున్నాయి. అవును మరి! ఆ అంకశయ్యలో ఎంతమంది మహానుభావులు సాశ్వత సుఖనిద్ర చెందారో? ఆ గోరీ పెద్దలు చెప్పే పురాణాలన్నీ జ్ఞప్తికి తెచ్చాయి. నాకు ఒక సాధుగారు, కోటిలింగాల సత్రంలో ఒకటి చెప్పారు.

మనరేవు ప్రసిద్ధికి కారణం ఏమిటో తెలుసా. పిచ్చివాడా మహాభారతాన్ని రచించిన ఆదికవి నన్నయ్య లగాయితూ, ఆధునిక కవితకు బీజాలు వేసిన వీరేశలింగం లాంటివారి సమాధులన్నీ యిక్కడే వున్నాయి అని.

ఓహో అట్టి మహానుభావు లెంతమంది ఇక్కడ మట్టిలో కలిసిపో యారోనని తల్లడిల్లాను.

స్మశానాల రేవులోని టేకు పలకలు చిన్నపడవల్లా కనపడుతున్నాయి. గట్టుకివతలికి అక్కడికే దగ్గిరలోనున్న పేపరుమిల్లు పెదబొబ్బలు నక్కల అరపులు — అన్నీ ఏవో పెద్ద గందర గోళంగావుంది. కనిపెట్టే వాడెవడు, అనేక పెద్ద సమస్యల్లో ఓచిన్న సమస్య లెఖ్కా. జమా? అని.

రంయ్ మని వెనక్కి తిరిగా. బాకిరేవులలో మా తమ్ముడు ఏదో పుట్టి మునిగిపోయినట్టు పొయ్యేంటిస్తు వ్న ఇద్దరు చాకళ్ళతో అస్కుకొరుతు న్నాడు. గబగబావెళ్ళి ఎలాగు ఈడదామా అనుకున్నా. కాని ఆ ఇద్దరు చాక ళ్ళను వెనకేసుకు పోతేనేగాని. ఓ పెద్ద పలక లాక్కురాలేం. అందుచేత నేను వాళ్ళ నడిగా — వాళ్ళు పరిచయమైనవారేలెండి.

ఏమోయ్ సూరన్నా. ఈ వెధవపని ఎంతచేస్తే ఏముంది? తవుడుకు పొడుచుకున్నట్టేగా. ఇదిగో ఏమైనా ముట్టచెవుతా మీ రిద్దరూ వస్తారా?

"ఎంత ఇస్తావ్?" అన్నాడతను.

వాడికి తెలుసు — మా పని ఏమిటో. అందుకే గంట పనైనా దబ్బె క్కువ అడుగుతాడు.

సరే చెరో రూపాయి తీసుకోండి' అన్నా.

మూతి ముడిచారు. నాకు కోపం వచ్చింది.

వెధవ పొడపాము రకాలను చూస్తే నాకు బలే చిరాకులెండి. వాళ్ళ భుజాలు తడుతూ అన్నా పనిలో వస చూపండోయి. నేను మీ చేతిలో పైసా చూపిస్తా! ఏం? ....సరేనా? వూఁ!.... .... ....లెండి.

“అలా ముందే అనగూడదూ!” అంటూ వాళ్ళిద్దరూ లేచేరు మొత్తం నలుగురమూ ఖూదుకుంటూ బయలుదేరేం. మా పల్లం చెప్పిన ఐడియావల్ల దోనెలదబ్బు కలిపివచ్చింది. ఈదుకు పోతూంటే హాయిగా వుంది కూడాను. చలవరేడు తన చల్లని కిరణాలతో మాకు ఆహ్లాదాన్ని కలుగచేస్తున్నాడు. చల్లని చంద్రకాంతిలో గంగాభాగీరథి బొందివి క్రింద పవ్వళిస్తున్నట్టుంది. అలా అని నడిరేయి గోదారీతను చులకనచేసారు గన్క? ఆ సమయంలో యీతంటే నిద్రిస్తున్న త్రాచుపై సవారీ చేయటంలాంటిదే. లోతుకెడుతున్న కొలదీ గుండె గుభిలుమంటుంది…… మరేం! మజాకా కాదు…. …మేమంటారా? సిద్ధహస్తులం. “వూఁ పెద్దబార వేయండిరా! దమ్ముమాత్రం బారలు చాపి పుచ్చుకుంటారేం? అన్నా వాళ్ళతో.

గబాగబా బారావేసాం. పెద్ద అంగలమీద స్మశానాల రేవు చేరుకున్నాం. కాటికాడ వరదలా ఓ కలపయజమాని తెప్పమీద కూర్చున్నాడు. మేము కుడిప్రక్కగా తప్పించుకొని పలకలను చేరుకున్నాం. అందులో మారుజాతి పలకలుకూడా వున్నాయి. నేనన్నా.... “అదే టేకు పలక కట్లు తెగ్గోయరా తమ్ముడూ”

అది మారుజాతి తెలుసా అన్నాడు మా పల్లం.

అబ్బే టేకుపలకే త్వరగా కానిద్దురూ వెధవ కన్నగాడితోనూ, చెప్పులున్నవాడితోను అప్పులున్నవాడితోనూ వెళ్ళకూడ దంటారు అందుకే! అన్నారు చాకలిసూరన్న. నాకు “సర్” మంది — కాని అది కోపానికి సమయంకాదు.

అబ్బే! మారుజాతే అన్నాడు మళ్ళీ మా పల్లయ్య.

“నోరుమూయ్ పొరుగోడు పాడిగేదంటే. ఇంటివాడు గొడ్డుగేదన్నాడట. అలావుంది వరస. వూ తెగ్గోయి అని హూంకరించా.

కట్లు తెగ్గోసారు. బలే పలకలెండి. అనుకున్న అలోచనకు సరిపోతుంది పలక బయటకు లాగి, మళ్ళీ కట్టుకట్టి లాక్కుపోతున్నాం. ఇంకా చంనెలేదు చాకరేవులకి గాడిదల్లా ఒగురుస్తున్నారు. ఆ ఇద్దరు చాకళ్ళు గజగజ వాణికి పోతున్నారు. కుక్కతోక పట్టుకొని గోదారి యీదినట్టుంది పళ్ళతో వరుస అని నేననుకున్నాను.

'డబ్బు పుచ్చుకోడానికి యీ వాణుకుండదే! ఊఁ! పలక తోయండోయ్ రేవుకు అని. మా తమ్ముడుకు సైగచేసాను. ఇరువురమూ రెండు చివరలు ఒక్కసారిగా తోసేం. ఆ వూపూపు చేరుకున్నాం.

ఎప్పటిలాగే ఆ ట్రీసాహుంకార్ని తీసుకొచ్చి పలక చూపించాను. ఇంకేం! రెండువందల రూపాయలొచ్చాయి. అది ఆరువందల రూపాయలైనా వుంటుందిలెండి. అందులో ఆ చాకలివాళ్ళకు చెరొక రెండు రూపాయలిచ్చే టప్పటికి చంక లెగరేస్తూ పోయారు. పది నేను తీసుకొని. తతిమాది మా పల్లంకు ఇచ్చి పొమ్మన్నా.

* * * *

కోళ్ళు కొక్కొరో కో అని కూస్తున్నాయి.

నేనూ ఒక గంటలో ఇంటికి చేరుకున్నాను. మా అమ్మ కల్లాపు జల్లుతోంది. నన్ను చూచి మా అమ్మ ఏమీ అనలేదు. ఇంటిలోకి వెళ్ళాను! మా తమ్ముడు మంచంపై పడుకొన్నారు — మెలకువగానే ఉన్నారులెండి. నన్ను చూడగానే లేచి జరిగినదంతా చెప్పేరు.

ఒరే అన్నయ్యా! మొన్న దూలానికి బాబు పరపతంతా పోయిందట. ఆ ట్రీలో అంతా తిట్టారట. మత్తుగా త్రాగొచ్చి అమ్మమీద. "ఫైర్" ఐపోయాడట. ఇప్పుడే దొడ్డికి వెళ్ళారు. అమ్మేఁ నన్ను చూడగానే ఆశ్చర్య

పోయిందిరా. మొలలో బాకు కనపడింది. దవిగో కంగారెక్కువైంది. ఆ కంగారుచూచి అమ్మకు వెంటనే ఆ డబ్బంతా ఇచ్చేసా మరీ భయపడింది. మీఅయ్యొస్తే తిదతాడు త్వరగాపడుకో" అని పడుకోబెట్టి దుప్పటి కప్పేసింది

కాకిపిల్ల కాకికిముద్దుగవండీ మరి। నేనన్నా సరే। నాన్న వచ్చేలోగా నేనెళ్ళిపోతా, చీవాట యినా తప్పుతాయి' అని నేను బయటికి వచ్చా

మా బాబు కాలయముడులా ఎదురై చేతిలోనున్న చెంబు. నామీద విసరి ....

"లమ్డీకే। ఎవడి గుమ్మం అని ఎక్కావురా। గౌరవం అంతా గంగపాలు చేస్తున్నావు. ఈదఫా గుమ్మం ఎక్కితే కాళ్ళిరగ్గొడతా — అముండననాలి. నిన్ను గుమ్మం ఎక్కనిచ్చినందుకు" అని గబగబా మీదకొచ్చి మెడ పట్టుకు గెంటాడు.

నాకు పొడిచేద్దామా అన్నంత కోపమొచ్చింది. తీరా — కండ్రి చేతులు రాలేదు. మీరే చెప్పండి। తెచ్చిన సొమ్మంతా ఇంట్లోనే పోస్తుంటే. ఇంకా పురకతం ఎందుకు? చిన్నప్పటినుండీ నేను తిన్న దెబ్బలూ — అన్నీ గిర్రున బుర్రలో తిరిగాయి ఆవేదనతో నా హృదయం ద్రవించిపోయింది. "సరే వెళ్ళిపోతున్నా।" అని వచ్చేసా.

"ఎతి అలంజాకొడుకునుకూడా పొమ్మను" అని మా అమ్మను కూడా గపిరాడు. దాంతో మా పల్లంకూడా నా వెనుకే వచ్చేశాడు.

# 11

గోదావరి కలపంతా. కొంచెం మించు మించు అయిపోయినట్టే. హేమంత ఋతువుకూడా పూర్తి కావస్తోంది. కలప ఎద్దడి కాలం పూర్తి అయిపోయింది అప్పటివరకూ మేమిద్దరం ఇంటికి పోకుండా రెండు మాసాలు గడిపేసాము. అంతవరకూ మకాం కోటిలింగాల సత్రమే ఇక అద్దె మాకు ఆధారం. రేవులో కలప లేదుకదండీ మరి

ఆవేళ వుదయాన్నే అడ్తీకి చేరుకున్నాం — కడుపునిండా టిఫిన్ చేద్దామని. మా ఖాతా హోటలుండిలెండి — అడ్తీలో. అందరికిమల్లె అర చేయంత పెసరట్టువేసి అణా పుచ్చుకోడు. అలాగయితే కూలిజనంము దు అరగంటకు ఎత్తేస్తారు. విసనకర్రంత పెసరట్టుకు అర్ధణాకంటే ఎక్కువ పుచ్చుకోడు. కడుపునిండా టిఫిన్ చేసి, రంపంమిల్లుకెదురుగా వున్న, శవాల చెట్టు క్రింద సిగరెట్లు కాలుస్తూ కూర్చున్నాం — శవాలచెట్టు అంటే ఏదో అనుకోకండి. ఏశవాన్నైనా యీ చెట్టుక్రింద దించకుండా శ్మశానం లోకి తీసుకెళ్ళరు. అందుకే దానిని శవాల చెట్టు అంటారు. ఎదురుగుండా సినిమాబోర్డులున్నాయి. నేనే అన్నా మా పల్లంతో —

"ఒరే తమ్ముడూ! యీవేళ సినిమాకు పోదాంరా?"

ఏ సినిమాకి? అని ప్రశ్నించాడు మా పల్లం.

"గజలక్ష్మిలోకి ఏదో వచ్చిందటగా!"

నాకంటె పల్లయ్యకే బాగా తెలుసు — యీ సినిమాల గొడవ. అన్నట్టు వాడికి సంపాదన వొంటికి పటితేనేగా.

"ఓస్ అదా! అరవసినిమా? వట్టి వెధవ పిక్చరు! అంతా మోళీలూ, మంత్రాలూ, ఆడవాళ్ళ చన్నులూ తీశాడురా — డబ్బుచేసుకోవడమేగా. వాళ్ళకు కావలసింది సరే. అదిగో చూడు. గోడకి "మజదూర్" బలే పిక్చరులే. హిందివాళ్ళు తీశారు. కార్మికుల కష్టాలూ ధనికుల దౌష్ట్యాలూనూ, బాగా వుందట ఏం? వెడదామా?' అన్నాడు. "ఓరిపిడుగా! ఎంతవాడుగల్లేవురా" — అనుకున్నా.

"మజదూర్"కు అసలెవడూ వెళ్ళటం లేదటగా అన్నా.

"ఎందుకెడతారు? — అదీ మనలాంటి వెత్తసరుకే." తీవ్రంగా అనేసి మళ్ళీ

'అయితే ఏం? అబ్బ ఏం సినిమారా అది.' అని చిటికేశాడు.

ఇక నేనొప్పుకోకపోతే. దానికి ఇంకా పెద్దాపురం బాంౘ్రాలంత అల్లుతాడని నాకు తెలుసు ". రే' అన్నా

"మరి డబ్బో.' అన్నాడు. అలా అంటాడని నాకు తెలుసు. "నీవిక్క-డుండరా. అయిదు నిముషాల్లో తెచ్చుకొస్తా" అని మావాణ్ణి కవాలంత క్రిందే కూర్చోబెట్టి నేను బయలుదేరా.

అడ్తి మహాకోలాహలంగా ఉంది. పెద్దబుట్ట తలపాగాలున్న మేస్త్రీలు కూలీలమీద హటంచేస్తున్నారు శేషగిరిరావుగారి అడ్తివద్ద గొడవగావుంది శేషగిరిరావు మా బాబు సాహుకారే మర్యంవాళ్ళు కొంతమంది నిలబడి వున్నారు. శేషగిరిరావు కేకలేస్తున్నారు.

"రోజుకీ ఎవడిసొమ్ము తేవడం కుదరదు మీరే ఆడుతున్నారు ఈ నాటకమంతా. మీ కూలీలోనే విరగ్గోస్తా" అంటున్నాడు శేషగిరిరావు.

ప్రక్కనున్న జట్టుకూలి ఒకడు —

"వాళ్ళకొచ్చేదే పావలా డబ్బులు. అందులో విరగ్గోస్తే. వాళ్ళ భార్యాబిడ్డల గతేంకాను. చెప్పండి" అన్నాడు.

"విన్నైవడూ బొట్టూ. కాటుక పెట్టి పిలువలేదులే వూరుకోవోయ్.'

ఇలా సంభాషణలు జరుగుతున్నాయి. యీ గందరగోళంనుండి తప్పించుకోడానికీ. చుట్టూ తిరిగి. అడ్తి చివరకు బయలుదేరేను.

నేను వెనక్కి జంకా. అలా వెనక్కి మళ్ళానో. లేదో చటుక్కున చేయిపట్టుకొని లాగేడు. తిరాచూస్తే ఇంకెవడు? అడ్తికాపలావాడు అప్పన్న. వాడు నాకు పరిచయమే.

"ఏమోయ్ మామా, అమ్మాయి పెద్దమనిషయిందా?' అన్నా. అయిందని నాకు తెలుసు.

అప్పన్నకు కోపమొచ్చింది. నేను ముందుకడుగేయబోతుంటే. చొక్కా కాలరు పట్టుకొని ——

ఏడిశావులే వెధవవు? పద మా సాహుకారి దగ్గరికి' అని కండ్లెర్ర చేశాడు

"వెళ్ళదాంలే తొందరపడకు. ఇద్దరి దీ తేలుద్దాంలే. పరేకాని అబ్బాయిని కుదిర్చావా?'

అప్పన్న ముక్కు రెమ్మ లెగరేశాడు. కాని వాడికి ఏదో భయమేసింది. వాడిరంకులున్నాయిలెండి వాడిసాయం లేకపోతే. అ ఢ్డీలో కలప కదిలించడం మాటలేమిటి? వుక్రోషంతో నా ఆపాదమస్తకం పరికించాడు. వాడికి నా సంగతి బాగా తెలుసు. రేపు వాడి అడ్తీకే ఎసరు పెడతానని. అందుచేతనే కాబోలు. కాస్త తగ్గి అన్నాడు.

"పట్టిచేరా! నీకు కాస్త భయంచెపుదామని అంతే. లేకపోతే నిన్ను సాహుకారి దగ్గరకు తీసుకెడతానా?'

"ఆహా. నీ సంగతి నాకు తెలీమా. రావోయ్! అప్పన్నా కాఫీ తాగుదాం' అని భుజంమీద చేయివేశాను.

నేను కాఫీ త్రాగమనడంలో ఏదో అర్థముందని కాబోలు. నాతో పాటే హోటలుకు వచ్చాడు. హోటలులో నాకు అరువు ఖాతా వుంది. టిఫిన్ ఇప్పించిన తరువాత అన్నా.

"ఏమోయ్! షల్లయ్యగారి అడ్తీకి యీవేళ వేస్తాం. నీ ప్రక్కనేగా. నీవు నోరెత్తకూడదు సుమా,?'

'అది తెలుసుగాని, నా మాట గురించి మరచిపోవుగా' అన్నాడు. వెంట్రుకలు ఒత్తుగా పెరిగిన కనుబొమల క్రింద నుండి చూస్తూ.

"సరేగాని ఓ రెండుంటే ఇప్పించు మామా?' అన్నా తమాషాగా.

సరే, రెండే వున్నాయి నాదగ్గరానూ' అన్నాడు. రెండు రూపాయలు పుచ్చుకున్నా.

అప్పన్నను, నమ్మించి గొంతుక కోసేశాం. అనుకునేరుగనక. మీరు. ఎవరయితే ఏంచేస్తారు చెప్పండి. ఏమాటకామాటే చెప్పాలి, వెధవ పదిరూపాయలు. నెలకు ఏం సరిపోతాయి – నలుగురు తినేవాళ్ళుగల అప్పన్నకి.

ఆ రెండు రూపాయలూ, పుచ్చుకొని, మా తమ్ముడు వద్దకు వెళ్ళాను. వాడు "ఇంత ఆలస్యమా?' అని బుసగొట్టాడు. పిల్లకాకికేం తెలుసు? వుండేలు దెబ్బ. ఈ రెండురూపాయలకూ నేను పడ్డ శ్రమ — వాడికేం తెలుస్తుంది? వెంటనే రెండూ వాడి మొహంమీద పారేసాను. రెండు మంచుముక్కల్లా పనిచేసాయి చల్లబడ్డాడు.

◆ ◆ ◆ ◆ ◆

మావాడితో ఏవో అన్నానుగాని, సినిమా మాత్రం చాలా గొప్పగా వుంది. అంతగొప్పగా వున్నదని ఎందుకన్నానంటారా? కార్మికులంతా ఏకమైతే, ఒక యజమాని ఏంచేయగలడు? అంటాడు, అందులో నాయకుడు. ఆఖరికి అలాగే జరిగింది కూడాను.

సినిమా అయ్యాక మేము ఆకబుర్లూ, ఈకబుర్లూ చెప్పుకుంటూ ఇంటికి చేరుకునేప్పటికి పదకొండు దాటిపోయింది. సద్దుమణిగిపోయింది.

అడ్డి మొగలో మా తమ్ముడ్ని కూర్చోబెట్టి నేను అప్పన్న దగ్గరకు బయలుదేరేను.

ఓః ఇంకేం? అప్పన్నమాత్రం తక్కువ తెలివైనవాడా యేమిటి? ప్రక్క కావలాదారుని తనవద్ద కూర్చోబెట్టుకొని కబుర్లు చెబుతున్నాడు.

ఈ వేళ కష్టబడకుండా పనిజరిగేలాగుంది. వెంటనే మా తమ్ముడికి సైగచేసేను. వచ్చేడు. ఎవర్నూ చూడకుండా నేను నడిరోడ్డుమీద నిలబడి, పల్లయ్యను దూలం లాగమన్నా. తెలివితక్కువ పెద్దమ్మంట! ఎవరైనా క్రిందిదూలం లాగుతాడా? వాడు వెళ్ళి ఆ లాటుక్రింద దూలం లాగేప్పటిక్కి పెద్ద శబ్దంతో లాటులో దూలాలన్నీ దొర్లిపోయాయి. పల్లయ్యకాలు వాటి క్రింద పడిపోయింది.

నేను పల్లయ్యను బయటకు లాగటానికి చాలా ప్రయత్నించాను. లాభం లేకపోయింది. ఇంతట్లోకే ఆ శబ్దంవిని కాపలాదార్లంతా చుట్టూ క్రమ్మేసారు. చివరికి వాళ్ళతో అరగంట దెబ్బలాడినా తప్పించుకోలేకపోయా. నేనుకూడా చిక్కిపోయా. ఒకడు మంచి బలంగా, నా తలమీద కొట్టాడు. విందు కొబ్బరికాయ పగిలినట్లు "ఢన్" మంది — నా తలకాయ. బొటబొటా రక్తం కారిపోతుంది. ఇక లాభంలేదనే. మొలనున్న బాకుతీసి ఒక్కడిని గతుక్కున పొడిచేటప్పటిక్కి. పిరికినాయాళ్ళు! రక్తం కండ్లచూచేటప్పటిక్కి కాళ్ళకు బుద్ధిచెప్పారనుకోండి! నేనూ ఎలాగో తప్పించుకుపోయా. మిగతా కాపలావార్లంతా క్రిందపడ్డ పల్లయ్యను, బలవంతంగా పైకిలాగి, తలకొక బాదుబాది, ఎదురుగా వున్న చెట్టుకు కట్టేసారు. "సగం గొడవ తగ్గిపోయిందనుకుంటూ" కావలాదార్లు ఎవరి పనుల్లోకి వాళ్ళు వెళ్ళిపోయారు. పేపరుమిల్లు సరిగ్గా ఒంటిగంట కొట్టింది. నేను ప్రక్కనే

వుండి ఇదంతా కనిపెడుతున్నా. గ్రుడ్డిముండాకొడుకులు. నన్ను కనిపెట్ట లేకపోయారు.

ఎదురుగా పది గజాలదూరంలోనున్న కాపలాదారు ఒకడు కునికిపాట్లు పడుతున్నాడు. నేను నెమ్మదిగా పొట్టమీద ప్రాక్కుంటూ,ఆ చెట్టు వెనక్కి జేరి, నెమ్మదిగాలేచి, మా తమ్ముడు చెవిలో — " ఉష్. తెగకోసేస్తున్నా. సర్దుకో!" అన్నా. వాడు వులిక్కిపడి నన్నుచూచి వుప్పొంగిపోయాడు. వికసిత వదనంతో — "ఉష్. రడీ' అన్నాడు. కాపలాదార్లు కొట్టినప్పు డున్న బాధ ఇప్పుడు మావాడి ముఖంలో లేదు. మంచి హుషారుగా వున్నాడులెండి. వెంటనే మొలనున్న బాకుతో కట్లు తెగగోసేసాను. ఇద్దరం పంజరంలో చిలకల్లా ఎగిరిపోయాం.

## 12

సంసారంలేని సన్యాసులకు సత్రాలే ఎందుకు సుఖంగా వుంటాయో నాకు బాగాతెలుసు. సత్రాల్లో వుచిత భోజనాలే కాదు వాళ్ళను తృప్తి పరచేవి — నూరువరహాల పూలచెట్ల క్రింద ఆ నాపరాయిపై నుండే ంతటి చల్లదనం, ఇంకెక్కడా దొరకదు.

మేము తప్పించుకొని, ఇక్కడకే చేరుకున్నాం. మా తమ్ముడు చాలా విచారంగా కనబడుతున్నాడు.

"నెమ్మదిగా యింటికి చేరుకోవాలిగా. ఇంటిపట్టు దేనికిసాటి వస్తుంది? పూరిగుడిసె అయినా అందులో ఉన్నహాయి యిక్కడ వుంటుందా?" అన్నాడు మావాడు.

నేను, వాడివంక తిరిగి, జాలిగా చూస్తూ,

"రాత్రి గొడవ అందరికి తెలుస్తుందంటావా లేదంటావా? ఇంటికి వెళితే బాబు బ్రతకనిస్తాడురా."

"మనం చేసుకున్నదే. లేకపోతే ఇంటికి వెళ్ళేటప్పటికి, మనం దుర్మార్గులమని తెలిసికూడా ఏ తల్లైనా హాయిగా చూసేది?" అన్నాడు మావాడు వాడిముఖం తల్లికోసం అరుస్తున్న మేకపిల్లలావుంది.

నాకు జాలేసింది.

"నిజమే తల్లిలేని బ్రతుకు, కళ్ళులేని కబోది బ్రతుకుతో సమానమే అనుకో. కాని, ఇటువంటి తల్లిదండ్రులు వుండడంకంటె లేకపోతేనే మేలురా' అన్నా.

వాడికి కోపమొచ్చినట్టుగా వాడి ముఖం చెబుతోంది.

"నీవెప్పుడూ ఇంతేరా, అబ్బ. నాకాకలేస్తుంది' అని చేతులు తల క్రింద పెట్టుకొని, నాపరాయిపై వాలిపోయాడు.

" రా, మన ఖాతాదారుడున్నాడుగా, లే.' అని మా తమ్ముడ్ని లేవగొట్టుకొని అడ్డీలో హోటలుకు తీసుకెళ్ళాను. అప్పటికి పదిదాటి పోయిందిలెండి.

హోటలు కుర్రాడు నావద్దకు వచ్చి –

'ఇదిగో నారాయణా, నీకో చిన్న సంగతి చెప్తా.' అన్నాడు. వాడు నాకు తెలిసినవాడే. వాడిముఖం – చీమలు తిన్న రొట్టెలా వుంటుంది. నేను వాడికి టిఫిను ఇప్పించని రోజే ఉండదు, బలే విషయాలు సేకరిస్తాడులెండి.

"వుండరా టిఫిన్ అయిపోవియ్." గబగబా పెసరట్లు మడతలు పెడుతూ, అన్నా.

"కాదు అర్జంటు సంగతి.'

"ఏంటది.'

వాడు చెప్పడం మొదలెట్టాడు.

'ఏం. ఏం.............'

"ఏం, ఏం, ఏంటిరా నీ ముఖం, అదేదో కాస్త త్వరగా ఏడుద్దూ" అన్నా. వాడికి కాస్త నత్తిలెండి.

"ఏం, ప్రొద్దుట. నేను శేషగిరిరావుగారికి పెసరట్లు తీసికెళ్ళితే అక్కడ మీ బాబును కేకలేస్తుండటం నేను చూచా "

మా బాబు, శేషగిరిరావుగారిని అబ్బాయిగారూ, అని పిలుస్తాడు. శేషగిరిరావుగారు పిల్లవాడనుకునేరు — కాదుకాదు ఒకపికే ఇద్దరు పిల్లలు. మనిషంటారా? పొట్టి కదవంతుంటుంది — ఇక వూహించుకోండి — రూపం. శేషగిరిరావు కూడా మా బాబును గౌరవంగానే చూస్తాడు. వ్యాపారమర్మాలు మా బాబు మేస్త్రీగా, శేషగిరిరావుకు కుడిభుజంలాగు వుండి చెబుతుంటాడు. అయినా వర్తకులతోటి వ్యవహారమంతా, "ఎక్కడైనాబావ అనుగాని వొంగతోటవద్దమాత్రం ఆనకు" అన్నట్లు వుంటుంది గదా. ఏదో గొడవలేకుండా ఎందుకు కేకలేస్తాడు" అని నేననుకొని, నోటిలో పెట్టిన పెసరట్టు ముక్కతీసి, చేతితో పట్టుకొని, ఆత్రుతగా అడిగా.

"ఆసలు గొడవేమిటి?"

"గొ....గొ.... గొడవంటావేమిటి? శేషగిరిరావు ఒక్కడే కాదు వర్తకులంతా మీ బాబును కేకలేశారు. పెద్ద గందరగోళంగావుంటిలే. అయితే మీ బాబు ఏమన్నాడో తెలుసా.... చేతులు నలువుతూ, ఏంచేయ మన్నారు చెప్పండి! వెధవల్ని కొట్టినా తిట్టినా బుద్ధిరావడంలేదు. మొన్న పెద్దలంజాకొడుకు నన్ను పొడవబోయాడు కూడాను అన్నాడు'

నాకిప్పుడర్థమైంది. ఇదంతా నిన్నటి గొడవేనని. అబ్బ నత్తిముండా కొడుక్కి ఎంతజ్ఞాపకమనుకున్నారూ .... గ్రుడ్డివాడికీ, నత్తివాడికీ, చెవిటి వాడికీ జ్ఞాపకశక్తి వుండటం సహజంకూడా అని నేనుకుంటూ అడిగా.

"ఊ! శేషగిరిరావుగారేమన్నారు?"

"ఏమంటాడు? అయితే పట్టుకొని పోలీసు స్టేషన్కు వొప్పగించేస్తా" నన్నాడు.

ఓసోసి నేను దొరకద్దూ — వీడు అప్పగించడానికి అనుకొని—— 'సరే మా బాబు ఏమన్నాడు?'

అలా చేయొదని పాదాలపై పడి, "పెద్దలంజాకొడుకు వాడ్ని పాడు చేస్తున్నారండి? లేకపోతే బాగుపడేవాడే. వాడికి ఏదైనా పని .... అని మొత్తుకున్నాడు.... మీకు ఉద్యోగాలు దొరుకుతున్నాయిలే" అని మెల్ల కన్ను ఎగరవేశాడు కుర్రకుంక.

"ఓ చెప్పరా, లంగడాగే?" అన్నా సర్దాగా కొత్తేంకొడుతూ,

"మరి నేను చెప్పనంతే!" అని మారాంచేశాడు.

"బాబువుకదూ, చెప్పరా?' అని గెడ్డంపట్టుకున్నా.

'ఆ(, అలాదిగిరా విను. శేషగిరిరావుగారే ఏ....ఏ.... ఏమన్నారో తెలుసా, "సరే పల్లయ్యను అందాకా అడ్డీలో పెట్టు. నారిగాడి గొడవ

నేను చూసుకొంటాలే. వాడ్ని అడ్డీలో పెడితే మరింత దొంగవెధవవు తాడు. వాడిని మా యింటికవద్ద పెడతాను కాస్త చదువుసంధ్యలు చెప్పించి బుద్ధి వచ్చేలాచేసి, ఆ మూడుముళ్ళా వేయించేస్తే వచ్చి ట్టు పడుంటాడు... " అన్నాడు 'ఇంకేం తంతే బూరెలబుట్టలో పడుతున్నావ్ " అని ఇంత లోకే ఏదో బేరంవచ్చి వాడు షావుకారు పిలిస్తే వెళ్ళిపోయాడు.

"అమ్మ. శేషగిరిరావుగారి రొట్టె నేతిలో పడింది' అనుకొని. "ఏమిరా, ఏమంటావు?, అని మా తమ్ముడ్ని కదిపేను. మౌనంవహిం చాడు. మౌనం అంగీకారసూచకమేకదండీ?

మేమూ టిఫన్ చేసి బయటకు వచ్చేం. యాదృచ్ఛికంగా, అడ్డీ సెంటరులో, శేషగిరిరావుగారు ఎదురయ్యారు. భోజనానికి వెడున్నారను కుంటా. ఒక్కసారి నా గుండెలు జల్లుమన్నాయి. నేనే చొరవతీసుకొని

"నమస్కారమండీ.' అన్నా.

"వంకదణ్ణాలకేంలేరా? వెధవా," అని వనువుగా తొణక్కుండానే మాట్లాడాడు.

"మీతోనా మా వేళాకోళం, అలా అనుకోకండి'

"అయితే రండి, మీతో మాట్లాడాలి ఇంటికి వెడదాం?" అన్నాడు. మేమిద్దరం. శేషగిరిరావుగారి కూడా నడుస్తూనే ఉన్నాం.

శేషగిరిరావుగారు నా చేయిపట్టుకుని ముందుకులాగి, మా పల్లయ్య గాడి భుజంపై చెయివేసి —

'దేవాంతక నరాంతకులురా మీరు, మీ దుంపతెగా, సుఖంగా బ్రతకనివ్వరదురా?"

"చెప్పండి ఏంచేయమంటారో." అన్నా నేను.

'మీరేం చెప్పినా సిద్ధం' అన్నాడు పల్లయ్య.

శేషగిరిరావుగారి ముఖంలో సంతోషం తొణికిసలాడింది. మేము ఏమంటాడోనని. అతని ముఖాన్నే ఏకదీక్షగా చూస్తూ నడుస్తున్నాం. మా ఎదుట ఓ మేడ ప్రత్యక్షమైంది — అది శేషగిరిరావుగారిదే.

# 13

అది రెండ తస్తులమేడ. ఆ మేడద్వారాలన్నీ నాకు కొట్టినపిండేలెండి. ఆ పకలో చాలాసార్లు వచ్చాను. ఆ మేడ సరిగ్గా గోదావరి కుడిపైపు గట్టు క్రింద వుండడం వలన చక్కని గోదావరిగాలి వీస్తోంది. దొడ్డిమాత్రం చాలావిశాలంగా వుంది ఆ ప్రాకారంలో, పెరుగుతున్న వికసించిన పూల చెట్లు, సువాసన వెదజల్లుతూ ఎంతో హృదయాహ్లాదంగా వున్నాయి క్రింది అంతస్తులో. కోమట్ల చిహ్నాలన్నీ వున్నాయి పొగచూరిపోయిన గదులూ, తాతల కాలంనాటి నిలువున్నరఎత్తు మంచి లావైనకోళ్ళుగల పదిరిట్టి మంచం లక్ష్మి. సరస్వతి, పార్వతీ, వినాయకుడు, మొదలయిన పెద్ద నిలువెత్తు పటాలు అన్నీచూస్తే వికారంగా వున్నట్టుటాయి అవి జీవనం లేని బొమ్మలుగాని, నిజంగా జీవనమే వుంటే ఒక పది నిమిషాల్లో ప్రాణాలు తావుమని ఎగిరిపోతాయనుకోండి. ఇక పై అంతస్తు అంటారా? ఆ గదులు చూస్తే నేచాలు ఎటువంటి వాడైనా సమ్మోహితుడై పోవలసిందే. శేషగిరిరావుగారి అబ్బాయి వున్నాడే — రవి; ఎర్రగా పొడుగ్గా వుంటాడు, గొప్ప చిత్రకారుడులెండి. ఇందుకే బి.ఏ. రెండేళ్ళు ఫేలయిపోయి ఆం

రుకు మానేశాడు. ఇంతకీ చెప్పబోయేది ఏమిటంటే కోమటింట పుట్టవలసి నోడుకాదు. ఆయన గీసిన నగ్న స్త్రీలు, చిత్రపటాలే వాటి ఆకర్షించ డానికి.

మేము ఇంటిలోకి అడుగుపెట్టేటప్పుడు రవి, ఎవరో స్నేహితుడితో ఏదో మాట్లాడుతున్నాడు. శేషగిరిరావుగారు లోపల అడుగుపెట్టగానే –

'రవీ, వుమ ఏదిరా? ఇలాపిలు ' అన్నాడు.

"వుమా!" అని పిలిచాడు రవి. మళ్ళీ మావైపు చూచి, వాళ్ళ నాన్నతో –

'యీ దొంగవెధవల్ని ఎక్కడపట్టావు నాన్నా!' అన్నాడు. నేనంటే రవికి బాగా తెలుసులెండి. అప్పుడప్పుడు దబాయించి, సినిమాకని డబ్బులు పట్టుకుపోయేదీ రవిగారి దగ్గరే.

'యీ వెధవల్ని బాగుచేయకపోతే పాడైపోతున్నార్రా! పద! నీ పని కూడా వుంది. పైకి వెళదాం ' అన్నారు శేషగిరిరావుగారు. మేము ఆయనతో ముందుకు సాగాం.

రవికూడా లేచి ఎదట స్నేహితునితో కరచాలనంచేసి "రేపు కలుసుకుందామోయ్.' అని మా వెంటరాసాగాడు.

ఆ లేచిన యువకుడు పరిచయమున్న వ్యక్తిలా మా ఇద్దరి ముఖాలూ చూడకుండా బయటికి వెళ్ళిపోయాడు.

రవి నన్నుద్దేశించి –

"ఏమిరోయ్, నారాయణా వీడు మీ తమ్ముడేమిటి? ఇసుక తక్కెడ పేడ తక్కెడ గాండ్లలాగున్నారే – వాడెప్పుడూ సినిమాడబ్బులకోసం రాలే

దేమిటి? అన్నాడు ఎగతాళిగా.

నేను పకపకా నవ్వేను.

మేము మేడమెట్లు ఎక్కుతున్నాం. ఉమ టకటకమని మెట్లు దిగుతూ మాకెదురయింది. ఉమ శేషగిరిరావుగారి కూతురే, ఏదో చదువు కున్నదే. సంగీతం కూడా పాడుతుంది. పెదాలకు ఏదో రంగువేసి నట్టుంది, అందుకే పెదాలు పగడాల్లా మెరిసిపోతున్నాయి. ఆవిడ యవ్వనం దేనినో వెదుకుతున్నట్లు కనబడింది.

"సరే ఉమ! టీ కలిపి తీసుకురా! నేను బట్టలు మార్చుకువస్తా." అని శేషగిరిరావు మేడదిగి వెళ్ళిపోయాడు. మేము మేడ ఎక్కాము.

అది బహుశ శిశిరఋతువేమో. గోదావరి అప్పుడే తీత మొదలెట్టింది. మధ్యాహ్నం పదకొండు అయింది. సూర్యకిరణాలకు, నదీజలం ధగ ధగ మెరుస్తూ ఆ కెరట్లపైకి, విద్యుత్కాంతులను వెదజల్లుతున్నట్టుంది. గోదావరి మధ్య ఇసుక తిన్నెల్లోని. ఇసుకరేణువులు గాజుముక్కల్లా తళ తళా మెరుస్తున్నాయ్. శిశిరఋతువు ఎంత చల్లదనం ఇచ్చినా. సూర్యుడు కన్నెర్రచేస్తే ఏముంది. చెప్పండి? ఇంతలోనే ఉమ టీ తెచ్చింది.

రవి బలవంతంవల్ల మేమూ టీ త్రాగక తప్పిందికాదు. ఇంతలోకే శేషగిరిరావుగారు పైకి వచ్చి సంభాషణ మొదలెట్టారు.

"అబ్బాయి, యీ నారాయణకు నాలుగు అక్షరంముక్కలు చెప్పాలిరా' అన్నాడు రవితో.

"ఏడికా' వీడే నాకు చెబుతాడు.' అని నవ్వాడు, ఉమా పకపకా నవ్వింది. శేషగిరిరావుగారుకూడా చిరునవ్వు నవ్వుతూ — వెంటనే ముఖం సీరియస్గా పెట్టి.

"చూచావురా. నీ పేరెత్తేప్పటికి ఎవరయినా అసహ్యించుకుంటారు" అని ముఖంలోకి చురచురాచూచేరు. ఇక అక్కడనుంచి ఎత్తుకున్నారు పురాణం. మా బాబు పురాణానికీ వీరి పురాణానికీ తేడావుందిలెండి మా బాబు పురాణం విప్పారంటే పట్టి బూతులేగా. ఇక శేషగిరిరావుగారు బుర్రవాచిపోయేలా పెడుతున్నాడు చీవాట్లు. మా తమ్ముని ముఖంలోకి చూచి –

"ఏమిరా నీవు ఆదిత్ కొస్తావా?" అన్నారు

"మీఇష్టం అని ముందే చెప్పానుగా' అన్నారు మా పల్లయ్య.

దాని ఆపరాశంగా తీసుకొని, శేషగిరిరావుగారు "అవును నీ పెక్కడ చెప్పినమాట వింటావురా? మీ బాబుమీదకి బాకు పుచ్చుకు వెళ్ళేవటగా." అని నాపై కిండ్లెరచేశారు.

ఇదంతా చూస్తున్న రవి ఏమనుకున్నాడో, నన్ను బుజ్జగిస్తున్నట్లుగా –

'నారాయణా, నా మాట విను. నిన్ను సుఖంగా చూస్తాను. యిక్కడుంటే నీయిష్టం అనుకో" అని బ్రతిమలాడటం మొదలెట్టాడు. నేను అంగీకార సూచకంగా మౌనందాల్చాను. అంతే. ఇక అప్పటినుండీ నేనా యింటి సేవకుడ్నయిపోయా.

# 14

వసంతకాలం తరుముకువచ్చింది. ప్రకృతి నిండుయౌవనంలో వున్నట్టుంది. పెరట్లో పుష్పవనంలో చెట్లన్నీ తమ యౌవ్వనపు వికసనకు, మురిసిపోతున్నట్లున్నాయి. మంగి, శేషగిరిరావుగారింటిలో పనికత్తె. మంచి చెలాకైన పిల్లలెండి. నేరేడుపండులాంటి నీలవర్ణపు బిగుదైన శరీరం.

సుంద్రదనీముఖం చెప్పుకోతగ్గదేదంటే _ మంగి శరీరచ్ఛాయలో మిళిత మయ్యే అకనుపాపల నీలికాంతి. ఆవేళ మల్లెమొగ్గలకోతకు పుమ మంగిని పంపింది మల్లెపందిరి ఎక్కి తదేకధ్యానంతో. మొగ్గలను కోస్తోంది. అంత తదేకధ్యానంతో కోయడానికి అవేమైనా గులాబిల్లాగ గ్రుచ్చుకునేవి కాదుగా. అయితే ఎందుకలా కోస్తోందంటారా? ఆ మల్లెల మకరందాన్ని గ్రోలుతూ, ఒక తుమ్మెద ఝుయ్‌మంటూ, మంగి కోస్తున్న పందిరిమీదే మంగి చుట్టూనే తిరుగుతోంది. ఆ తుమ్మెద అలా తిరగటంలో ఏదో అర్థముందిలెండి.

అదేసమయంలో మొక్కలకు నీళ్ళువేయడానికి. పార ఒకటి పట్టుకొని నేనూ పెరటిలోకి బయలుదేరా. పందిరిమీద మంగినిచూచి. అనుకోకుండానే నా చేతిలోని పార జారిపోయింది. మంగిని చూడగానే, శరీరం గగుర్పొడిచింది మంగిని గమ్మత్తుచెయాలనుకున్నా. మంగి ఎక్కడచూస్తాదోనని నెమ్మదిగా ప్రక్కనుంచి, పందిరిక్రిందకు జేరుకున్నా. నెమ్మదిగా ఏ విధమైన స్పర్శ తగలకుండా, పాములా వ్రేలాడుతున్న మంగి జడను పందిరిగెడకు కట్టేసి, దిగడానికి వేసుకున్న నిచ్చెనను లాగేసా. ఇంత చనువు ఎందుకంటారా నాకు? ఇద్దరం ఒక ఇంట్లో పనిచేసేవాళ్ళం. ఒకకులం ఆడితిలో అప్పన్నలేడూ? అతని కూతురే కూడాను. అదీగాకపోయినా. మా చూపులు ఏనాడో కలిసాయి. అందులో ఒంటరిగా. పుష్పవనంలో దొరికింది. నేనేం ముసలివాడ్నేమిటండీ వూరుకోవడానికి? నేనూరుకుంటే నా యవ్వనం ఊరుకోవద్దూ?

మల్లెమొగ్గలుకోసి పైటలోపోసుకొని. లేవబోయేటప్పటికి. మెడ ఒరిగి, 'కుయ్' మని యిలవేసినట్టు అరిచింది. ఆ మంగి అరుపుకు ఆ

వాడిలోని మల్లెపూవులు నవ్వుతూ క్రిందరాలిపోయాయి. నా షట్టుకు మాత్రం మంగి "కేర్"మన్నా. ఆ వాడిలోంచి రాలినమొగ్గలు మంగి పెద వులజారిన నవ్వుల్లాగే తోచాయి.

నేను వెంటనే యెదుటికివచ్చి—

"అయిందా! ఇంకెప్పుడూ నామీద పెత్తనం చెలాయించకే!" అని చూపుడువ్రేలును ఆడించాను.

"నాఇష్టం' అంది మంగి బెట్టుసరిగా.

"నీ ఇంటినగ్గర " అన్నా నేనూ బెట్టుసరిగానే.

నేను మొండిఘటాన్నని మంగికి తెలుసుగా. వెంటనే కాళ్ళబేరాని కొచ్చేసింది.

కొంచెం విప్పేద్దూ! నీకు పుణ్యముంటుంది."

నేను బిర్రబిగిసిపోయాను.

'మరి నన్ను పెళ్ళాడతానంటే!"

"ఓఁ అందగాడివని" అంది వెక్కిరిస్తూ.

"హేఁ! మనమా! నా ఎర్రటి ముఖం— వుంగరాల జుట్టు. గవ్వల్లాంటి కళ్ళు.... హేఁ!.... నా అందం నీకెలా వస్తుందే! హూ! నీవూ వున్నావ్ — జీడిపిక్కలా నల్లగా" అని నేను వెక్కిరించా. మళ్ళీ కాళ్ళ బేరానికి వచ్చింది. ఏలాగూ ఆడవాళ్ళ హృదయం అతిసున్నితమైందికదండీ!

"సరే పెళ్ళాడుతా విప్పు.'

'ఆఁ అలా దిగిరావే నాగా" అని ముడి విప్పేశాను.

'మరి విచ్చేవో!" అంది.

"పరవాలేదులే, మాకేయ్, నేనున్నానుగా!'

"అబ్బ విడ్చెపెట్టూ, అమ్మాయిగారు వచ్చేస్తారు.' అంది చిరాకుగా

"వస్తే! మనకేం భయం? ఆవిడ ఎవరినీ పెండ్లాడకుండా షట్టికట్టుకుని వూగుతుందేమిటి!' అని గబగబా పందిరి పట్టుకొని వూపాను. మంగి తూలిపోయి క్రిందపడిపోయింది. పడీపడటంతోనే, నా రెండుచేతుల్లోకి మంగిని తీసుకున్నా. వళ్లోపడ్డ చిలకలాగ కొట్టుకోవడంమొదలెట్టింది. మంగి ఏదో అలాకొట్టుకుంటుందిగాని నేనంటే ఎంతఇష్టమనకున్నారు! వున్న రేఖల్లా మెలిదిరిగివున్న మంగి వొంకీలుతిరిగిన జుట్టులో, ఆ లలాటం, ఒక ద్కం తొదిగినట్టుంది. నేను మంగి చుబుకాన్ని నాకుడిచేతి బొటనవ్రేలితో ముందుకునొక్కి ఆ కోమలమైన లలాటాన్ని ముద్దుపెట్టుకోడానికి, మంగి ముఖాన్ని ముందుకు లాగేను. కాని మంగి "ఎవరైనా చూస్తారు' అంటూ వెనక్కి లాక్కొంది. పిచ్చిపిల్ల! చిటికెలో అయిపోయేదానికి ఇంత పెడసరం ఎందుకు చెప్పండి! నేనే నా ముఖాన్ని మంగి ముఖంమీదికి పోనిచ్చా.

ఇంతలోకే, "ఏమిటిరా నారిగా" అని గుమ్మంపైపునుండి ధ్వనించింది నా వొడిలోనున్న మంగి తటాలున లేచిపోయి, చెదిరిపోయిన ముంగురులు సర్దుకొంటోంది.

తీరా, నేను వెనక్కి తిరిగిచూస్తే, అపరమోహినిలా వుమ గుమ్మానికి రెండుచేతులూ చాపి, నిశ్చేష్టురాలై వుంది నా ముఖం చూడగానే సిగ్గుపడిందో ఏమో! చటుక్కున వెనక్కితిరిగి చకచకా మేడమెట్లెక్కిపోయింది. ఆ తిరిగినప్పుడు, నున్నగా దువ్వి అల్లిన ఆ వాలుజడ, గుమ్మానికి తగులు కాని, వుమ అడుగుల ధ్వనికి వంతపాడింది. నిజంగా అప్పుడు చూడాలి—

సుమ అందం, చక్కగా తయారై, ఇక మల్లెలకోసం ఎదురుచూస్తున్న. ఆ సుమ శిరోజాలనుండి, సుగంధపరిమళం వ్యాపించింది ఆ యవ్వనం వరుడి కోసం ఎదురుచూస్తున్నట్లు పైకుబికింది. ఆవిడ కపోలాలు, కుందనపు రేకుల్లా తళతళ మెరిశాయి ముంగురులు ఇంద్రనీలాల్లా, శరీరం ఆపరంజిలా మెరిసిపోయాయి. పాపం సుమనని ఏంలాభంలెండి! ఇంకా వివాహం తల పెట్టని వాళ్ళ బాబునే అనాలి. ఇల్లా అనుకుంటూ వెనక్కితిరిగి చూచాను. మంగి మాయమైపోయింది.

# 15

"ఏమని చెప్పినా తగలేసుకురావనమే' అని ఉదయాన్నే శేషగిరిరావు గారి భార్య నన్ను తిట్టడం మొదలెట్టింది.

ఈ ధనికులిండ్లవద్ద పనిచేసి, ఆ ఆడవాళ్ళ చివాట్లుతినని సేవకుడెవడూ వుండడులెండి. అదిగాక ఆవేళ లేవగానే ఎవరిమొఖం చూచేనోగాని, అన్నీ చివాట్లే. అక్కడ మార్కెట్టులో, ఆ వెధవముండ ఏమని తిట్టిందో తెలుసా?'

"ఓ! మగోడొచ్చాడు ముండామగోడు కొనేవి పిశెడు వంకాయలూ-చేసేది విలువ పరీక్షనూ! వెళ్ళెళ్ళు! కొన్నావ్. మేలింబంగారమూ కావాలి-మెరచట్టూ తిరగాలంటే ఎలా?" అని గసిరింది మాయముండ. అక్కడికే గంటతిరిగాను బజారంతా.

"అయిన ఖరీదూ తగలేసి యీ పుచ్చొంకాయలెందుకురా సన్నాసి"

అని చిన్న పుచ్చున్న వంకాయను నేలమీద విసిరి "తీసికెళ్ళి తగలేపిరా!" అంది.

నిజానికి అందులో పుచ్చుకాయ అదొకటే.

అంతట్లోకే దొడ్లో అంట్లుతోమడం పూర్తిచేసుకొనివచ్చిన మంగి యీతతంగంచూచి —

"పరవాలేదు నేను తరిగి శుభ్రంచేస్తానులెండి!" అని మళ్ళీ నావంక చూస్తూ, "వెళ్ళువెళ్ళు! మగోడివి బయల్దేరావు. వంకాయల నాణ్యం తెలీదు. మళ్ళీ పోచికోలు కబుర్లుచూస్తే ఎక్కువ" అంది. మంగి మాటలు నాకు కోపాన్ని కలిగించలేదు పైగా సంతోషాన్నే కలిగించాయి. ఆ ముఖం కోపాన్ని సూచించడంలేదుగా.

తేలుకుట్టిన దొంగలా. మళ్ళీ నేను మాట్లాడలేదనుకోండి! మంగి ఉపకారానికి లోలోన సంతోషిస్తూ మేడమీదికి వచ్చాను.

మేడమీది హాలులో, వుమ, రవి శేషగిరిరావుగార్లతో నేను వచ్చినప్పుడు కనబడ్డ పరిచయవ్యక్తి అన్నానే — ఆ యువకుడు కూర్చుని, వుద్రేకంగా చర్చిస్తున్నాడు.

నేను ఆ యువకునివంక, నఖశిఖపర్యంతం చూచాను. ఆ! నేను చెప్పానుకదండీ, పరిచయమైన వ్యక్తి అని. ఆయనే మా బాబుతో అప్పుడప్పుడు మా యింటికి వచ్చి ఏవేవో సంఘం గొడవలు మాట్లాడతాడే: ఆయనే: ఆయన పేరు మోహన్. ఒకసారి మా బాబుని ఆయనెవరని అడిగితే, మా సంఘ పెద్ద అన్నాడు. కుర్రోడు సంఘ పెద్ద 'ఏమిటా' అని. ఆశ్చర్యపోయాను సంఘం పెద్ద అంటే, ఆడ్తీలో మేస్త్రీలులేరూ, ఓ పెద్ద తలపాగా వాళ్ళూనూ, వాళ్ళే అని నా వుద్దేశం అయితే ఆ విషయం మా బాబు

చెప్పాక, మోహన్ ఎంతో తెలివైనవాడనుకున్నాను. లేకపోతే పెద్దెలా అవుతాడు చెప్పండి. అప్పటినుండీ, నేనాయనతో ఎప్పుడూ మాట్లాడక పోయినా, ఒక రకమైన భక్తిమాత్రం కలిగింది. అందులోనూ, యువకుడు పెద్ద. యువకుడికి యువకునిమీద ప్రేమవుండకపోతే వృదుడి మీదుంటుందేటి?

మోహన్‌ను చూడగానే నాలో అవొకరకమైన తహతహ బయలు దేరింది. "ఏమండోయ్! మోహనరావుగారూ... ' అని సంటుండగానే మధ్య రవి అడ్డొచ్చి....

"వెధవవు. అన్నీ నీకే కావాలి. ప్రపంచంలో నీకు తెలియనివాదే లేదనుకుంటూ, వెళ్ళి మూడు కప్పుల టీ తీసుకొని రారా. జోగులూ.' అని హుకుం జారీచేశాడు.

'ఆవేళ టీ చాలా గొప్పగా చేశానులెండి నిజంగా అప్పుడు నేను చేసిన టీ తాగితే అలా.... ఓ పూటయినా మనిషిని నిలబెడేస్తుంది.

టీ తీసికొచ్చి టేబిలుమీద పెట్టాను.

ముగ్గురూ మూడు కప్పులూ అందుకున్నారు.

మోహన్ టీ తాగుతూ —

"బేష్. టీ చాలాబాగాచేశావు. నాలాంటివాళ్ళకు చాలా వుషారిస్తుంది టీ." అంటూ వాళ్ళెపు చూచి, "ఎంతబాగా చేశావు టీ" అన్నాడాయన.

" ఆ బాగంతా మా మంగిదిలెండి " అన్నాను. చేయినలుపుతూ చిరునవ్వుతో.

"ఏమిరోయ్." మామంగి అంటున్నావ్" అని రవి ఒకమాట విసిరాడు. అంతా నవ్వారు.

"మా అంటే మా కులమేకదండీ. — మంగిని.' అన్నా నేను జవాబుగా.

మోహన్‌రావు, రవి వొంక చూచి —

"రవీ. పెండ్లిచేసుకోకూడదూ. ఇంత డబ్బుంది. హాయిగా పెండ్లి చేసుకొని, ఏదో తోచిన ప్రజాసేవచేస్తూ — కాలం వెళ్ళబుచ్చగూడదూ?" అన్నాడు.

రవి, త్రాగిన టీకప్పు టేబిలుమీదపెట్టి సిగరెట్లకేసుతీసి —

"ముందీ సిగరెట్టు అంటించవోయ్. తరువాత మాట్లాడుకుందాం."

"అబ్బెబ్బె. నాకలవాటులేదు." అని మోహన్ నిరాకరించాడు.

వుమ చూపు నేను కనిపెడుతూనేవున్నా. మోహన్‌వైపు వారగా చూస్తూ. అతని కండ్లను పలకరిస్తున్నట్లు. టీ త్రాగుతూనే టీ కప్పుమీద నుంచి తన చూపులను మోహన్‌వైపు విసురుతోంది. మోహన్ రవిని 'పెండ్లిచేసుకోకూడదూ.' అన్నమాటకు ఎత్తిపొడుస్తూ వుమ —

"మీరు చేసుకోకూడదూ? ప్రజాసేవ? ప్రజాసేవ? అనికరక్కుండా."

అని మోహన్‌వైపు చురచురచూస్తూ అంది ఆ చూపులో విరహం విరుచుకుపడింది. ఆ విరహంలో ఆవేదనకూడా ద్యోతకమైంది. ఎన్నాళ్ళనుందో మోహన్‌పై తన జోడుకండ్లనూ జోడించి ఎదురుచూస్తోన్నట్టు కనబడింది.

ఆ మాటల్లో నాకు స్ఫురించిందేమిటంటారా? వుమలో విరహతాపం ఎంత వుందో ధనమదాంతతకూడా అంతే వుందని ఇక మోహన్ మాటలంటారా? విందుకుండలా తొణక్కుండా మాట్లాడేడు. అదయినా రవి శ్రేయస్సుకోరినట్టుగా అన్నాడు. ఆ మాటలన్నప్పుడు, నాకు "వుదారులకు లోకమే కుటుంబమనిపించింది."

వుమ అన్న మాటలకు మోహన్ నెమ్మదిగా జవాబు చెప్పాడు — ఏమనో తెలుసా?

"పిచ్చిదానా. పెండ్లి అంటే ఏదో చవగ్గా వాచ్చే. బజారులో బంగినిపల్లి మామిడికాయనుకున్నావా?' అన్నాడు నవ్వుతూ.

"మీరు చేసుకోకూడదూ? అంటే మీకంతకోపం ఎందుకండీ?' అంది వుమ. ఆవేదనా హృదయంతో.

ఆ ఆవేదనా హృదయాన్ని. అగ్నిపరీక్ష చేస్తున్నట్లుగా మోహన్ —

"పెండ్లిచేసుకోబోయేముందు ప్రేమలగ్నంకావాలా? ఆ ప్రేమ గుణాన్నిబట్టి లగ్నం అవుతుందిగాని, ముఖాన్నిబట్టిగాదు. నా ముఖాన్నిచూచి గానీ ఏ స్త్రీ అయినా పెండ్లిచేసుకోదతిస్తే తరువాత బాధపడుతుంది. — ఆ స్త్రీ నావద్దనుండి కష్టాన్నిగాక సుఖాన్నే ఆశించిననాడు. అందేత ప్రేమ త్యాగాన్ని కోరాలిగాని స్వార్థాన్ని కోరకూడదు' అన్నాడు

అబ్బ. ఎంతపరీక్ష. నాకా మాటలమబట్టి అర్థమయిందేమిటంటే మోహన్ అందాన్నిచూచి వుమ ప్రేమిస్తున్నట్టూ ఆ ప్రేమను మోహన్ పరీక్ష చేస్తున్నట్టూ కనబడింది నిజానికి వుమలో స్వార్థప్రేమ లక్షణాలున్నా అంత పరీక్షపెట్టడం నేను సహించలేకపోయాను సుమండీ.

వుమ కండ్లనుండి ఆవిడకు తెలియకుండానే కన్నీటిబిందువులు ముత్యాల్లా రాలాయి. "అబ్బ. మోహన్ హృదయం ఎంత కఠినమైంది?'అని పించింది నాకు.

'ఏమిటోయ్ ప్రేమమీద తెగలెక్చర్లు దంచుతున్నావ్." అన్నాడు రవి, నవ్వుతూ,

"అవును నీకు లెక్చరులాగే వుంటుందిలే" అన్నాడు జవాబుగా మోహన్, రవి తన ముక్కుకొనకి వూడిన సిగరెట్టు పొగను చేతితో త్రోలు తూ —

ఇక అక్కడ వుమ వుండలేకపోయిందమకుంటా. 'క్రింద కొంచెం పని వుంది మీరు మాట్లాడండి' అని వెళ్ళిపోయింది.

ఆవిడ అవయవాలన్నీ వొణికినట్టుగా నాకు కనబడ్డాయి. ఎలా చూచానంటారా? ఆవిడ ఆ మాటలన్నప్పుడే పెదవులు కాస్త అదిరాయి. అంతేకాదు. ఆవిడ లేస్తూ కుర్చీ ఆ ప్రక్కకులాగటంలోనున్న విసుగు మేడ మెట్లు దిగడంలో. ఆ పాదాల చప్పుడు ఇవన్నీ నాకలా అనిపించాయి. వుమ మెట్లు దిగితే వుషారుగా అడుగులేస్తూ. టక్,టక్,టక్.మని దిగుతుంది. కాని ఆశబ్దమిప్పుడు టక.ట....క....ట అన్నట్టు వరుస తప్పింది. అదే నాకు ఆనవాలు. నేనూ రెండు నిమిషాలుండి. వుమ ఏంచేస్తుందా అని చూడ్డానికి క్రిందకు దిగిపోయేను. ఇంకో అయిదు నిమిషాలకు మోహన్ కూడా మేడ దిగిపోయాడు.

# 16

ఆవేళ నేను మా ఇంటికి వెళ్ళాను. ఏదో చాలా రోజులయింది కవీసం తమ్ముడునైనా చూద్దామని నేను ఇంటికి వెళ్ళేటప్పటికి మా బాబు. తమ్ముడు ఆవేళ వచ్చిన కూలీడబ్బులు పంచుకుంటున్నారు. గోదావరి అప్పుడే ఎర్రబడుతోంది. వర్షాకాలం ప్రవేశిస్తోంది. అడ్తిలో. దొడ్లు కాశీ చేసుకోడానికి వర్తకులు. పాత కలప అమ్మివేయడం. విల్వ కలప కమాను కట్టించడం మొదలైన చిల్లర పనులెక్కువుంటాయిలెండి. వాళ్ళు లెక్కలోనే మునిగిపోయి. నావైపే చూడడంలేదు. మా పల్లయ్య వున్నాడే _ వాడీ మధ్య కాస్త. తెల్లబట్టలు వేసుకుంటున్నాడని తెలిసింది. పదివేలకూ పోరు

గోడు బాగోవలసిందే. అందులోనూ తమ్ముడూ! పొడుగోడు పచ్చగా వుంటే పొయ్యిలో వుచ్చేసేవాడు ఏమంత వృద్ధిలోకి వస్తాడు చెప్పండి!' అప్పటికే నేను వచ్చి పావుగంట అయిపోయింది. కనీసం తమ్ముడైనా మాట్లాడడంలేదే అని నాకు బాధతప్ప వాడు తెల్లబట్టలు తొడుక్కున్నా డంటే నాకేమీ అసూయగా లేదు. అలాగే ఇంకా నిలబడిపోయాను.

"ఒరే పల్లం, మన కష్టం కలిసొస్తే యీ ఏడాదిలో నీ పెళ్ళి చేసేస్తానురా' అన్నాడు మా బాబు, మా తమ్ముని చూచి.

"నాకు అప్పుడే ఏం తొందరనాన్నా వున్న కొంపకాస్త దిట్టపరచు కొందాం" అన్నాడు మా తమ్ముడు.

ఓ! ఎంకేం తల్లిదండ్రుల విశ్వాసాన్ని మహాబాగా చూరగొంటు న్నాడు. పదివేలకూ అలా వుండవలసిందే. వాళ్ళ దృష్టిలో నేనేదో పాడై పోయినా, వాడైనా బాగుపడ్డాడు. పోనీలెండి.

మా బాబు అంటాడుకదా! "కొంపను వుండవలసిన కళలేనిదే కొంప కదిలే లాభమేమిటిరా?" అని.

ఓహో! ఎంత ప్రేమ కొడుకుపై.

మా తమ్ముడు మౌనం వహించాడు. వాడు కాస్త కలిసొచ్చే మాట లకు తెల్లంకొట్టిన రాయిలా, నోరెత్తడులెండి.

నాకావేదన తీవ్రమౌతోంది. నేనేకదా! దిక్కులేని పక్షినై పోయాను. అని ఆలోచించుకోవడం మొదలుపెట్టాను.

అంతా తప్పులెండి! వెధవదబ్బు వుండి చూశారూ, ఎంత పనైనా చేస్తుందనుకోండి. అన్నదమ్ముల పీకలు కోసుకునేలా చేసేదదే. ప్రేమ

కల్పించేదీ. పోరుతెచ్చేదీ అదే. ఓహో ఎంత శక్తి ఉందండీ డబ్బుకు
అదే సమయంలో మా అమ్మ నీళ్ళబిందె ఎత్తుకుని, బయటికి వెళుతూ కూడా పెడముఖం పెట్టుకొనే పోయింది' నేనో రాతివిగ్రహాన్ననుకున్నట్టుంది.

డబ్బు లెక్కపెడుతున్న మా బాబు వీధిలోకి వచ్చేస్తూ, నావైపు తేరిచూసి, ఏదో సణుక్కొంటూ, డబ్బు మూటకట్టేస్తున్నాడు.

ఆఖరికి నన్నుచూచి వుమ్మివేయటంవరకూ వచ్చిందని నేననుకున్నా.

"ఓయి భగవంతుడా, నాలాంటి జీవితం శత్రువుకయినా ప్రసాదించవద్దు.'

అవును మరి: ఎంత చెడినా కన్నకొడుకుని, కాకులైనా నయం' తమ పిల్లలు, ఎంత నల్లగా ఉన్నా, ఎంతోముద్దుగా చూసుకుంటాయి, ఒక్క అన్నంమెతుకు తాకితే, అన్ని కాకుల్ని చేరేవరకూ అరచి, అన్నీ వచ్చాక సమిష్టిగా దొరికినన్నంమెతుకులు తింటాయి. కాని నాకాగతైనా పట్టలేదు.

మా బాబు సణుగుకోడం చూచి మా తమ్ముడు వీధిలోకి చూచాడు. వాడూ పలకరించకపోతే, నేను వెళ్ళిపోదును. అంతట్లోకే వాడులేచి నన్ను సమీపిస్తూ –

"ఏమిటా: అన్నా వీధిలో నిలబడ్డావ్. రా." అని భుజంపై చెయ్యివేశాడు.

మా బాబు వెంటనే లేచి లోపలికి వెళ్ళిపోయాడు, నేనింక సహనం కోల్పోయాను. ఎన్ని బాధలుపడినా సహించి వూరుకోడానికి నేనేం పురాణ కాలంనాటి దద్దమ్మను కాదుగా. భుజంపై వున్న మా పల్లం చేతిని వొదిలించుకొని –

"ఆ నాలుగు డబ్బులతోనే వుండిరా ఏదైనా.' అన్నా. వాడికి యీ నా మాటలు శూలాల్లా గుచ్చుకుంటాయనుకున్నా. కాని వాడర్థం చేసుకున్నట్టే కనబడలేదు.

మళ్ళీ అన్నా.

"పోనీలే తల్లిదండ్రులనైనా సంతోషపెట్టి సుపుత్రుడవనిపించు కుంటున్నావు. అదే చాలు.'

నేనిది వ్యంగ్యంగా అన్నా వాడికి గుచ్చుకోలేదు. వాడంటాడుగదా.

"నీవుకూడా ఇట్టులో చేరకూడదురా. అన్నా.'

వాడికి నా మాటలు శూలాల్లా గ్రుచ్చుకోకపోయినా, వాడి మాటలు నాకు శూలాల్లా గ్రుచ్చుకున్నాయ్. గ్రుచ్చుకోవడమే కాదు. ఆ మాటలు నా బుర్రలో దడిమంటలా అంటుకున్నాయ్.

నిజం. మా తమ్ముడు ఏ భావంతోనన్నా గొప్ప సలహా ఇచ్చాడు. నిజంగా కష్టజీవిగా చెమటోడ్చి. పదిమందిలో "సెబాష్" అనిపించుకోవడమే యువకుని లక్షణం. నా తమ్ముడు మనస్సు తల్లిదండ్రుల సేవవంకే పోయింది. కాని, నా మనస్సు ఆఫీసు కూలీలందరిలోకీ. అయిదు నిమిషాల్లో వెళ్ళి. నా బుర్రలోకి దివ్యసందేశాన్ని తెచ్చింది. నిజం. కష్టజీవిగా, యింత మంది కూలివాళ్ళలో 'మంచి' అనిపించుకోవడమే గొప్ప.

అయితే మంగిమాట నా మంగిని వొదిలిపెట్టగలనా? మంగిని వొదిలిపెట్టకుండా, కూలోడుగా జీవించలేనా? నేను ఆఫీసులో క్రేటుమోయడం చూస్తే నన్ను మంగి ప్రేమిస్తుందా? ఈ ఆలోచనలో నేను శేషగిరిరావుగారి మేడకు చేరుకున్నట్టు తిరిగిచూస్తే నేగాని తెలుసుకోలేకపోయాను

# 17

శేషగిరిరావుగారి మేడకు రాగానే నాకు మంగి జ్ఞాపకమొచ్చింది గబగబా క్రింద గదులన్నీ వెదికేశాను. కనబడలేదు. పై అంతస్తు ఎక్కి వెదికినా ఎక్కడా కనబడలేదు.

రవిమాత్రం ఎడమవైపునున్న విశాలమైన తన చిత్రశాలనా గదిలో ఒక చిత్రాన్ని ఏకదీక్షగా పరీక్షిస్తూ పరవశత్వంతో, ఎడమచేతిలో రంగులపళ్ళెం కుడిచేత్తో కుంచెపట్టుకొని. బొమ్మవైపు నిదానంగాచూస్తూ వెనక్కి ఒక్కొక్క అడుగేవేస్తున్నాడు.

నేనెప్పుడూ ఆగదనంత వివరంగా చూడనేలేదు. నేను గుమ్మంవద్ద నిలబడి ఆ చిత్రాలను పరీక్షిస్తున్నకొలది అదొక విధమైన ఉద్రేకం పుట్టుకొచ్చింది. ఇంతకీ అంత ఉద్రేకం పుట్టించిన ఆ చిత్రాలేమిటంటారా. వినండయితే ఒక స్త్రీ నగ్నంగా వొళ్ళు విరుచుకుంటూ, ఆవులింత తీస్తోంది అబ్బ! అలా ఆవులింత తీస్తున్నప్పుడు ఆ ముందుకు విరుచుకు పడుతున్న వక్షస్థలాన్ని చూచితీరవలసిందే. ఇక రెండో చిత్రంలో ఒక రసికుడు ఇద్దరు స్త్రీలూ వున్నారు. నాలాగే వాళ్ళు చిత్రంలో వుంటే నాకంతాశ్చర్యం ఎందుకూ? ఎలాగున్నారంటారా? ఆ చిత్రంలోని రసికుడు ఒక పన్నని కండువా భుజాలపై వ్రేలాడుతోంది. వాడిలోనున్న ఒక స్త్రీ వక్షస్థలంపై అతని కుడిచేయి వుంది. కూర్చుని వున్న అతని నోటిలో, ఏదో పానీయం. విరబోసిన తలతో నగ్నంగావున్న ఒక స్త్రీ పోస్తోంటే ఆ స్త్రీ అతని భుజాలపై వేసిన కుడిచేతిని యీయన ఎడమచేతితో పట్టు

కొని వున్నారు. అదీ ఆ చిత్రం. ఇంకా ఇటువంటివే చాలా వున్నాయనుకోండి. ఇప్పుడు రవి తన్మయుడైపోయి పరీక్షిస్తున్న చిత్రం ఏమిటంటారా? ఒక జవరాలు. నీలాటిరేవులో దిగి, స్నానంచేయబోయే ముందు తన వలువ లిప్పుతున్న చిత్రం.

ఆ బొమ్మను చూస్తున్నకొలదీ నాకు దృష్టి అంతా మంగి మీదే పోయిందంటే నమ్మండి. కాని ఇంకో నిమిషం అలాగే వూరుకుంటే రవి వెనక్కి పడిపోను. అంచేత నేనే గబగబా వెళ్ళి రవిని పట్టుకున్నా. రవి నామీద విసుక్కుంటూ –

"కండ్లు కనబడ్డంలేదురా వెధవా" అన్నాడు.

"మీరేదో దీక్షలోనుంచి వెనక్కి అడుగువేయటంలో పడిపోతారేమోనని...." అని నేనంటూంటగానే.

"ఏదీకావృతే, మా పెద్దకండ్లున్న మొనగాడవు అయ్యేరావు.' అని రంగులపళ్ళెం, కుంచె ఎదుటనున్న బల్లపై పారేసి, జేబురుమాలుతో విసురుకుంటూ బయటికి వచ్చాడు. అలా వెనక్కి తిరిగి చూస్తేగాని నేను చేసిన పని "మంచిదే' అని ఆయనకు గుర్తుకు రాలేదు. అప్పుడన్నాడు.

"నిజమేరా. నీవు పట్టుకోపోతే పడిపోదునురా.'

ఇంతేలెండి! యీ డబ్బున్నవాళ్ళంతాయింతే. కూలోడు కాసుకోపోతే నిలబడనేలేరు. పైగా పెళ్ళాంమీద కోపంవున్నా, పరిచారికుడిమీద పండ్లుకొరుకుతారు. వాళ్ళనైజంలెండి అది. కుక్క కుండలో మూతిపెడితే కొడతాంగాని, చెరువులో మూతిపెడితే కొడతామా? ఏదైనా అంతేకదండీ. ఆ షావుకార్లకు సేవకులతప్ప లోకువ ఇంకెవరుంటారు? పోనీలెండి, రవి

నన్ను ఏదో ముందు తిట్టినా, తరువాత పశ్చాత్తాప్తపడతాన్నాడు. ఇలా పశ్చాత్తాపం పడేవాళ్ళు బహుకొద్దిమందే ఉంటారు.

సరిగ్గా ఆ సమయంలోనే మోహన్ కూడా వచ్చాడు. ప్రమ కూడా అతని వెంటే వుంది. మోహన్ ఇంట్లోకి రాగానే ప్రమ ఆహ్వానించింది. పైకి తీసికొచ్చిందనుకుంటా. అబ్బబ్బ! యీ యౌవ్వనంవుంది చూసారూ. మెరుగుతూన్న ఎసరులా పొంగుతుందనుకోండి.

నేను టీ తీసుకొస్తానని చెబుతుగానే బయలుదేరి క్రిందికి వెళ్ళాను. నేను టీ చేసి తిరిగి పైకి వచ్చేసరికి ఏంతో పైముకాలేదు. ఇంకా వాళ్ళు ముగ్గురూ సంభాషణకు దిగలేదు. మోహన్ రవిగదిలోని చిత్రాలు చూస్తు న్నాడు. మోహన్‌కూడా రవి వెంట వుండి ఆ చిత్రాల గురించి వివరించి చెబుతున్నాడు, ప్రమకూడా వాళ్ళతోనే వుంది.

నేననుకున్నా. 'నగ్న పురుషుణ్నిచూచే, మగవాళ్ళం సిగ్గుపడతాం కదా. నగ్న స్త్రీలను అందులోనూ మగవాడి ప్రక్కనున్నప్పుడు చూస్తోంటే ప్రమ ఎందుకు సిగ్గుపడడంలేదా?" అని.

యీ కాలేజీల్లో సిగ్గువిడిచారు వుండవులెండి. ఆదేకాదు. ఇటువంటి గొడవలు సిగ్గులేకుండా ఇంగ్లీషులోమాట్లాడేసు కుంటారు తస్సాదియ్య!

నేను టీ తీసుకొచ్చేసరికి రవి వెనక్కి తిరిగి చూచి 'రండి టీ వచ్చే సింది." అన్నాడు.

నేను టీ టేబిలుమీద పెట్టేను. ముగ్గురూ టేబిలు చుట్టూ కూర్చుని టీ తీసుకున్నారు.

రవి? అన్నాడు. "ఏమోయ్, మోహన్ ఎలా వున్నాయంటావ్?"

మోహన్ వ్యంగ్యంగా అన్నాడు. చాలాబాగున్నాయ్! యీ బొమ్మలు మొరకవీథిలో చాలా విరివిగా చెలామణి అయిపోతాయనుకో"

నిజంగా మోహన్ ఆ మాటలు చాలా వ్యతిరేక భావంతోనే అన్నాడు. కాని అతని ముఖం మాత్రం ప్రశాంతంగానే వుంది.

ఎత్తిపొడుస్తూ, రవి అన్నాడు, "అవును మరి! చతుష్పాదులకేం తెలుస్తుంది — ఇందులో ఉన్న సౌందర్యం."

మోహన్‌కు సూటిగా తగిలినట్లుందామాట. ఊబిలుగుడ్డి అంటాడు గదా!

"కళ సౌందర్యం కోసమా? సౌందర్యమంటే ఇటువంటి చిత్రాలేనా? అమాయిక యువకులలో గ్రుడ్డి కామాన్ని రెచ్చగొట్టి అవినీతిపాలు చేయడానికా? ధనికుల కామభోగలాలసాన్ని జోకొట్టడానికా కళ? వీరేశలింగంగారి లాంటి వాళ్ళు, యీ ప్రాణ్ళో పుట్టివుండకపోతే యీ పాటికి రొచ్చుగుంట చేసేద్దురు మీలాంటివాళ్ళు.' అని టీ గుటకేసి, వుమ, రవి ముఖాలవొంక చూడడం మొదలెట్టాడు.

మోహన్ ఏదో బలంగా పిడికిలి బిగిస్తూ బల్లగుద్దుతూ, చేతులూపుతూ మాట్లాడుతున్నాడేగాని ఏమంత బలమైనవాడు కాదుకూడాను, బక్కపలుచగా రివటలా, పొడుగ్గా వుంటాడంతే. ముఖంమాత్రం శరత్పూర్ణిమనాటి అప్పుడే ఉదయిస్తున్న చంద్రబింబంలా ఎర్రగా వుంది

నేను మొదట ఆ చిత్రాలు చూచినపుడు నాకు కలిగిన వుద్రేకం, ఆనందం ఇప్పుడు మోహన్ మాటలవల్ల హారతికర్పూరంలా హరించిపోయి వట్టయాయి' నిజమే. నాలాంటివాడిలో ఆ బొమ్మలు కామాన్నే రెచ్చగొడతాయి.

రవి అందుకున్నాడు.

"ఒక్క వీరేశలింగంగారు సౌందర్యాన్ని గూర్చి వ్రాయకపోతే అయిపోయిందేమిటోయ్! లెక్కవేసుకుంటే. పేరుమోగిన కవులంతా సౌందర్యాన్నే, కళోపాసనగా తీసుకున్నారు తెలుసా.'

మోహన్. బల్లి దోమను పట్టినట్టుగా గబుక్కున అందుకున్నాడు.

"అందుకే వాళ్ళు. వాళ్ళ కవిత్వం ప్రజల్లో స్థానాన్ని కోల్పోవడం వీరేశలింగంగారు చూడు. ఆయన చనిపోయినా అమరుడే. ఆయన పేరును ప్రజా హృదయాల్లోంచి ఎవ్వడు వేరుచేయగలడు? ఆయన హరిశ్చంద్ర నాటకం చూస్తే తెలుస్తుంది. శంకరకవి, చంద్రమతికి శృంగారాన్నాపాదించి అవినీతివంతంగా చిత్రిస్తే. మన పంతులుగారు ఆ చంద్రమతికే సుగుణ శీలాన్నాపాదించి నీతివంతంగా చిత్రించారు. ఆలోచించు. పంతులుగారి చంద్రమతి ఎంతమంది స్త్రీల హృదయాలలో వుందో. ఆ నాటకం చదివి ఎంతమంది చంద్రమతి పేరు పెట్టుకున్నారో? అంచేత కళాలక్ష్యం సౌందర్యం కాకూడదు. నీతే ప్రధానం. ఏం? ఏమంటావు?' అని రవి. ఉమల ముఖాలను రెప్పలెగరేస్తూ చూడడం మొదలెట్టాడు.

ఉమ తన అన్నగారి వైపే మొగ్గుచూపించింది. కాని మాట్లాడలేదు. నా అభిప్రాయాన్ని మీరు తెలుసుకోవాలనుకుంటున్నారా? మీకు తెలుసుకోవాలనే ఇచ్చా లేకపోవచ్చు. కాని కండ్లెదుట జరిగిన ఘటనపై నేనేలా నోరు మూసుకూడుకోగలను.. నేను వెంటనే అనేశాను.

"అంతేనండి! గుణం ప్రధానంగావి రూపం ఎవడిక్కావాలి!"

తోకత్రొక్కిన త్రాచులా రవి "బుస్" మని లేచి—

"నోరు మూయవోయ్! వెధవ! పెద్ద తెలిసినట్టు. ఆ కప్పులు క్రిందకు తీసుకెళ్ళు." అని గసిరేడు.

తెలియనివాని గళింక అంతేనంటారా? వాడు పశువే? మీరే చెప్పండి! ఎమైతే ఏం? నేను గబగబా దిగిపోయాను. నేను దిగుతుంటగా వినబడింది వుమ మాట.

"అయితే మీరు కాళ్ళా. చేతులు లేనివాన్ని చేసుకోగూడదూ!" అని నేను నాలుగుమెట్లు దిగి. మోహన్ "ఏం చెబుతాడో" అని ఎదురు చూశాను. సెహబాష్! తుక్కకొటుకు చెప్పుదెబ్బలా అనేశాడు.

"దిగబోతూ లోతడగడం ఎందుకు? నీకే తెలుస్తుందిలే......" అని రవి వంక చూచి శాంతంగా "వెళ్ళొస్తానోయ్!" అని లేచిపోయాడు.

# 18

మోహన్ అలా లేచి వచ్చి నాతో కలవగానే నేనన్నా!

"పుల్లరెకి షట్టివబుద్ది పుటంవేస్తే నేగావి పోదనుకోంది.

"అంతేలే!" అంటూ ఆయన వవ్వేదు ఆయన వెళ్ళిపోతుంటే "ఉండండి. నేనూ వస్తున్నా!" అని గబగబా కప్పులూ, సాసర్లూ లోపల పెట్టి వెంటపడ్డా. ఏమిటో ఒక్కొక్కరి మాటలు వింటే అలా మనసులు పరుగెడతాయనుకోండి!

మోహన్ ఆడ్తి సంఘ పెద్ద అని నాకు తెలుసు. అయితే వుమ ఇంటికెందుకండీ అస్తమానం రావడం? సంఘం పెద్ద అయితే మాత్రం వానికి ప్రేమ వుండదా? అని మీరంటారేమో. సరే వుండొచ్చు. కాని నా సందేహం ఏమిటంటారా? ఆవిడ ధనికుల పిల్ల, ఈయన కూలీ సంఘం పెద్ద, ఇద్దరికీ చుక్కెదురుకదా? అందులోనూ యీ విషయం వుమ మాటల లోనే తేలిపోతోందికదా ఎందుకా ఈ సంబంధం అని? ఇంకో విషయం.... మోహన్ సంభాషణ బట్టి చూస్తే ఆయన జీవితమంతా కూలీల కోసమే

అర్పించినట్టు కనబడుతుందే. మెతుకుబట్టిమాస్తే తెలియదండీ! అసలు వ్యవహారమంతా.

ఏమైనా నాకు అనుమానం వదలక అడిగేసాను.

"ఏమండీ మోహనరావుగారూ! వీళ్ళతో మీకు సంబంధం ఏమిటండీ"

ఆయన మొదలెట్టారు.

"నీకు తెలీదు. వీళ్ళతో నాకు బాల్యస్నేహం. నిజంగా నా విద్యార్థి దినాలలో వీళ్ళు స్నేహంగా లేకపోతే, నారాయణా! ఈ నా కళేబరాన్ని యిప్పుడు నీవు చూచి వుండవు. మా అమ్మ వుందే సవతి తల్లి, మా బాబు ఆవిడ చేతిలో చిక్కిపోయాడు. స్వభావానికి మహానుభావుడే! నేను కాలేజీలో చదువుకునే రోజుల్లో స్కూలు జీతం అడిగితే మా అమ్మ తిట్టేది. కొట్టేది. భోజనం పెట్టమంటే "బుక్కెడానికి మీ బాబు సొమ్మేంలేదిక్కడ అనేది. మా బాబుకు ఇవన్నీ తెలుసు. ఏంచేస్తాడు! చాటుగా ఎప్పుడో ఒక్కొక్క రూపాయి ఇచ్చేవాడు. దానిని పై ఖర్చుకు అలాగే దాచుకొని వుపయోగించుకునేవాడిని. ఒకరోజున మా బాబు దగ్గరుండగానే నేను. చిన్న గుడ్డి దీపం పెట్టుకొని చదువుతుండగా మాఅమ్మ వచ్చి దీపం" తోరణంలా అంటించావు. నీబాబేమి కిరసనాయలు తెచ్చి,పొయ్యలేదురా అని" జుట్టు పట్టుకొని తల గోడకేసి కొట్టేసింది. ఒకటా.... రెండా అలోచించు. అటువంటి స్థితిలో స్నేహితుడు ఎంత ముఖ్యావసరమో చూడు. ఈ స్నేహితులే ఆ రోజులలో నాకు మండుటెడారిలో మంచినీళ్ళు ప్రసాదించినట్టుగా వుండేవారు.........'

అబ్బ! తీగలాగితే డొంకంతా కదిలిందని.... నిజంగా ఆ జీవితం వింటూంటే ఏడుపు వస్తుందనుకోండి! ఆయన మధ్య మధ్య నడుస్తూనే

కన్నీటిచుక్కలు రాల్చాడు. అవి కడుభారంగా భూమిపై టప్‌మని రాలేవి. ఆయన చెప్పడం వింటే నన్ను చేయిపట్టుకొని ఆయన తనజీవితపు లోతుల్లోకి తీసుకు వెళ్ళుతున్నట్టయింది. దీంతో నాకు ఆయన జీవితంమీద సానుభూతి మరీ ఎక్కువయింది. నా జీవితానికి దగ్గర పోలికలున్నాయికూడా. కదల నివ్వండి! ఎంత డొంక కదులుతుందో.... అడ్డుగా వున్నప్పుడు ఎంత డొంక కదిలినా దాన్నంతా ప్రక్కకు తొలగించేయడం మంచిదిగదా!

మేము నడుస్తున్న దారిలో కాఫీ హోటలు తగిలింది. నాదగ్గర ఒక బేడుందిలెండి.

"రండి టీ త్రాగి వెళదాం!" అన్నా.

"ఇప్పుడేగా త్రాగేం. అక్కర్లేదులే" అన్నాడాయన.

"సరే కానివ్వండి అన్నా."

మళ్ళీ ఆయన మొదలెట్టాడు.

"ఆ పరిస్థితులలో నా మిత్రుడు కూడా నావద్ద కొన్ని తన బాధలన్నీ వెళ్లగ్రక్కేవాడు. కాని లాభం ఏమిటి? మళ్ళీ అవితలోనే దూరేవాడు. ఏమైనా రవిమాత్రం, రోజూ కాలేజీకి వెళ్ళేటప్పుడు మా ఇంటికి వచ్చి నన్ను తీసుకొని వెళ్ళేవాడు. వుమ కూడా వారానికొకసారైనా వచ్చేది. అదే యీ స్నేహం. అప్పుడే వుమ అంటూండేది. "మన శరీరాలు వేరైనా హృదయాలు ఒకటే మోహన్!" అని. నేనూ ఆవిడను ప్రేమించేవాడిని మరి ఎలా వొదలగలము? అంత పరిచయమున్నప్పుడు" అని ఒక పెద్ద నిట్టూర్పు విడిచాడు.

"అమ్మయ్య" అని నేను నిట్టూర్చాను. ఒకరి జీవితాన్ని వింటుంటే నాకు కళ్లనీరు కారింది కాని నాకు అదేమిటో సంతోషంగానే వుంది.

ఎందుకంటారా? నాలాంటి బాధలేగల ఒక బుద్ధిమంతుడు నాప్రక్కనున్నాడంటే నాకు సంతోషం గదూ?

మోహన్ నా హృదయాన్ని అయస్కాంతంలా ఆకర్షించాడు.

నేనడిగా "అయితే మీరిప్పుడెక్కడుంటున్నారు?"

"ఎక్కడుండడం ఏమిటి? ఇప్పుడే సుఖంగా వుంది నాకు. కుటుంబంతో యిప్పుడు సంబంధమే లేదు. ఈ కూలీజనమే నాకు తిండి పెడతారు. వాళ్ళ సేవచేయడంలోనే నాకెంతో హాయిగావుంది." అన్నాడు.

నా బ్రతుకులాగే వచ్చింది ఆయన బ్రతుకూనూ. పాపం నాకంటే ఘోరం — ఆయన బ్రతుకు అనుకున్నా. నిజంగా నేనే గనుక ఆయన స్థానంలో వుంటే. వుమను అమాంతంగా డబ్బుతో సహా లేవదీసుకుపోయేవాడినే. అబ్బ. మోహన్‌కు ఎంత సహనం అనుకున్నా.

నా హృదయాన్ని విప్పి ఆయనముందు పెడుతూ అన్నా.

"కాని. వీళ్ళ గొడవ మీకు తెలియదండీ ఒకప్పుడు వుమ మిమ్మల్నెంతో ప్రేమించినా. అనాడు యిద్దరి జీవితాలూ ఒకే మార్గంలో నడవడం వల్ల జరగొచ్చు కాని. ఇప్పుడు మీరు మాట్లాడుతుంటే వుమ చూడండి. రవినే బలపరుస్తోంది. రవి ఎటువంటి వాడో తెలుసునా అండీ. నిజంగా మీరు అక్కడ చెప్పినది నిజం అనుకోండి. రోజూ రాత్రుళ్ళు మొరకవీధికి పోతుంటాడు. వాళ్ళ బాబు ఎప్పుడూ తిడుతుంటాడు. వాళ్ళమ్మ మాత్రం శేషగిరిరావుగారి! తెలియకుండా పారేస్తుంది డబ్బు. రవిరాక ఒక్కొక్కసారి తెల్లవారుతూవుంటే ఆయన ఆ రాత్రంతా మొరకవీధిలో ఏ భోగందాని ఇంటి

లోనో ఎప్పి ఇంటికి వస్తూ నగ్న స్త్రీల చిత్రాలు పెప్పిలతో గీసి పట్టుకు రావడం నేను చూశాను" అన్నా.

"సాధారణంగా శృంగారాన్ని ప్రేమించేవారి బుద్ధులు ఇలాగే వుంటాయిలే నారాయణా. అందులో మత్తుగా డబ్బున్న శకాలు — ఇక ఎంత క్రొవ్వెక్కుతుందో ఆలోచించు" అన్నాడాయన

మోహన్ ముఖంలో ధనికులమీద ద్వేషం ప్రత్యక్షంగా కనబడింది. ఆయన ఇక నా జీవితంలోకి వచ్చాడు నా గురించి ఆయనకు ఎలా తెలుసో గాని అంటాడుగదా —

"పోనీలే నీవేదో మంచి మార్గంలో పడ్డావు. దొంగతనం వాదిలి పెట్టి సుఖపడ్డావు ఈ దొంగతనాలు, అబ్బడానికి నీవల్లయేముందిలే. తిండి లేకపోతే దానంతటవే వస్తాయి. పేదరికమూ, దాని చుట్టువున్న వాతావరణమూ దీనికి కారణం. తల్లికి పిల్లా, పిల్లకు తల్లీ కానకుండా చేయగలిగేది దరిద్రమే. పేదరికంలో పిల్లలను తల్లులు కొట్టడం సహజం దానితో బండదేరిపోయిన పిల్లలు ఏంచేస్తారూ? వాళ్ళకు ఇళ్ళవద్ద సుఖంలేదు. అంచేత అరాజకులై పోయి దొంగతనాలకు దిగుతారు. పెద్దయినకొలదీ అవి మరింత ముదిరిపోతాయి. పోనీలే ఏదో ఒక కొమ్మ పట్టుకున్నావు కాని.... — ....

అని ఆయన ఆగారు కొంచెం.

జ్యోతిష్కుడులా చెప్పేసాడు. నిజంగా నేను తన్మయమైపోయా. నా జీవితాన్ని సినిమాలో చూపినట్టుగా చూపాడు. నాకు ఆయన వర్చస్సును బట్టి కంపుకొడుతూన్న యీ ధనిక అర్థిక నీతిపై తిరుగుబాటు దారుడులా కనబడ్డాడు. ఆయన మళ్ళీ మొదలెట్టాడు.

"కాని నీవుకూడా జట్టులో చేరిపోతే ఇంకా సుఖపడతావ్ నారాయణా" అన్నాడాయన. ఆయన అలా ఎందుకన్నాడో నాకర్థంకాలేదు. అయినా నా తమ్ముడు చెప్పిన మాటలు మళ్ళీ నా మనోనేత్రాలముందు ప్రత్యక్షమయ్యాయి. కాని మళ్ళీనాకు మంగి గుర్తొచ్చింది. మనస్సు ముందుకు పరిగెత్తుతోంది. కాని, మంగి నా హృదయానికి కళ్ళెంవేసి లాగుతోంది.

నేను అన్నా. 'నన్నెవరు చేర్చుకుంటారు? మా బాబు కూడా నాకు వ్యతిరేకమే. ఇక శేషగిరిరావుగారా? సవతితల్లి ప్రేమ. మరి ఎలా?"

ఆయన ఒకక్షణం ఆలోచించి ——

"ఆ గొడవంతా నీకెందుకు నేను చూస్తాగా?" అనగానే నా సంతోషానికి మేరలేదు.

మీ ఇష్టం ...." అని మాత్రం కండ్లతో చెప్పా.

మేము ఇలా మాటలలోపడి ఎంతదూరం వచ్చేసామో నేనుచూడనేలేదు ఆకలితోనున్నవాడికి రుచి ఎలా తెలీదో ఆలోచనలోనున్నవాడికి కాలంకూడా అలాగేగా

తీరా చూస్తే అది అడ్డీకూలీ సంఘం ప్రెసిడెంటు భీమయ్య ఇల్లు. నా గుండె గతుక్కుమంది వాడికీ నాకూ చింతకాయ గోంగూర. అయితే ఏం? ఆదితిలో వాడిది సుగ్రీవాజ్ఞే ఒకసారి వాడు మా బాబుతో అంటాడుగదా!.

"యీ వెధవను యీసారి ఆదితిలో కనబడితే కాళ్ళు విరగగొట్టిస్తాను" అని

"వాడికెంత హుందాతనం అనుకున్నారు అవును మరి కూలికోసం కష్టపడనక్కరలేదు. అడ్తీ సాహుకార్లను పట్టి ఏదో వాటగు డబ్బులు సంపాదించాడు. కూలీలందరికీ పెద్ద. ఇక వాడికేంలెండి. నేను అలాగే మోహన్ వెనుక నిలబడ్డా. భీమయ్య మోహన్‌ను చూడగానే——

"రండి, రండి" అని ఆహ్వానించాడు. కూర్చున్న తరువాత వాళ్ళు మాట్లాడుకోవడం మొదలెట్టారు. వాళ్ళ మాటల్లో అంతరార్థం నాకు తెలియక పోయినా భీమయ్య మాటలు మాత్రం నాకు బాధను కలిగించేవి.

"ఆలిండియా ట్రేడుయూనియన్ కాంగ్రెసుకు డబ్బు కట్టేయాలి. టైములేదు" అన్నాడు మోహన్.

"మొన్ననే గదాండీ, బెజవాడ సంఘానికి కట్టించారు," అన్నాడు భీమయ్య.

"అది రాష్ట్ర సంఘానికి"

"మరి ఇదీ?"

" పెద్ద సంఘానికి "

"ఏమైనా మనవాళ్ళందరితో చెప్పాలి కదండీ." అన్నాడు భీమయ్య.

కూలిలసొమ్ము పీకి వద్ద ఎంతుందో తెలుసాండీ నేనొకసారి మా యింటికి వెళ్ళినప్పుడు ఏ విషయంలోనో మా పల్లెం అడిగితే "మా సంఘానికి రెండు వేలున్నాయి తెలుసా," అని మా బాబు అన్నాడు. భీమయ్య అన్న యీ మాటలు వినగానే నేననుకున్నా. తన డబ్బు కాకపోయినా ఏమిటీ యీ నాటకం అని.

నావైపు భీమయ్య చురచుర చూస్తూనేవున్నాడు.

"నేనొప్పిస్తాగా వాళ్ళను," అన్నాడు మోహన్.

"సరే మీయిష్టం." అని విసుగ్గా అన్నాడు భీమయ్య.

మోహన్ మవియార్డరు వ్రాస్తూ.

"యీ నారాయణను జట్టులో చేర్చుకోకూడదూ. మంచి యువకుడు కూడానూ." అన్నాడు.

భీమయ్య కుర్రవాళ్ళంటే ఒప్పుకుంటాడులెండి. పనిచేయకపోయినా తనకు పెద్దవాటా రావాలంటే దుడుగ్గా పనిచేసే యువకులే కావాలతనికి.

"అయిదువందలు కట్టించండి" అన్నాడు భీమయ్య.

మోహన్ కనుసైగ చేయడం వలన నేను రోడ్డుమీదకు వచ్చేసాను. మరి ఏం మాట్లాడేడో మోహన్ అరగంట తరువాత వచ్చి నాతో —

"సరే! నేనన్నీ ఏర్పాటుచేస్తా! నీవు వెళ్ళు" అన్నాడు. "శేషగిరి రావుగారి ఆఫీసులో చూడండి సుమా!" అనేసి నేను వెళ్ళిపోయాను.

# 19

మోహన్‌రావుగారి దయవల్ల నాకెలాగైతేం. ఆఫీసులో పని దొరికింది. శేషగిరిరావుగారి ఆఫీసులో కాదనుకోండి. ఎక్కడయితే ఏం? యీ మోత పనేగా చేయవలసింది.

వర్షం కురుస్తోంది పనులు మంచి మూకుడుగా ఉన్నాయ్ ఆవేళ ఎగుమోత మతికష్టం నన్ను కనికరించి వెనుకకొమ్ము ఇచ్చారు. ముందు కొమ్ము అయితే. పైనున్నప్పుడు అనుకుందేవాడిని వెధవ ఒక పలక మోయడానికి ఎవమందుగుంటం కు? అని అమ్మబాబో; మోతంటే మాటలు కాదు. నడుం పక్కకువ విరిగిపోతుందనుకోండి. అందులోనూ కొత్త కావడం వలన శవాన్ని మోసినట్టుంది.

నా ప్రక్క కొమ్ముకాస్తున్న సూరన్న —

"యీ కేటుగాడికెందు కిచ్చేరోయ్ పని" అని తిట్టాడు.

సూరన్న మొహం అప్పుడు చూడాలి. నిజంగా నోరు సగం లోప

లకు నొక్కుకుపోయినట్టుంది. పళ్ళు బయటకు కనబడుతుంటాయి గత మ్యునిసిపల్ ఎలక్షనులో మా వార్డులో ఎక్కడ చూచినా సూరన్న హడావిడే. పాపం! కాంగ్రెస్సంటే పడిచచ్చేవాడు....... ఏం చేస్తాడు........ కర్మకాలి అదే వచ్చింది.

వర్షం ఆగి. ఆగి కురుస్తోంది

ఎలాగో కలప మోత అయిపోయింది. పనై పోయాక వెళ్ళిపోతున్న ప్రతివాడూ నావైపు విచిత్రంగా చూచేవాడే. ప్రతివాడు తిట్టడమే. అయితే తిట్లలోకూడా రకాలున్నాయనుకోండి ఒక్కడు—

"అలా వొళ్లొంచి పనిచేసుకో కూడదురా! దొంగతొత్తుకొడకా!" అని తిట్టేడు.

యీ తిట్టులో నామీద ఎంతో సానుభూతి చూపుతున్నట్టు లేదంటారా? నా ముందు కొమ్ముకాసిన వారిలో నాయంతే వున్నాడో కొత్త కుర్రాడు? పాతోళ్ళలో నాకు తెలియకుండా ఎవడుంటాడు? సరిగ్గా నా వయస్సుంటుందనుకోండి. ఆ కుర్రోడు పేరు వీర్రాజు. వీర్రాజుమాత్రం నన్ను చూచి ఎంతో సానుభూతితో మోతగురించి మంచి చెడ్డలన్నీ చెప్పేవాడు. మా బాబు ఏమని చెప్పేవాడో తెలుసునా?

"అరే! మీ మేస్త్రివి. నెమ్మదిగా తీసుకుపోయి కాస్త సరుకేయించైనా చనువు చేసుకోవాలిరా! అలా చేస్తే. నీకు పని త్వరగా నేర్పుతాడు కేకలూ వేయడూ!' అని చెప్పేవాడు.

నేను పనై పోగానే మా మేస్త్రిగారిని నెమ్మదిగా అలా తీసుకుపోతాను.

ఇంతకీ నాకీ పని ఎలా కుదిరిందంటారా?

మహానుభావుడు మోహన్ మా బాబు దగ్గరకెళ్ళి ఏం చెప్పాడోగాని మా బాబు శేషగిరిరావుగారి దగ్గరకెళ్ళి నా పని గురించి అడిగాడు. శేషగిరిరావుగారు తేలిగ్గా ఒప్పుకున్నాడనుకున్నారా?

అబ్బే! తేరగా నేను ఇంటిలో పనిచేస్తున్నాను. పూరికే బయట పనిలోకి నేను వెళ్ళడానికి ఒప్పుకుంటాడా మరి! నాకు చదువు చెప్పిస్తానన్నాడు. చెప్పించనేలేదు. ఏదో నాకు చెప్పి నేర్పిన నాలుగు ముక్కలతోనే ఖాళీగా కూర్చున్నప్పుడు మాత్రం కొంత వృద్ధిచేసుకున్నాను. పెళ్ళి చేయిస్తానన్నాడుగా. ఇంకేం! వారు చేయించకేం లెండి!

శేషగిరిరావుగారు నన్ను వొదల్లేకపోయారట, మా బాబంటాడు గదా!

"అబ్బ, అబ్బాయిగారికి నీ మీద ఎంత ప్రేమరా?" అని. మా బాబు మోసపోయి వుంటాడులెండి. యీ వర్తక వర్గం వుండే, అరచేతిలో తేనె వేసి మోచేయివరకూ నాకించటం. అంతే, పైకే ఆ నాటకం. అలా అని ఏదో నచ్చచెప్పబోయాడట. మా బాబు నాతో గొడవ వొదిలించుకోడానికి ఆనాడు అప్పగించాడు. కాని, ఇప్పుడు నావల్ల డబ్బు వస్తుందంటే "సరిరా మోకాలడ్డుతాడా?" ఆఖరికి ఏమైందో తెలుసా? శేషగిరిరావుగారు తాను చేసిన పెళ్ళి వాగ్దానం మానుకోడానికి నాకు ఇంతవరకు పని చేసినందుకు వందరూపాయలు ఇవ్వడానికి ఏర్పాటయింది. మా బాబు ఇంకో వందరూపాయలు ఇచ్చి నన్ను జట్టులో చేర్చాడు. ఆ రెండు వందలకైనా మోహనరావుగారు వచ్చి మేస్త్రీలను వొప్పించటం జరిగింది.

ఎన్ని వందలిచ్చినా యీ డబ్బు పంచుకోవాలి జట్టోడిలా రోడ్డుమీద కొట్టాడా? — అంతే. ఇంటిగుమ్మం ఎక్కేటప్పటికి ఒక్క రోగం కాని

చేతిలో వుంటే దంచె నమ్మంది. పోయింది. ఇప్పుడు మా ఇంటిలో నాకు కాస్త స్వతంత్రం తప్పింది — అదేవారు. ఇక నా దృష్టిపథం లో నిరంతరం నిల్చి నాట్యం చేస్తున్నది మంగి. నా ఆలోచనంతా మంగిమీదికే పోయింది.

ఆ ఆలోచనే నన్ను తిన్నగా మంగి ఇంటికి చేర్చింది. ఆ ఆలోచన ఏమిటంటారా? మంగిని ఏలాగైనా సరే. అడ్తిపనిలో చేర్పేయటమే. మా అడ్తిలో వెదురుమోతకు ఆడవాళ్ళే పనిచేస్తారు. కాని సందేహం ఏమి టంటారా? ఆడజట్టు మేస్త్రీ — వెంకమ్మ వుండే. అమ్మ. అది మా దొంగముండ. నిజంగా రాక్షసి అనుకోండి. దాని దయమీద ఆధారపడి వుంది. ఆ ముండలో దయ సాధించటమంటే కుమ్మరాముల్లో ఇత్తడిముంత సాధించినట్టే.

నేను మంగి ఇంటికి వెళ్ళేటప్పటికి వాళ్ళమ్మ వీధిలో కూర్చొని కాతపలి నూరుతోంది. నేనడిగా. —

"అత్తా, మంగి లేదూ,'

"అదిగో దొడ్డిలో పిడకలు చరుస్తోంది' అని చేయెత్తి చూపిస్తూ' 'కూర్చో నారాయణా, రాకరాక వచ్చావు.'' అంది.

"ఏముంది' ఒక సంగతి చెప్పాలని వచ్చా. అన్నట్టు మామయ్య అడితికి వెళ్లేడా,"

'లేదుగాని. ఆ సంగతేమిటో చెప్పు" అంది. ఆవిడ ఆత్రుతతో.

"వూహూ.... మంగిని అడ్తిలో పెడితే బాగుంటుందని.. ఆ శేషగిరిరావుగారింట్లో ఎంత రెక్కలుముక్కలు చేసుకున్నా నాలుగు రూపాయలేగా ఇచ్చేది." అన్నా అరుగుమీద కూర్చొని.

మా అత్తకు కిర్రెక్కింది.

"నిజమే నాయనా, ఏంపనిచేస్తుంది చెప్పు?" అని ఏదో ఆలోచిస్తున్నట్టుగా ఒక నిముషం వూరుకుంది.

"ఏం అత్తా ఏమిటాలోచిస్తున్నావు?"

"ఆఁ, ఏమీలేదూ. అంత బరువు పనులు మా మంగి చేయగలదా" అంది.

"మోసేది వెదురేగా?"

"సరే అయినా పొద్దుగాని, ముంత ... అడుగు ఏముంటుందో?" అంది — నావైపు రెప్పలాడిస్తూ.

నేను వెంటనే దొడ్డిలోకి దూకాను. మంగి పిడకలు చరుస్తోంది. "పాపం పగలల్లా అక్కడ, రాత్రులు ఇక్కడ — పని" అనుకున్నా. చాటుగా వెళ్ళి ప్రక్కలో గిలిగింతలు పెట్టాను.

మంగి వెనక్కి చూసి —

"ఎప్పుడూ వేళాకోళమే! అమ్మ బయటనుంచి చూస్తే?"

"చూస్తే ఏడుస్తుందా?"

మా అమ్మ ఏడవాలా?

ఓసి పిచ్చిదానా! మీ అమ్మ నవ్వాలనే నేనన్నది మీ అమ్మే నన్ను ఇక్కడికి పంపింది. ఇంతకీ ఏమే మంటావో" అని.

"ఏమిటీ.... ..." అని నడుంమీద చెయ్యివేసింది, తిరగబడి కొడుతుందా అనిపించింది

'అడ్తిలోకి వచ్చేయగూడదూ! సుఖంగా ఇద్దరం ఒకదగ్గరుండొచ్చు. ఏమంత పెద్ద పనేమిటీ వెదురు మోతేగా! కూలీ కూడా ఎక్కువ.'

మా బాబొప్పుకుంటాడా?'

"వాడే ఒప్పుకుంటాడు. నొప్పా, సజపా."

అంతట్లోకే మా అప్పన్నమామ ఎక్కడినుంచొచ్చాడో వీధిలో మాటలు వినబడుతున్నాయ్.

నేను మంగిని కండ్లతో ప్రోత్సాహపరుస్తూ.

"ఏం? చెప్పు మరి మీ బాబుతో మాట్లాడనా?"

మంగి మాట్లాడలేదు. కాని అంగీకారం ఆ ముఖంలో మెరిసింది. నేను మళ్ళా కితకితలు పెట్టి, చెంగున దూకి బయటికి వచ్చేసాను.

"ఏం మామా? ఎలాగుంది?"

"ఎలాగుందిరా? అంతా నీతోనే సరి." అన్నాడు నిరుత్సాహంగా. "నీకు అంతకంటే మంచిపని చెబుతారా? అని వీధిలోనున్న మా అప్పన్న మామను అరుగు ఎక్కించా.

"మామా, ఎందుకలా రాత్రులు నానాబాధలు. కండ్లు కాయలు చేసుకొని పనిచేస్తావు—పదిరూపాయలకోసం: అంతా చూస్తే నీకుటుంబా దాయం ఇరవై ఐదు రూపాయలకు మించలేదుకదా? మంగిని ఆదితిలో అద జట్టులో చేర్పేయకూడదూ—రోజుకు ఎలా లేదన్నా యీ సీజనులో రెండు రూపాయలొస్తాయి. ఏనా? — తేలిక కూడాను. ఏం? ఏమంటావ్." అన్నా.

"ఓయబాబో, ఆ వెంకమ్మముండ దబ్బు ఇస్తే నేగాని చేర్చుకుంటుందా?" అన్నాడు గుండెలు బాదుకొంటూ.

మోహనరావుగారిని పట్టుకుంచే ఆ లంకిణీముండ వెంకమ్మతో

చెప్పి ఎలాగో యూభై రూపాయలు కట్టుచేస్తారని నమ్మకముంది. అందులోనూ ఆడజట్టుకు రేటు తక్కువలెండి. నేనన్నా — నేచెబుతాగా! (ాకుంటే చిటికెలో తీర్చుకోవచ్చు. యీ పూరిగుడిసెమీద యాభై రూపాయలు అప్పు తీసుకురా. తరువాత పవంతా నేను చేస్తా."

"సరి నీ యిష్టం ...." అన్నాడు నేను చంకలెగరేస్తూ వెళ్ళి పోయాను.

# 20

ఆవేళ అమావాస్య. అమావాస్యంటే కూలోళ్ళకు మంచి హుషారుగా వుంటుందిలెండి. అడిపీలన్నీ కట్టేస్తారు. ఇక కూలీలు విషా అయి పోయారన్న మాటే.

పది అయింది. మా అమ్మ ఇంటిలో పొయ్యి రాజేస్తోంది. నేనూ మా తమ్ముడూ, నాన్నా యింటివద్దనే వుండి ఇల్లు నేస్తున్నాం. మా పల్లయ్య క్రిందుండి ఆకులందిస్తున్నాడు. నేను ఇల్లు ఎక్కి ఆకులు సరుతున్నా. మా బాబు క్రిందుండి ఆకులు ఎలా సర్దాలో చెపుతున్నాడు.

దూరంగా మోహనరావుగారు కనబడ్డారు ఆయన తల చెదరివుంది బట్టలుకూడా మాసేయి. చటుక్కున నేను మా నాన్నతో అన్నా —

"నాన్నా మోహనరావుగారు వస్తున్నారు.'

అప్పటికే సమీపించిన మోహనరావుగారిని చూచి. మా బాబు ఆప్యాయంతో —

"రండి. రండి.' అని అరుగుపై చాప వేసాడు.

మోహన్‌రావుగారు అరుగుపై కూర్చున్నారు.

మా బాబు నమస్కారం చేస్తూ —

"ఏం సెలవు?" అన్నాడు.

"ఏమీలేదు. భీమయ్యతో మాట్లాడాను. యీవేళ అమావాస్యగా. కమిటీ మీటింగు వుంది.'

"మేస్త్రీల మీటింగా?'

"అవును మీరు రావాలి.'

ఏమిటండీ విషయం.'

"కూలీ పెంపుదల విషయం. ఏడాదినుంచి సాహుకార్లు మొండి చెయ్యి చూపుతున్నారు. యీ సీజనుతోనయినా తేల్చేయాలి.' అన్నాడు సూటిగా.

"ఆయితే కానివ్వండి. మీటింగెక్కడ?' అన్నాడు మా బాబు. మా బాబు ముఖం చాటంతయింది. ఎందుకంటారా? మా బాబుకు తప్పు అనేటప్పటికి వస్తుందండి సంతోషం.

మోహన్ అన్నారు.

"కోటిలింగాల గుడిలో."

నేనూ ఇల్లు దిగాను. మోహన్‌తో అన్నా.

యీవేళ మీరు ఇక్కడ భోజనం చేయాలి.

"అబ్బే నేను వెంటనే ఇంకో పని చూసుకోవాలి.

"తప్పదు. భోజనంచేసి చూసుకోవచ్చు.'

"పని ముందా? భోజనం ముందా? అన్నారాయన.

మా బాబు బలవంతం పెట్టాడు. మోహన్ 'సరే' నని ఒప్పుకున్నారు.

"అమ్మా! మోహన్‌గారికి కూడా ఇంకో సోలెడు బియ్యం వెయ్యవే" అని మా బాబును ప్రక్కకు పిల్చి "మంచి మాంసం తే నాన్నా." అన్నా! 'సరే' అని మా బాబు కూరబుట్ట తీసుకొని బయలుదేరాడు. నేను బయటికి వచ్చి —

"రండి టీ తాగుదాం!' అని మోహన్‌ను "బలవంతంగా. హోటలుకు తీసుకువెళ్ళా మా పల్లంకూడా మాతోనే వచ్చాడు.

టీ త్రాగుతూ మోహన్ సంఘవిషయాలన్నీ చెప్తూ' అంటాడ కదా!

"మీలాంటి యువకులంతా తయారై సంఘానికి నాయకులవ్వాలి తెలిసా! ఈ మేస్త్రీలతో పడలేకపోతున్నాను. చూడు మరి! మీటింగంటే ఒక్కడూ రాడు. నానాబాధలు పడవలసివస్తోంది. కూలి పెంపుదల గురించి. 'యీవేళ మీటింగులో తేల్చేయాలి. నిజమై కాకపోతే సాహూకర్ల రొట్టి నేతిలో పడుతుంది. అందరికీనూ. సంఘం నిడదకంటే బలంగా వుండడంవలన సాహూకార్లు తప్పనిసరిగా లొంగుతారుకూడాను. అదయ్యాక సంఘాన్ని ఇంకాబలంగా తయారు చేయాలి'

"బలంగా అవడమంటే...?' అన్నా తలగోక్కుంటూ

"ఇది తలచుకుంటే అయిపోయేది కాదు కార్మికులందరికి సంఘ శక్తి చెప్పి సంఘంలో చేర్పించాలి, తరువాత ఐక్యత రావాలంటే కార్మికులంతా వారి కోర్కెలపై కలిసిపోరాడేలా చేయాలి. ఈ ఐక్యపోరాటానికి మేస్త్రీలాటంకిమౌతారు. అందుచేత యువకులను నాయకులను చేయాలి"

ఆ మాట అన్నప్పుడు మోహన్ ముఖంలో ఒక విధమైన వికాసం, పట్టుదలా కూడా కన్పించాయి, నేనన్నా!

"మీరేం బాధపడకండి. మేము కష్టపడి అందరినీ చేర్పిస్తాం. తరువాత భారం మీది. సరే, ఇప్పుడు ఏం చేయమంటారో చెప్పండి."

"మేస్త్రీలు ముందు మీటింగుకు వస్తే చాలు." అన్నాడాయన. అబ్బా యీయనకంత బాధ ఎందుకో నాకర్థం కావటంలేదు. ఈయన ఒడిలో పడేది కూడా ఏమీలేదు. సరే; నిస్వార్థత్యాగి. నా జీవితాన్ని గట్టెక్కించిన మహానుభావుడికి ఏదో పుడకాభక్తి ప్రదర్శించడం మంచిదేగా, నేనన్నా.

"సరే, మీరు భోజనంచేసి గుడిలోకి చేరుకోండి. మేస్త్రీలందరినీ మేము లాక్కొస్తాము" అని మేమిద్దరం మోహన్‌ను ఇంటికి అప్పజెప్పి వెళ్ళిపోయాము. నాకు తెలుసుగా యీ మేస్త్రీలందరూ.

# 21

గుజ్జుగా పెరిగిన చింతచెట్టుకు వెనుక లాగేసి వుంది. మా మంగి — "మా" అంటున్నానంటే, ఎప్పటికైనా మంగి నాదేనండీ. మరి, కచ్చా బిగించి పైట వెనక్కి లాగి, వెనుకనుంచి ముందుకులాగి, మోలలో గుచ్చి. ఆ లాటులోంచి ఒక్కొక్క వెదురూ పైకిచూస్తూ తీస్తోంది. బిగించి కట్టిన పైటలోంచి మా మంగి యౌవ్వనం నాకోసం ఎదురు చూస్తున్నట్టుంది. నిజంగా మా మంగి చూడడానికి ఎంత అందంగా వుంటుందనుకున్నారూ. అలా వెదుళ్ళు లాగుతుంటుంటే. కష్టంతో సన్న చిరుక్కు తున్న గొల్లభామలావుంది.

హైకీ




నేను దగ్గరకెళ్ళి ....

'తెలిసిందా? మంగీ! కూలి పెంచమని సాహుకార్లను అధికారికి సంఘం తీర్మానించింది. నీ కూలికూడా పెరుగుతుందిలే. ఇక నీ బాబు భూమిమీద నిలబడతనుకో.' అని నా చూపులు మంగివైపు విసిరి ముందుకు సాగబోయాను.

"ఇదిగో నారాయణా! ఈ వెదుళ్ళు పైకొమ్మలకు తగులుకుంటు న్నాయి. కాస్త తప్పిద్దూ!" అని నా వైపు జాలిగా చూచింది.

"ఓహో, నీ కూలీలో నాకేమన్నా వాటా ఇస్తున్నావా? నేను సాయంచేయడానికి?"

'వాటా ఇస్తేనేగాని సాయంచేయవన్నమాట?'

'మరేమనుకున్నావ్. ఏం? వాటా ఇస్తావా? అని చిలిపి చూపుతో మంగిని పలకరించాను. నేను సాయంచేయననుకున్నారా ఏమిటి? ఆ మాటకొస్తే నా మంగికోసం నేనేమైనాచేయడానికి సిద్ధమే కాని వుండిగా. కాస్త (?) అదంతా మీకు చెప్పాలా? ... అర్థమయ్యే వుంటుంది మీకు,

మంగి ఏటవాలుగా ధనస్సులావున్న కనుబొమ్మల దిగువనుండి. తుమ్మెద జంటలావున్న. కళ్ళచూపులతో ముఖాన్ని క్రిందికి దించింది. అంగీకార సూచకంగా.

అడివిలో వేళాకోళం అంతకంటె సృతిమించకూడదుగా మరి. నేనూ వాలుగెదళ్లు సాయంచేసి వెళ్ళిపోయాను, మరి వెళ్ళకపోతే సంఘం గొడవలు ఎవరు చూస్తాడు?

కూలీ పెంపుదల గురించి అవసరమైతే కూలీవాళ్ళందరినీ సాహుకార్ల వద్దకు తీసుకెళ్ళి ఆందోళన చేయాలి. నేను దొంగనని ఇంకా తల నెరసిన రకాలు ఎత్తిపొడుస్తున్నారు యువకులమాత్రం నాకూడా పడుతున్నారు — వీళ్ళు పక్షానికి చేరినట్టు. ఎలాగయినా యువకుల బుర్రలు స్వచ్ఛంగా వుంటాయిగా. ఇప్పుడు యువకులే సంఘం గొడవల్లో ఎక్కువ సాయంచేస్తున్నారు.

అబ్బ! ఈ తలనెరిసిన మేస్త్రీలతో చాలా కష్టంగా వుందండీ. వీళ్ళకు తెలీదు చెప్పితే వినరూ? "నీకేం తెలుసు" అని నన్ను అడుగుతారేమో? — పెద్ద తెలిసేదేముంది చెప్పండి? అంతా ఐక్యమత్యంగా వుండడమేగా. ఎవరికైనా కావలసింది? తెలియకపోవడానికి మోహన్‌రావు గారు అప్పుడప్పుడు విషయాలు చెప్పకపోతేనేగా?

నిన్న కమిటీలో జరిగిన విషయాలన్నీ చెప్పేరు. దొంగముండా కొడుకులు — యీ మేస్త్రీల పెళ్ళాలు పనిచేస్తే తెలుసును? ఆడవాళ్ళ కష్టం. వీళ్ళు కమిటీలో ఆడవాళ్ళకు కూలిపెంపనక్కర్లేదన్నారట. వాళ్ళు కష్ట పడడం లేదంటారా? చెప్పండి? మగాడెంత పనిచేస్తున్నాడో. ఆడదీ అంతే చేస్తోందికదా? ఇక ఆడ. మొగ భేదమేమిటి చెప్పండి? మరి మా పేటలో వరసమ్మ వుంది? మొన్ననే ఇద్దరి పిల్లలను వొదిలిపెట్టి ఆవిడ మొగుడు కాటికి పయనించాడు. పాపం వరసమ్మకు ఆరోమాసమో, ఏదోమాసమో కూడాను. పెద్దకుర్రోడు నడుపుకుంటున్నాడు? ఆవిడ పని చేయకపోతే గడవదు. గర్భిణీమనిషి ఆవిడనెవరూ చూసేవారులేరు. పైగా యీ మేస్త్రీలు వెధవ కబుర్లు. నన్నడిగితే ఆవిడకు ప్రసవించిన మూడు

నెల్లపరకైనా సంఘం డబ్బు ఇవ్వాలంటాను. మేస్త్రీలకు సంఘం డబ్బు ఖర్చుపెట్టడానికి ప్రాణం వొప్పదుగా? వీసీ సాహుకార్లను అడుగుతారా అంటే అప్పు! తమ మెహర్బానీకి ఆటంకం. ఇటువంటి తగాదాను ఏంచేయాలి? చెప్పండి. వీళ్ళా పనిచేయరు. పనిచేసే మమ్మల్ని బెదిరింపడం, దొరికింది — ఒకటి; మాట్లాడితే కూలీ తెగ్గోస్తాననడం. వీళ్ళ పరిపాలన ఉన్నంతవరకూ సాహుకార్లు మాత్రం లొంగరు.

అంచేతనే నాకు ప్రాణం విసిగిపోయింది. కుర్రోళ్ళందరికీ కర్రె క్కించి వీళ్ళ గుట్టు బట్టబయలు చేయించేస్తాం. వీళ్ళు కూలీ పెంపకానికి వ్యతిరేకించినట్టు అందరికీ చెప్పేసా.

ఆ వెంకమ్మ లేదూ! లంకిణీముంత! దానిని పట్టుకుని చింతచెట్టు దులిపినట్టు దులిపేరు — ఆడవాళ్ళంతా. అడంటుంది కంటా?

"ఆ వెధవ దొంగముండాకొడుకు చెప్పితే మీరు నమ్ముతారా?" అని.

వెధవెంత? దీని బ్రతుకంతా అలా గుప్పెట మూసి ఉన్నంతసేపే

ఆ విషయమేదో తేల్చుకుందామనే నేను ఇప్పుడు వెళుతున్నా. అంతట్లోకే మంగి అప్పుచేసింది. దీని సంగతేదో తేల్చేస్తానులెండి: దీని వెంకమ్మ పేషాలు నా దగ్గర కుదరవు! నిలబెట్టి అడిగేస్తాను.

## 22

కూలీ పెంపాలన్న ప్రచారం అందరిలోకి వాడంగోజల్లోకి ప్రాకిపోయింది రాత్రులు యిళ్ళవద్దకుకూడా వెళ్ళి ప్రచారంచేసాము. మరి ఏమవుతుందో? అనేక మోహనరావుగారు ఆడితిలోకి వచ్చారు. మా మావ

పని తెల్లవారుఝామునే అయిపోయిందిలెండి మోహనరావుగారు వచ్చేటప్పటికి మారుజాతి బాజాలు కమాను చేస్తున్నాం ఆయన రాగానే నేను పనిలోనుండి లేచి వెళ్ళాను. మా పల్లయ్యనుకూడా తీసుకొని. మేం ముగ్గురమూ మాట్లాడుకొన్న తరువాత మా జట్టులో వీర్రాజు లేడూ? వాడితో చెప్పా—సరిగ్గా పది పదిహేను మంది కుర్రోళ్ళను లాక్కొచ్చాడు.

మోహనరావు మమ్మల్ని అడగడం మొదలెట్టాడు—

“ఆడవాళ్ళేమంటున్నారు?”

“ఏమనటం ఏమిటి? కూలీ పెంచటం అంటే ఎవరు వ్యతిరేకిస్తారు లెండి ఆ లంకిణీముండ వెంకమ్మనూ, దాని శిష్యురాండ్రేగా—మనకు వ్యతిరేకం. ‘ఆ ముండను భీమయ్యేంత చెబితే అంత!” అని తడుముకోకుండా చెప్పేడు మా తమ్ముడు

“సరేలెండి ఏదో కొంతమందికేంలే. ఇంతకీ ఆ వెంకమ్మ వెనుక ఎవరూ లేకుండా చేసుకోవాలి మనం ...... ఊ! ఇక మేస్త్రీలేమంటారు? మీరు ప్రచారం చేస్తోంటే మాట్లాడకూరకున్నారా? వ్యతిరేకించారా?’

“ఎవ్వరూ మాట్లాడలేదు.’ అన్నా. నేను.

వెంటనే వీర్రాజు అందుకొని:

“మాట్లాడలేదు. ఇక్కడ బాగానే ఉంటున్నారు. ఇంటి దగ్గర ఎత్తుతున్నారు జెండా! మన మేస్త్రి మరీను’ అన్నాడు.

“వీళ్ళను లేకతేస్తే నేగాని లాభంలేదండీ! దొంగముండా కొడుకులు’ అన్నారింకో యువకుడు.

ఆ యువకుడెవరో తెలుసునా అండీ. పాపం మొన్న ఓ పూట తల్లికి సుస్తీగావుంటే రాకపోతే మేస్త్రి వారం రోజులు పనిముట్టడానికి వీల్లేద న్నాడు. అందుకే అతనికంత మంట.

మోహనరావు. నెమ్మదిగా అన్నాడు

"తొందరపడకండి. ముందు మనకు నిలబడడానికి చోటుచూసు కుంటే. పడుకోడానికి అదే దొరుకుతుంది."

"అవును నిజమే. వీళ్ళకు చాలా పలుకుబడి వుంది. సాహుకార్లకూ. కూలీలకూ. వీళ్ళెంతంటే అంత" అన్నాడింకొక యువకుడు.

"అందుకే మనం జాగ్రత్తగా చూసుకునవాలి. మనం నడిచేమార్గం ముళ్ళకంచెలతో వుందని మరచిపోకండి. సరేకాని మొత్తంమీద అంతా కూలి పెంపుదలకోసం అడగడానికి అనుకూలంగా వున్నట్టేగా?" అన్నాడు మోహన్.

'ఆఁ. అందుకు సందేహంలేదు.' అన్నాడా వీర్రాజు.

మా జట్టులోనే ఇంకొకడు లేచి—

"ఏమిటి సందేహంలేదు? మరి మొన్న ఎంత గొడవచేసాడు?"

"వాడు సంఘానికే వ్యతిరేకంలా' వాడిని మేస్త్రీలలో పెట్టి జుల్మానా వేయిస్తేనేగాని బుద్ధిరాదు.' అన్నాడు వీర్రాజు.

"మోహన్‌రావుగారూ, వాడేం చెప్పినా వ్యతిరేకిమేనండీ? వాడం టాడుగదా, "సాహుకార్లు, మన తండ్రిల్లాంటివారు వాళ్ళకు తెలిదేమిటి బిడ్డల సంగతి? వాళ్ళే చూస్తారు. అనవసరంగా మనం అడగడం, తండ్రి

బిడ్డకు చీలికలు తేవడమే"నని దీనికేం చెయ్యమంటాశు? అని ప్రశ్నించా నేను.

అతని గురించి ఏమీ అనకండి. అతనికి కాంగ్రెసోళ్ళ సపోర్టు ఎక్కువ. అందులోనూ. మన సంఘంలో అన్ని రకాలవాళ్ళూ వుండాలి. ఐతే పూర్తిగా వ్యతిరేకులుకాను. నేను చెప్పేది సంఘం గురించి. పని చేసే వాళ్ళంతా వుండొచ్చు. అతనికి కొంతమంది వున్నారు. అతనంతకీ వినకపోతే నెమ్మదిగా అతని తప్పును ఆ కొంతమందికి చెప్పి మన సంఘంలోకి తీసుకురావాలి" అన్నారు మోహనరావుగారు.

"వాడికి నేనప్పుడే చెప్పానుగా "అడిగితేగాని అప్పైనా పెట్ట'దని" అన్నాడు వీర్రాజు వీర్రాజున్నాదే వాడెప్పుడూ చురకత్తిలా మాట్లాడేస్తాడు.

"అయితే మరి మేస్త్రీలను పిలిచి సాహుంకార్ల వద్దకు పంపొద్దా!" అన్నాడు. మోహనరావుగారు ___ మా అంగీకారంకోసం ఎదురుచూస్తూ.

"మనమంతా వెడదాం." అన్నాడు మా తమ్ముడు.

"ముందు మేస్త్రీలను పిలవండి. అసలు వాళ్ళేమంటారో చూద్దాం" అన్నాడు మోహన్.

నేను, మా తమ్ముడు మేస్త్రీలను పిలుచుకు రావటానికి వెళ్ళేం.

నేను ప్రెసిడెంటు భీమయ్య దగ్గరకెళ్ళి. మోహనరావుగారు రమ్మంటున్నారు అంటే అతనంటాడు గదా!

"మిమ్మల్ని పని పొదిలిపెట్టి ఇలా ఎవడు తిరగమన్నాడు? జాగ్రత్త. కూలి ఎగ్గోస్తా. మీరు వెళ్ళి పనిచేయ్యండి. ఆ గొడవలు మేం చూసుకుంటాంలెండి.' అన్నాడు మీసాలు మెలిపెడుతూ.

కాలికేస్తే మెడకు. మెడకేస్తే కాలికి వెయ్యడం కాకపోతే అతను చెప్పినదాంట్లో అర్థమేముంది చెప్పండి ఒకవైపు భోజనాలవేళం వాడు. మరొకవొంక వన రట్టీ అంటాడు 'వొంక దొరకనమ్మ డొంక పట్టుకు ఏడిచింద'ని ఎందుకు చెప్పండి. అ తప్పించుకునే మాటలు.

సాధ్య సూరన్న పెద్ద మేస్త్రీలా వచ్చి —

"ఒకవేళ వెళితే మాకూడా మీరెందుకు?

నాకు ముక్కుమీదకొచ్చింది — కోపం. నారుపోసి. నీరుపోసి. కంటి బిడ్డలా సంఘాన్ని పోషిస్తున్న మోహనరావుగారిని తూలనాడుతుంటే. కోపం రాదంటారా? నేను వెంటనే తగులుకున్నా.

'మీరెందుకప్పుడు? ఆయన్ని సంఘం సెక్రటరీగా ఎందుకెన్నుకున్నారు?'

సూరన్న గొంతుకలో పచ్చివెలక్కాయ పడ్డట్టయింది. గుక్క తిప్పుకోలేక —

"ఎవరూ ఎన్నుకోలేదు.'

"ఆ. నీవొక్కడవి ఎన్నుకోకపోతే సరిపోయిందా?'

"సరే, సూరన్నగారూ మీరే వెళ్ళండి. ఎవరు వెళ్ళినా యీ కూలోళ్ళ కోసమేగా" అని సర్దబోయారు మోహనరావుగారు. ఆయనకు జీవకారుణ్యం ఎక్కువలెండి. కరుస్తున్నా ముద్దుపెట్టుకునే రకం.

అంతట్లోకే మా బాబు కలుగజేసుకున్నాడు. మా బాబు అంటే మేస్త్రీల్లోకూడా చాలా గౌరవం.

"ఏమిటోయ్, సూరన్నా! పెద్దా చిన్నా లేదేమిటి! ... సరే మోహన రావుగారూ మీరుంటండి. మేం వెళతాం......... మీరు వస్తే వైరాదం టారు." అన్నాడు.

తర్వాత విరగాకుండా, సామువావాకుండా మాట్లాడేడు మా బాబు. నాకు ఆ మాటలు ఇష్టంలేవనుకోండి. కోపీతెంది, ఏదో బండి గట్టెక్కింది. అదే బాబు.

"సరే వెళ్ళండి. నేనిక్కడే వుంటా," అన్నారు మోహనరావుగారు,

"ప్రా, పదండిరా అడిగొద్దాం — మొండేలుగొట్టి మొలేస్తారా ఏమిటి"

"అన్నట్టు ఏమండీ, సాహుకార్లకు తీర్మానం పంపేరుకదూ? " అన్నాడు మా బాబు.

"ఆ, పంపి అప్పుడే ఐదారురోజులైంది!" అన్నారు మోహన రావుగారు.

మా బాబు మాట, మేస్త్రీలంతా కాదనలేకపోయారు. భీమయ్య ముఖం చిట్లిస్తూ మౌనం వహించాడు. సూరన్న మూతివిరుచుకొని వెళ్ళిపోయాడు. అదీగాక ఇతన్నెవరూ పిలిచేదిలేదు. సూరన్నను పిలవని పేరంటానికి తయారవడం ఇష్టమే.

అంతా వర్తకుల వద్దకు వెళ్ళారు. సంఘబలాన్ని గుర్తించిన సాహుకార్లు వచ్చినట్లు కూలిపెంపుదలకు అంగీకరించారని ఇంకో గంటకు తెలిసింది. ఇక చూసుకోండి అదీ ఎలా వుంటుందో —

ఓ, క్షణంలో యీ వార్త పాడితసంతా పాకిపోయింది. కూలీలంతా ఉత్సాహపడిపోయారు. మేస్త్రీల ముఖాలు అరచేతులంతయ్యాయి.

# 23

మరునాడు ఉదయానికి ఏ రేవులో చూసినా ఇదేగోల. పట్నం కలకలారావంలా వుంది. కోటిలింగాల రేవంతా వెదురుతెప్పలతో నిండిపోయింది. వెదురు మోస్తున్న ఆడజట్టుల కేరింతాలు. నీళ్ళకు వచ్చిన ఆడవాళ్ళ గుసగుసలూ అన్నీ చూస్తుంటే, శివరాత్రి తీర్థాన్ని మరపిస్తున్నాయి. మాటలా — రూపాయికి పావలా కూలి పెరిగింది.

అప్పుడే సూర్యుడు తూర్పున తయారు ఆవేళ ఉదయాన్నే కాస్త గోదావరిపై మబ్బు క్రమ్మడం వలన — సూర్యకిరణాలంత వేడిగ లేవి. అంతట్లోకే చల్లగాలి వీచింది. గోదావరిపై మబ్బులు కరిగి జల్లుకొట్టడం మొదలెట్టాయి. ఆ జల్లుపై తూర్పునుంచి ప్రసరిస్తున్న సూర్యుని సప్తవర్ణ కిరణాలు పడి — చక్కటి ఇంద్రధనుస్సు నేర్పరిచాయి.

ఆ గోదావరిపైపై అడ్డంగాపడ్డ ఇంద్రధనస్సు. మహోల్లాసమైన ఏడు వన్నెలతో నన్ను మైమరపించేసింది. ఆహా, ఆ వన్నెల్లో ప్రకృతి శోభంతా తొణికిసలాడిందంటే నమ్మండి. మహాకవుల కలాలు చిందించిన నవరసాలను ఆ ఛాయలు వెలిగ్రక్కుతున్నాయి ఆ ధనుస్సుపై నున్న ఊదావన్నె చంటిపాపల నీలికనుపాపల్లోని అమాయకతను. పసిడిఛాయ నూతన వధూవరుల ముఖకవళికల్లోని నవ్యకాంతుల్ని. నీలం — కన్నతల్లుల కాంతి వాంఛలనూ, ఆకుపచ్చ సస్యశ్యామలమైన పంట పొలాలనూ........ క్రింద యెరుపు, పేదల పిప్పినాళ్ళమూలను పెల్లగిస్తోంది. నిజంగా ఆ ఇంద్రధనస్సు ప్రకృతిశోభలేకాదు. మానవజాతి ఆశయాల చేతె త్రిచడానికే అవతరించినట్టుంది.

ఆ కొంకుల క్రింద, గోదావరిలోనుండి వొడ్డుకొచ్చే ప్రతీ అలా "తళుక్" మంటూ మెరిసిపోతుంది. ఆ అలలు మోసుకొచ్చే పిల్లగాలులకు రేవులోని కూలిపడుచుల ముంగురులు రెపరెపలాడుతూ కొట్టుకుంటున్నాయి. ఆ ఇంద్రధనస్సులోని రంగులు పడుతున్నందువల్ల ఆ పడుచులు వన్నె చిన్నెల పక్షుల్లా గుంపులు గుంపులుగా కనబడుతున్నారు.

నేను ఆ కోటిలింగాలరేవులోని రావిచెట్టు క్రింద నిలబడి, ఆ దృశ్యాన్ని రెప్పవాల్చకుండా తన్మయుడనై తిలకిస్తున్నా.

నీలాటిరేవులో నీళ్ళకొచ్చిన ఆడవాళ్ళ సందడిచూచి ఆ మాటలు వినాలని ముందుకెళ్ళా ఇంకేమున్నాయ్ — సంసారం గొడవలు. "నిజమే పాపం' నా గోడు ఏదో డబ్బు తగలేస్తాడు. కాని, అసలు సంసారమంతా మోసేవాళ్ళు ఆడవాళ్ళే కదండీ. అదైనా ఆడవాళ్ళకు యీ సోదంతా వెళ్ళబోసుకోడానికి నీలాటిరేవూ, నూతిగట్టూ తప్ప ఇంకేముంటాయి, ఏమైనా సంసారం చేసుకునేవాడు ఆ ఆడవాళ్ళ మాటలనుండి నేర్చుకోవలసింది ఎంతైనా వుంటుంది." అనుకుంటూ ముందుకు సాగా.

ఇలాగే తలకోమాటా చెప్పుకుంటూ ముందుకు సాగుతున్నారు.

కొంతమంది కూలీలు నీలాటిరేవు ప్రక్కనుండి రేవులోదిగి వెదురు తెప్పల కట్లుబిగ్గొడుతున్నారు, మా మంగి ఒడ్డునే వుంది మా మంగిని అప్పుడు చూడవలసిందే. వెలసిపోయిన ఆకుపచ్చరంగు చీరపై ఇంద్రధనస్సులోని ఆకుపచ్చరంగు పడి రామచిలుకలా వుంది. నిగనిగలాడుతోన్న శరీరం, ఆ సుంద్రని బుగ్గలు, అబ్బ! ఎంత చక్కగా వుండేను

కున్నారు:— మంగి ప్రక్కనే వున్న ఇంకో ఆవిడ మంగితో ఏమంటుందో విన్నారా?

"చూచావే మంగీ! సంఘం ఎంత మేలుచేసిందో? పోనీలే. ఏదో కాస్త యీ వర్షాకాలం వెళ్ళిపోతుంది" అని.

దానికి జవాబుగా మా మంగి అంటోంది.

"ఆఁ! మన మేస్త్రీలాంటిది వుంటే, మనం రెండు చేతుల్తో కూడు తినాలి. ఆ మోహనరావుగారు నిజంగా దేవుడనుకో! ఆయన లేకపోతే మన కూలీ గురించి చూచే నాథుడెవడమ్మా!" అంది.

మా మంగి ఇంత తెలివైందనుకోలేదు నేను. ఆ జవాబు విని నాకు మంగిని ఎంత త్వరగా పెండ్లాడేద్దామా? అనిపించింది.

"అవునమ్మా! ఆ నారాయణ చెప్పేడు నాకావిషయం. కూలీ ఎక్కువ చేయక్కర్లేదందట ఇంకా మాకీ పునుసుతో యీ ముద్ద దిగితే చాలందట వంగవాడిముండ, ఏం క్రొవ్వెత్తిందమ్మా దానికి. దానికేం? — అప్పుడు అనుకున్నాదే పెద్దవాడు. పైగా, కష్టపడకుండా యీ కూలీతో హాయిగా కాలు మీద కాలువేసుకూర్చొంటుంది. దానికేం?' అంది ఆవిడ.

ఈ మాటలన్నీ ప్రక్కనున్నవాళ్ళు వింటూ ఆ మాటల్లో తాముకూడా మాటలు కలుపుతున్నారు

మా పేటలో ఒకావిడ అందికదా!

"మన నారాయణ ఎంతవాడయ్యాడు. పోనీలే గౌరవాన్ని సంపాదించుకుంటున్నాడు. పదిపేలకీ అలా వుండవలసిందే."

నేనప్పుడు వెంటనే మంగి ముఖంచూచాను. మా మంగి ముఖంలో సిగ్గు కనబడింది. తాను కోరే మగోడ్ని గురించి ఎదుటి వారు పొగడగా వింటే ఆ ఆడదాని సంతోషం ఎలావుంటుందో వేరే చెప్పాలా? నేను మంగిని చూచి సంతోషించేనేగాని. వెంటనే ఒక ధర్మసందేహంలో పడి పోయాను. అదేమిటంటారా?

"నేను గౌరవం సంపాదించుకుంటున్నానని ఈవిడంటోంది — యీవిడే కాదులెండి. ఇటువంటివాళ్ళే ఎక్కువగా అంటున్నారు. అయితే నేను చేస్తున్నపని మంచిదేగా. మరి ఈ మేస్త్రీలంతా తిడతారెందుకు? నేను కూలి ఎక్కువకోసం కృషిచేస్తే యీ మేస్త్రీలకుకూడా లాభం వస్తుంది గా?" ఇదే ఆ సందేహం. అరగంట అలాగే వొడ్డునున్నవాళ్ళ మాటలు వింటూ ఆలోచించాను. కాని జవాబు దొరకలేదు.

ఇంతల్లోకి గట్టుమీదనుంచి వెంకమ్మ కేకలు వినబడ్డాయి.

"ఏమిట్రో! అంజల్లారా! ఆ ప్రాసులు.' ఆ మాటలకు రాత్రులందు గ్రుడ్లగూబను చూచి పక్షులు వేటి గూటికవి చెదిరిపోయినట్లు కూలీలంతా ఎవరి పనుల్లోకి వాళ్ళు కదిలిపోయారు.

# 24

అర్జంటుగా పేపరుమిల్లువద్ద కలుసుకోమని ఆవేళ మోహనరావు గారి నుండి నాకు ఉత్తరం వచ్చింది. వెంటనే నేను ఒక సైకిలు అద్దెకు తీసు కొని, పల్లయ్యను వెనకెక్కించుకొని బయలుదేరా? పనికి ఆలస్యమైతే ఇదివరకు మా మేస్త్రి ఆ రోజుల్లా కూర్చోపెట్టేవాడు కాని. యిప్పుడు అలా కుదరదుగా? నన్ను కూర్చోపెట్టాలంటే. కొంగమొదలు ఎంద్రకాయ పట్టుక

న్నట్టు పట్టుకుంటారు మిగతావాళ్ళు ఇప్పుడు నేనెక్కడికెళ్ళినా సంఘం పనిమీద వెళ్ళేవనే వాళ్ళ ఉద్దేశం. చూశారా? నాకివ ఎంతమోజో? పదిమందికోసం పనిచేసేవాడికి అంతే అనుకోండి.

పేపరుమిల్లు ఎందుకో ఆవేళ గొంతెత్తి అరవలేదు. అంతెత్తేస్తున్న అంబోతులు పలుపుత్రాడేపినట్లు పడుంది. తీరా మిల్లువద్దకు వెళ్ళిచూస్తే, పనివాళ్ళంతా బయటే అండాకే మిల్లు అరవలేదనుకున్నా.

ఆ గుంపులో ఎలా లేదన్నా వెయ్యిమందికి తక్కువ ఉండరు. తన దీర్ఘ బాహువులను అటూ,ఇటూ త్రిప్పుతూ మోహనరావుగారు వుద్రేకంతో ఉపన్యాసం ఇస్తున్నారు. ఆయన కండ్లు ఎర్రబడిపోయాయి. ఆ గుంపులో చుట్టూనిలబడివున్న కొంతమంది ఆ మాటలు వినబడకుండా అల్లరిచేస్తున్నారు. నాకు సందేహమే. పేపరుమిల్లు కూలీలకు మోహన రావుగారంటే ఎంతోగురికదా? యీ కొద్దిమందైనా ఎందుకరుస్తున్నారు? అని.

ఏదో తెల్సుకుందామని మా తమ్ముడుకు సైకిలు అప్పగించి నేను ఆ మీటింగులోకి బయలుదేరాను.

ఇప్పుడు నాకా మాటలు స్పష్టంగా వినబడుతున్నాయి. మోహనరావు గారు యీ దఫా ఇంకా గట్టిగా గొంతెత్తి గంభీరంగా మాట్లాడుతున్నారు. సభ కాస్సేపు ప్రశాంతంగా వుంది.

“సోదరులారా; ఈ బోనసు పద్ధతి ఓ పేదివందు. అనారోగ్యం వలన ఒక్కరోజు పనిమానినాసరే — సంవత్సరం బోనస్సంతా ఎగ్గొడతారు. సగంలాభం కార్మికులదేననిచెప్పి నష్టంతేల్చి మనమీదే వింతవేస్తారు

"పని కుంటుపరచిందనే సాకుతో సమ్మెలను నిషేధించి నిర్బంధాన్ని ప్రయోగిస్తారు. కడుపుమండే కార్మికుని గాడిదలా పనిచేయించడం సోమరిపోతులైన ధనికుల కుకినింపడం. సమ్మెలను నిషేధించడంవ కూలీలమధ్య చీలికలు కలిగించి ఐక్యఉద్యమాన్ని నాశనంచేయడం ఈ కొత్త విధానంయొక్క కుట్ర. నా మాట వినండి. ఈ విధానాన్ని అన్ని దేశాల కార్మికులూ, త్రిప్పికొట్టి త్రోసేస్తే భారత ధనికవర్గం ఇక్కడ ప్రవేశపెడుతోంది. మన పేపరుమిల్లు అధికారులు దానిని అమలుజరుప బూనారు. ఈ విధానం వొట్టి మోసం, నమ్మండి. దీనిని అంగీకరించకద్దని నా మనవి. కూలి ఎక్కువ ఇవ్వాలని పోట్లాడదాం. మన కార్మిక ఐక్యతను బలపర్చేవారంతా యీ విధానాన్ని కాలతన్నాలని నా మనవి." అని గంభీరంగా వుద్ఘాటించాడు. ఆయన బంగారంలాంటి శరీరంనుంచి స్వేదబిందువులు జలజలారాలుతున్నాయి. క్రిందకూర్చున్నవారు తప్పట్లు కొట్టారు.

"రండిరా, పోదాం. కూలేకాకుండా, లాభాలుకూడా పంచిపెడుతుంటే వొద్దనేవాడెవ్వడు!" అని గొల్లున నిలబడ్డవాళ్ళు కేకేసి నిష్క్రమించడంతో వాళ్ళతోపాటె కొంతమంది లేచిపోయారు. మీటింగు చిన్నమైపోయేలా కనబడుతోంది. నాలో ఆత్రుత ఎక్కువైంది. రోమాలు నిక్కబొడిచాయి. ఒక్కసారిగా, మీటింగు మధ్యకుదూకి, ఆయన చెప్పినట్లు వినండి. ఆయన అబద్ధమాడడు మిమ్ములను నమ్మించి గొంతుకకోయడు. నమ్మండి, వెళ్ళిపోకండి," అందామనుకున్నా. అంతట్లోకి అంతా లేచిపోయారు.

అరారె. బెల్లానికి చీమల్లా పోతున్నారు అది బెల్లంముక్క కాదని బెల్లంపూతపూసిన కంకర్రాయని తెలుసుకోలేకపోయినందుకు నాకు విచారం కలిగింది. దిగితేగాని లోతుతెలియదులెండి. అందులోనూ. మా కూలివాళ్ళు న్నారు. చూశారా? బొణుపు కడితేనేగాని నెత్తికెడుంకోరు

పనుల్లోకిపోవాలని నిర్ణయించుకున్నారంతా, కాని ఆవేళకు ఆలస్యమై పోయిందని. రేపటినుండి పనిలోకి వెళ్ళాలనికోసం. అంతా ఇండ్లకు పోతున్నారు.

మోహన్. ఆనందరావుతో మాట్లాడుతూ వెనుక వస్తున్నాడు. ఆనందరావు ఆ మిల్లులోని హరిజన కార్మికుడేలెండి. మోహనరావుగారి ముఖం పైకి విచారంగానే కనబడుతున్నా మాటల్లో మాత్రం ఒకరకమైన విశ్వాసం తొణికిసలాడుతున్నట్లు గ్రహించాము. ఆనందరావు అంటున్నాడు.

"ఎప్పుడయితే మేం గేటులోకి వెళ్ళేమో మేనేజరు అప్పుడే చూపిం చాడు. యీ కొత్త బోనస్సు విధానం. నేను వెంటనే మన వాళ్ళందరితో చెప్పి "కుదరదు. జీతాలు ఎక్కువ చేయాలనండి చాలు.' అనిపించా కాని. యీ పెద్ద జీతగాళ్ళంతా. సంతోషంతో మేనేజరు విధానాల్ని బలపరిచారు పోనీలెండి? వాళ్ళకే తెలుస్తుంది దాని తీపి."

"నేను చెప్పలేదూ? యీ పెద్ద జీతగాళ్లే యీ విధానాన్ని బలపరు స్తారు.' అన్నాడు మోహన్.

"కష్టపడి ఎలాగో బయటకు రప్పించాం అందరినీ. పోనీలెండి. ఇంకొకప్పుడు మన శ్రమ ఫలించకుండా వుంటుందా?" అన్నాడు ఆనందరావు.

నేననుకున్నా. "అమ్మా! ఆనందరావు ఏదో కుర్రోడనుకున్నా! వెయ్యిమందిని నడిపిస్తున్నాడే.

అలాగే మాటలాడుకుంటూ. ఊటలంక చేరేం నన్ను మళ్ళ ఒకసారి మాత్రం మోహన్ పలకరించి. ఇక ఆనందరావుతో సంభాషణలోనే పడిపోయాడు."అరెరె.కార్మికుల అమాయకత ఎంతపనిచేస్తుంది!" అని ఎంతో వ్యథ పడుతున్నట్టున్నాడు మోహన్. అంతకనే నేనూ మాట్లాడించలేదు.

అలా మాటలాడుతూ, వాళ్ళు. ఆనందరావు ఇంటినికూడా దాటి పోతున్నారు. నేనే ఆ ఇంటిని ఎరుకపరచి—

"రండి, ఇంకా ముందుకుపోతున్నారు.' అన్నా. వాళ్ళు వెనక్కి వచ్చారు. అందరం ఇంట్లోకివెళ్ళాం. నాకు తెలుసులెండి.— ఆ యిల్లు ఆనందరావు సంగతి నాకు బాగా తెలుసుకూడా.

ఆనందరావు. ఇంటిలోకి వెళ్ళేడు మేము అంటే, మా తమ్ముడూ, మోహనరావురావుగారూ నేనూ, మాటలాడదామని పెరట్లోకి వెళ్ళేం. మేము మాటలాడుకోవడం ప్రారంభించాం. ఇంతలోకే మా మాటలకు అంతరాయం కల్పిస్తూ లోపలినుండి ఏవో మాటలు వినబడుతున్నాయి.

మాకెదురుగా వాళ్ళ వంటిల్లు వుంది. అది వెదురు దడితో కట్టిందే· వంటింటినానుకొని పోగడివుంది. ఆ ప్రక్కనే ఇంకో గది వుంది. అసలు వాళ్ళ ఇల్లే మిద్దెలేనిది కావడం వలన వాళ్ళ పెద్దగదిలో అనుకుంటున్న మాటలన్నీ మాకు వినబడుతున్నాయి. ఆ వినబడడానికి ఆవసరమైన కారణం వుందిలెండి ఏదో అడ్డదిడ్డంగా వున్న నాలుగు తాటిదూలాలు, ఆ వచ్చే

మాటలను ఆపలేవు అందులో మూడు గొంతుకలు మాటలు వినబడుతున్నాయి.

అదొక స్త్రీ గొంతుక —

"నీవిలా పనిమానేస్తే, అరుంధతికి పెండ్లెలా అవుతుందిరా? ఇప్పటికే నలుగురి నోళ్ళలోనూ పడిపోయాం." అంది.

ఆఁ, పోలికగట్టా, అది ఆనందరావు తల్లి గొంతుకే. పాపం, ఆనందరావు తండ్రి, సంసారభారాన్ని అతని భుజాలమీద వేసి, చనిపోయాడు. అదీగాకపోయినా, పెద్దతలకాయలు, పౌరుషానికిపడి ఏడుస్తారు. చూడండి! ఆనందరావు చెల్లెలు పుష్పవతి అయినా, ఇంకా పెండ్లికాలేదు. ఎప్పుడూ ఒకరిచేత మాటపడని అతని తల్లి, అలా బాధపడుతూ అన్నాదంటే, ఆనందరావు పని మానేశాడని కోపంకాదు. అరుంధతికి పెండ్లికాలేదనే బెంగ.

మోహనరావుకూడా, ఆ మాటలను చెవులు నిక్కబెట్టి వింటున్నాడు. ఆయనకు వాళ్ళ కుటుంబం సంగతి బాగా తెలుసు

నేను, "అరుంధతి పెండ్లి గురించి, డబ్బు ఖర్చుకాకుండా ఎవరైనా చూడకూడదా?" అని అందామని నోరెత్తేసరికి, మోహనరావు—

"ముందు విను! ఆ సంగతులు." అన్నాడు నాకు పాపం పెండ్లికాని, ఇటువంటి అనాథపిల్లను చూస్తే, హృదయం ద్రవించిపోతుందనుకొంది. "సరే" అని వినటం మొదలుపెట్టా

"నా పెండ్లికంత తొందరెందుకమ్మా, ఆ య్యను ఎందుకు బాధపెడతావ్? వాడేమన్నా తెస్తున్న జీతాన్ని తినేస్తున్నాడా?" అంది— అరుంధతి గొంతుక.

అరుంధతికి వాళ్ళాయనంటే ఎంత ప్రేమనుకున్నారూ? ప్రేమంటే అలావుండాలనుకొంటి

మళ్ళీ అరుంధతి గొంతుక వినబడుతోంది.

"ఆయనొచ్చి ఎంతసేపయింది. భోజనం పెట్టే అమ్మా! నేవెళ్ళి నీళ్ళిస్తా" అని అరుంధతి చెంబుతో నీళ్ళుతెచ్చి సిగ్గుపడుతూ, పైట సర్దుకొని. మోహన్‌కు నీళ్ళిచ్చింది.

ఆ నీళ్ళు ఇవ్వడానికి, నాకు పెండ్లప్పుడే అక్కర్లేదనడానికి. ఏమైనా సంబంధం వుండేమోనని వూహించా కాని నా వూహకందలేదు.

"సరే! భోజనమయ్యాక మాట్లాడుదాం" అని మోహన్ భోజనానికి వెళ్ళాడు.

అరుంధతి వడ్డిస్తూ తానే ముందుగా —

"మా కూరలేం బాగుంటాయిలెండి," అని ఏదో బాధ్యంగా అంది — సమాధానంకోసం ఎదురుచూస్తూ.

నా ఇంతకుముందు వూహకు యీ మాటలు ఉపకరిస్తాయేమోనని చాలా జాగ్రత్తగా వింటున్నా.

"నూనెలో ఎంతబాగా వేగింది — ఎండుచేప," అన్నాడు మోహన్

వాళ్ళమ్మ ఒకప్పుడు. దొరలవద్ద పనిచేసిందిలెండి ఇలా ఎండు చేప — నూనెలో, వుల్లిపాయలతో బాగావేపి పెడితే. దొరలు వొదిలిపెట్ట రనుకోండి అందులోనూ. వాళ్ళమ్మ ఇటువంటి వంటల్లో అందెవేసిన చేయి.

"మరి వాసన చూస్తారెందుకు?" అని అరుంధతి "చక్'మని జంక కుండా అంది. నిజంగా ఆ మాటన్నప్పుడు ఆవిడ చూపులు చూడాల్సిందే. చురచురలాడుతూ వెలువడ్డాయనుకోండి.

మోహన్ దెబ్బకు చిత్తయిపోయాడు. అతనికి సమాధానం ఏం ఇవ్వాలో దొరకక. వొంచిన శిరస్సు ఎత్తి అలా ఆశ్చర్యంతో అరుంధతి వైపు చూస్తూ ఉండిపోయాడు.

అరుంధతి ముందుకు వ్రేలాడుతున్న జడను వెనక్కి విసిరి, చెదిరిన ముంగురులు చేతితో సవరించుకుంటూ, తాను విసిరిన మాటను సర్దటానికి అన్నట్టు —

'అబ్బే! ఇటువంటివి మీకు వచ్చుపుగదా అని వాసన చూస్తున్నారను కొన్నా! సరేలెండి భోజనంచేయండి." అని వెంటనే గదిలోకి వెళ్ళి పోయింది.

అలా అంటున్నప్పుడున్న అరుంధతి ముఖానికీ ప్రక్కకు త్రిప్పి గదిలోకి వెడుతున్నట్టి ముఖానికి — అబ్బ! ఎంత తేడా వుందనుకున్నారు. కండ్లు కన్నీటితో నిండాయి. కంఠంఅశ్రుకుద్ధమైంది వెడుతున్నప్పుడు ఆ ముఖాన్ని చూస్తే నాకు అరుంధతిపై జాలి. మోహనరావుగారిపై కోపం అంచులుదికి వచ్చింది. పోనీ మోహన్ ఏమైనా సమాధానం ఇస్తాడా అని చూచా. ఆ సమాధానాన్ని చూచైనా నాకు శాంతి చేకూరేది. అబ్బే! అదైనా ఇవ్వలేదు సరే ఏంచేస్తాము. నాకు ఒకవైపు పీపూ. మరొకవైపు కడుపులా గొచ్చింది. మనసారా ప్రేమిస్తున్న అరుంధతిని వొదిలిపెట్టి పుల్లవ్రాషకు

అ(గులు చాచినట్టు ఆ పుమను వెంబడిస్తుంటాడెందుకు? అనిపించింది. నాకు మాత్రం కష్టం కలిగించింది. సుమండీ! ఏదో పరోక్షంగానయినా ఓ మాట విసురువామనుకున్నా. ఎక్కడ బాదపడుతాడోనని మాటాడలేదు

సరే భోజనం అయింది ఆయన పరధ్యానంలో నాతో మాటాడటం ప్రారంభించారు.

"నారాయణా, మంచి విజయాన్ని సాధించాం. ఇక సభ్యత్వం చేర్పించడం గురించి వెంటనే ప్రచారం చేయాలి. యీ సీజను రెండు నెలలలో నే పూర్తి అవ్వాలి సుమా! ఆ సభ్యత్వానికి చేసే ప్రచారంలోనే మేస్త్రీలనుకూడా బట్టబయలు చేయాలి. .. అయితే మేస్త్రీలపై అంతదూకుడుగా పోవద్దుసుమా.' అని 'సరే వెళ్లు తరువాత మాటలాడదాం" అన్నాడు.

ఆయన మనస్సు బాగాలేదని గ్రహించి. నేనూ మా పల్లయ్య వెళ్ళిపోయాం

# 25

నాకు మంగివి పెండ్లిచేసుకునేవరకూ నిద్రపట్టడంలేదు. అందులోనూ మార్పులేని బ్రతుకు ఏ మానవుడంగీకరించగలడు? నన్నడిగితే అలా బ్రతికే బదులు చస్తే మేలంటాను. కూపస్థమండూకంలా ఎందుకు చెప్పండా బ్రతుకు? అంతేగాదు, మానవుడనేవాడు తన జీవితంలో ఎవరినో ఒకరిని ప్రేమించకుండా ఉండలేడు. అది ఏ ప్రేమైనా కానీయండి, వాడి కష్టాలను పంచుకునేది కావివ్వండి. లేకపోతే వాడి కన్నీటిని తుడిచే

దయినా కావివ్వండి. మొత్తంమీద మానవుడనేవాడు ఎవరినో ఒకరిని ప్రేమించవలసిందేకదా? మంగి విషయంలో నేనూ అంతే. మంగికోసం ఏంచేయడానికైనా నేను సిద్ధమే. అటువంటప్పుడు మంగిని నేను పెండ్లిచేసు కోకుండా ఒక నిముషమైనా నడపగలననంటారా? అది కలలోకూడా అసంభవం.

నేను పనిలోనుండిరాగానే మా బాబుకు చెప్పేను. మా బాబు చుట్టూ తిరిగి మారాంచేశాను. రాత్రి అయ్యాక పడుకోబోయేటప్పుడు కూడా మా బాబుతో చెప్పాను. "చిటెకలో కుదుర్చుకొస్తా పడుకోరా' అన్నాడు. అలా ఆలోచించుకుంటూనే పడుకున్నా. నాకు నిద్రపట్టలేదు తెల్లవారి పోయింది. మాది తాటాకుల యిల్లేమో — ఎంత నేసినా కన్నాలే కన బడుతుంటాయి. సూర్యుడుదయించాడు. ఆ పసిడికిరణాలు ఆ చిన్నకన్నా ల్లోంచి నా ప్రక్కపై బడి నిద్రలేపాయి. ఆ వేళ మాకు మోతలేకులెండి. పదిగంటలకు ఆడితికి వెళ్ళినా పరవాలేదు. నేను మంచం దిగగానే మా బాబు అప్పుడే ఆడితికి వెళ్ళి చద్ది అన్నానికి వచ్చాడు. మేస్త్రీకదండీ? చచ్చినట్లు పనివున్నా లేకపోయినా ఆడితికి వెళ్ళవలసిందే. నేను ముఖం కడుక్కోడానికి అరుగుమీదకు పందుంపుల్ల చేత పట్టుకువచ్చి ఇంకా కూర్చోన్నానోలేదో మా బాబు........

"కార్తీకమాసంలో పెండ్లిరా....' అన్నాడు.

ఇక నన్ను పట్టుకోడానికి బ్రహ్మతరమండీ? అరుగుదూకి మా బాబును అమాంతంగా కౌగలించుకున్నానంటే నమ్మండి యీ వార్త మంగికి తెలుసో తెలియదో, అని ఆతృతతో ఏదో ముఖం అటూ ఇటూ కడిగేసుకొని చద్ది అన్నమైనా తినకుండా ఆడితి ఒక్క పరుగులో చేరా.

మంగి ఇంకా రాలేదు. దౌర్భాగ్యురాలు యీ వార్త వినడానికి నోచుకోలేదనుకున్నా. హోటలుకు వెళ్ళేను. హోటలులో నాకు ఖాతా వుండేది. కాని, ఈ పనిలోకి చేరాక మోహన్ సలహాననుసరించి ఆ బాకీ అంతా తీర్చేశాను. "పుచ్చుకోవయ్యా! నారాయణా! కడుపునిండా పుచ్చుకో" అని రోజూ అనేలాగునే అన్నాడు. నా దృష్టి అంతా మంగి మీదే వుండడంగాని ఆ టిఫిన్ మీద లేదని అతనికేం తెలుసు. ఏముందండీ? అదృష్టం బాగుంటే పట్టిందల్లా బంగారమౌతుందిగా! కాకపోతే అంతకు ముందు రూపాయికి మించి బాకీ పెరిగినప్పుడల్లా గొడవచేసే పెద్ద మనిషి, ఇష్టం వచ్చినంత పుచ్చుకోమని ఎందుకంటాడూ. బాకీవుంటే జుట్టు, లేకపోతే కాళ్ళు పట్టుకునే సాహుకారు తంతంటారా, ఏదైనా అనుకోండి! మీ ఇష్టం.

నాకీ గౌరవం ఎందుకొచ్చిందా! అని రోజూ నేను ఆలోచిస్తూనే వున్నా. ఇదివరకు నన్ను తిట్టేవాళ్ళు నేడు దణ్ణం పెట్టకపోయినా గౌరవంగానే చూస్తున్నారు. "ఒరే నారిగా! దొంగలంజాకొడకా" అని పిలిచే ప్రతివాడూ, నారాయణా, ఏమిటి విశేషాలు!' అంటున్నాడు.

గౌరవం అధికమౌతున్నకొద్దీ పనప్రతి కూడా ఎక్కువ కావాలన్నారుగా పెద్దలు. అదీకూడా గౌరవాన్ని పెంపొందించడానికే పనిచేస్తుంది. మరి యీ హోటలాయనున్నాడే. యిదివరకు నన్ను "ఒరే" అన్నప్పుడు నేనూ బండగా "ఏమోయ్" అనేవాడిని ఇప్పుడు "ఏమండీ" అంటున్నాడు. మరి యీ హోటలాయన, నేనూ గౌరవం ఇస్తున్నందున

ప్రతి గౌరవం ఇస్తున్నాడేమో నాకు తెలియదు. ఇంతకీ నాకీ గౌరవం ఎందుకొచ్చిందో నేనూ ఒక నిర్ణయానికి రాలేకపోతున్నాననుకోండి.

సూర్యకిరణాలు వేడెక్కిపోయాయి. అరకూలీలు మకాంకు గబ గబా పరుగెత్తాను. మంగి అప్పుడే వచ్చి కవ్వాడిగిస్తోంది. సైగచేయగానే దిగిస్తున్న కవ్వా వదిలేసి వచ్చేసింది. చెయ్యి అడ్డుగాపెట్టి మంగి చెవిలో అన్నా.

"తెలిసిందా మన పెళ్ళి?"
ఏనాడూ లేని సిగ్గుతో నా బుగ్గపై కొరుకుతూ —
"తెలిసింది' అని పరుగెత్తుకుపోయింది.
"అమ్మ! దొంగా" అంటూ నేనలాగే నిలబడిపోయాను.

* * * * *

కార్తీకమాసం గిర్రున అంగలేసుకు రావడం. మా పెండ్లి వైభవంగా కాదుగాని ఉత్సాహంగా జరిగిపోవడం అయిపోయింది. మోహన్ చెప్పిన పని యీ పెండ్లి హడావిడిలో మరచిపోయినా యిప్పుడు జ్ఞప్తికి వచ్చింది. వదిహేను రోజుల క్రిందటే చెప్పాడు. వీరందరికు సభ్యత్వం చేర్పించడం పూర్తిచేసి వెంటనే బొంబాయి ఆఫీసుకు కట్టేయాలన్నాడు. సభ్యత్వం చేర్పించడం అంటే ఒక కొంప కట్టడంవంటిది సుమా! అని మరీ మరీ హెచ్చరించాడు. అదే మన బలానికి ప్రతిబింబమని కూడా అన్నాడు. ఈ మాటలు నన్ను ఇప్పుడు తొందరపెట్టడం మొదలెట్టాయి. పీజులు కూడా అయిపోవచ్చింది. ఈ నెల దాటితే ఎవరి చేతుల్లోనూ డబ్బు

అడదు. ఇది నాకు మరీ తొందరగా వుంది. నేను బద్దకించినా మోహన రావుగారే అతిథి సంఘం పేరుతో సభ్యత్వ రశీదులు కొట్టించి పంపించారు కూడాను.

ఈ విషయాన్ని మంగికికూడా ఎంతో చక్కగా చెప్పేను. ఏదో కొంత మందినైనా ఆడవాళ్ళను చేర్పించవలసివస్తుందేమోనని. నేనూ, మా తమ్ముడు కొన్ని పుస్తకాలను పట్టుకొని బయలుదేరేం. మేం అది తిలోకొచ్చి చేర్పించడం మొదలుపెట్టామో లేదో సూరన్న వచ్చి అంటాడు గదా।—

"ఇదిగో కమ్యూనిస్టులో మిమ్మల్నందర్నీ చేర్పించేస్తున్నారు. ఇంకేముంది? పోలీసులు మనలను చర్మాలు ఒలుస్తారు." అని మొదలెట్టాడు.

"కమ్యూనిస్టు అంటే ఏమిటో నీకు తెలీదుకదా? అందులో కూ మన సంఘానికి సంబంధ మేమిటి? మనం కార్మికులం. మన కార్మికులలో ఎవరైనా చేరవచ్చు. మన కార్మికులమంతా ఐక్యమత్యంగా వుండడమే మనకు విజయం." అన్నా.

'కమ్యూనిస్టుల్లో చేర్చుకోకపోవడం కాకపోతే ఈ ఎర్ర జండా ఏమిటి అన్నారు మళ్ళీ.

"అవును. ఎర్రి జండాలో తప్పేముంది. సుత్తి కార్మిక చిహ్నం' కొడవలి రైతు చిహ్నం? ఇది కార్మికుల జండా' అని నేనన్నా. ఆ సూరన్నగాడున్నాడే సామాన్యంగా వొదిలిపెట్టడుగా? — కలికేస్తే వెదకు

కాస్తే వెయ్యమంది వచ్చాక మా ఆడ్డి కార్మికులు పదిహేను వందలకు మించి వుంటారులెండి.

మోహన్ లేచి మాట్లాడటం మొదలుపెట్టారు.

“మనకు అనేక యిబ్బందులున్నాయి. ఏదో పావలాకూలి ఎక్కువ చేసారంటే మన బలంవలనే. పత్రికలనుండి ఇంకా మనం అనేకం సాధించాలి. ఓగుమోత లేకుండానే రేవునుండే కలప బేరం యిచ్చి, మనకు కూలీ రాకుండా చేస్తున్నారు. కూలిరేట్లు యిప్పుడెంతో తక్కువగా వున్నాయి. అంతేగాదు, ప్రభుత్వమే ఆదివారం సెలవు కూలి యివ్వాలని చట్టం చేస్తే వీళ్ళు యివ్వ నిరాకరిస్తున్నారు. ఇక మనకు ఈ నెల దాటితే పస్తులేకదా. మనకు వడ్డీ లేకుండా అప్పులూ, కంట్రోలు ధరలకు ఆహారం లభించేలా పోట్లాడితేనేగాని, మన కుటుంబాలు గట్టెక్కవు. ఇదంతా మన ఐకశక్తిపై ఆధారపడివుంది. సంఘం బలంగా వుంటేనే ఇవన్నీ సాధించగలం. అందుచేత ప్రతి ఒక్కరూ సంఘంలో చేరాలి. మీరు ఎంత త్వరగా చేరితే అంతలాభం. సంఘమే మన కల్పవృక్షం' అని కూర్చున్నాడు. చప్పట్లు కరతాళధ్వనులు చేశారు. అంటే అంగీకరించారన్నమాటే గదండీ.

నాకు ఆశ్చర్యం కలిగింది. ఆదీకాకపోయినా, మోహన్ అంటే కూలీలకు గౌరవం. అందులోనూ ఆయన మాటలకు కూలీలు బహుసులువుగా ఆకర్షించారు. చక్కగా చెబుతాడు — అందరికీ అర్థమయ్యేటట్లు

నేనుకూడా మీటింగులో మాటలాడాను. నేను మాట్లాడడం అదే ప్రథమం అనుకోండి. నేను చెప్పిందల్లా రెండుముక్కలే.

"ఇదిగో, బొంబాయి ఆఫీసునుండి పత్రం వచ్చింది. వెంటనే చేర్పించి పంపకపోతే అనుబంధం రద్దుచేస్తాం అని. పదిమంది కార్మికుల ముందు మనకెంత అగౌరవం. ఇది మన బలహీనతకు చిహ్నం. అంచేత త్వరగా చేరిపోవాలి.' అన్నా.

అంతే.

ఒక మేస్త్రీ లేచి —

"ఈ విషయాలన్నీ చెబితే ఎవడెదురు చెబుతాడు? పుస్తకాలు రేపు తీసుకురా, మేం దగ్గిరవుండి చేర్పిస్తాం" అన్నాడు. మెహర్బానీగా.

అదీ మంచిదే అనుకున్నా. వీళ్ళు మొగమాటానికి ఇక్కడ ఇలాగే అంటారు. తీరా పని వచ్చేటప్పటికి పత్తై పోతారు.

మీటింగు అయిపోయింది. సూరన్న మాత్రం కొందరు మేస్త్రీలతో కలిపి వెళ్ళిపోతూ —

"మనలను కమ్యూనిస్టుల్లో చేర్పించేస్తున్నారు. ఇదేదో వినాశనానికే వచ్చింది లెండి" అని, ప్రక్కవారితో తన రోకటి పాట ప్రారంభించాడు.

నేనూ, మోహన్, మా తమ్ముడు, కొంతమంది యువకులం కలిసి ఆఖరున బయలుదేరేం. మోహన్ అంటాడు గదా.

"చూచావా! ఏదైనా చెప్పడంలో వుంది' అన్నాడు. అవునని నేము తలూపాము.

మరునాడు నుండి మోహన్ కూడా దగ్గిరుండడం వలన సభ్యత్వం చేర్పించడం చురుకుగా సాగిపోయింది. వారంరోజులలో పదిహేడు వందలమందీ చేరారనుకోండి.

# 27

ఇదే మా నూతన గృహం. దీన్ని కంబాల పేటంటారు. ఎందుకో కంబాలచెరువుకి బహుదగ్గరిలో వుంటుండేది పట్టణంలో అన్ని పేటలకంటే ఎక్కువ దరిద్రం వుండేది ఆ పేటలోనే పట్టణంలో ఏ పేటా దొరకనట్టు ఆ శనేశ్వరుడు యీ కంబాల పేటలోనే మకాం పెట్టినాడు. ఎన్నాళ్ళిలా కాపురము ఉంటామో తెలియదు పెద్దలన్నారుగా "శనికి మూరేళ్ళ'ని పోనిలెండి యీ శనేశ్వరుడు మూరేండ్లకయినా ఒదిలిపోతే మంచిదే.

మా పేటకు కంబాలచెరువు ఎంతో దూరంలేదు. అందులోనూ చెరువుగట్లకూ మా ఇంటి మధ్య నాలుగు బారల రోడ్డే అడ్డు. నేను పాత ఇంటినుండి సామానంతా తెచ్చుకుని సర్దుకునేటప్పటికి వెన్నెల వచ్చేసింది. నేను అరుగుమీద నిలబడి, ఎదురుగావున్న ఆ చెరువునూ, చెట్లనూ, చూస్తూ అలాగే అరఘంట వుండిపోయాను. అదంతా చూస్తుంటే ఎంత ఆహ్లాదంగా వుందనుకున్నారు. నేను కష్టపడివచ్చి యీ అరుగుమీద ఐదు నిమిషాలు అలా కూర్చుంటేచాలు. హృదయాయాసం తీరిపోతుంది.

చెరువుగట్టున వున్న వటవృక్ష పిలిసీడలు, ఆ చల్లని వెన్నెలలో మా ఇంటిపైబడి ఎంతో హాయి గొల్పుతున్నాయి చెరువు ప్రశాంతంగా వుంది.

తమ శత్రువైన సూర్యుడు వుండగా, ముడుచుకొని తలలు వ్రేలేసిన, చెంగల్వలు, తమ చెలికాడు చంద్రుడు వుదయిస్తుంటే, సగర్వంగా

తలలుఎత్తి ఆనందంతో వికసిస్తున్నాయి. "అరెరె! సూర్యతాపానికి నా ప్రియ చెంగలువల తలలు వ్రేలేసేయే!" అని జాలినొంది కాబోలు చంద్రుడావేళ అతిత్వరగా తన చల్లని కిరణాలను ప్రసరింపచేస్తూ అంబరవీధిలో ప్రత్యక్షమయ్యాడు.

అలా ఆనందంలో వికసిస్తున్న చెంగలువల నాస్వాదిస్తూ తుమ్మెదలు తమ స్వాదాలతో నాట్యం చేస్తున్నాయి అబ్బా! ఆ తుమ్మెదల్ని ఆ చెంగలువల్ని చూస్తున్నకొలందీ మైమరపుగల్గుతోంది

ఆవేళ తమ యజమానులు తిండి పెట్టలేమోనన్న భయంకూడా లేకుండా చెంగల్వల చుట్టూ ప్రశాంత తటాకంలో బాతులజంటలు విహరిస్తున్నాయి. అవును మరి! యజమానులకు భయపడి స్వేచ్ఛను ఎవరు చంపుకోగలరు చెప్పండి? కొన్నిజంటలు, యజమానులు తిండిపెట్టరేమోనన్న భయముతో గబగబా ఒడ్డుకువచ్చి, రెక్కలు టపటప విదిలించుకుంటూ పరుగెడుతున్నాయి.

మా ఇల్లా చిన్నపూరిగుడిసె ఎంత చిన్నదయితేమాత్రం నష్టమేముటుంది! నేనూ మా మంగీను ఇద్దరమూ, తప్పితే ముగ్గురమనుకోండి! ముగ్గురమని ఎందుకనుకోమన్నానంటే నా మంగి తల్లికాబోతుంది. మరి నేను తండ్రినౌతా నన్నమాటేగా.

అయితే ఏం? పెండ్లయింది మొదలు అన్నీ గొడవలే. ఏదో మా మంగి ఇంట్లో మంచితనంగా వుండటం, నా మనస్సు కష్టపెట్టి మాటాడడం ఇదంతా ఎందుకు? ఇద్దరి హృదయాలూ కలిసాయి కాబట్టి సరిపోయింది.

లేకపోతే ఏనాడో ఈ నూతన గృహానికి చేరుకునేవాళ్ళం. రెండు హృదయాలూ కలవకపోతే ఏముంది చెప్పండి? అయిదు నిముషాల్లో సంసారం ముక్కలయిపోదూ? అలాకాకుండా వుండడానికి, మా యిద్దరి అమితమైన ప్రేమ కారణం.

అబ్బా! వెధవగొడవలు వింటుంటే మతిపోయింది. ఒక మతి పోగొట్టుకోవడం ఎందుకని వేరే కాపురం పెట్టవలసివచ్చింది. మరి కి పెళ్లయి పట్టుమని పదిమాసాలైనా కాలేదుకదా. అందె కండ్ల కాటుక అయినా కరగలేదు. పాదాల పారాణి అయినా చెరగలేదుకదా? అప్పుడె వేరే కాపురం ఏమిటా? అని మీరడగవచ్చు ఈ పదిమాసాలలోనూ. ఆవిడ పడ్డ బాధలకు కండ్లకాటుకా కరిగిపోయింది, పాదాల పారాణీ మాసిపోయింది. అసలు వేరే కాపురం పెట్టడానికి — అన్నట్టు నేను పెట్టడమేమిటి? మా బావే పెట్టించాడు. కారణమేమిటో చెబుతా వినండి.

పెళ్ళాం వున్నప్పుడు ఏదో తెచ్చుకొని ఆనంద పెట్టకుండా ఎవరుంటాడు చెప్పండి? పెండ్లికాక ముందు మంగి ఎప్పుడూ చీరకట్టి ఎరుగదు. డబ్బులేక నేను ఒకసారి చీర తెచ్చి ఇచ్చేటప్పటికి మా బాబు డబ్బంతా దానికి తగలేస్తున్నానని రంకెలేసాడు. మా అమ్మ నాకు మంగి ఏదో మందు పామేసిందని లోపల మురమురలాడింది. మా మంగి ఐతే పని చేసిందిలెండి. మా అమ్మకు ఆ చీర కట్టుకోమని ఇచ్చేసిందిలెండి. మా అమ్మ ఎత్తిపొడుస్తూ "నీ మొగుడు తెస్తే, నేను కట్టుకోవడమెందుకు? మీరే సుఖంగా వుండండి. పెంచి పోషించిన తల్లిదండ్రులం నట్టేట్లో దిగుతాం" అంది.

ఈ విషయం గొడవలొస్తాయని మంగి నా వద్ద దాచింది. చెప్పనే లేదు. కాని. ఇప్పుడు జరిగిన సంఘటనవల్ల నాకు వెనుకటి విషయాలన్నీ తెలిసిపోవడం మంగిపై నాకు ప్రేమ మరీ ఎక్కువవడం జరిగింది.

మంగికి మంగళసూత్రం ముక్కయినా లేదు. ఆడదానికి అదే కదండీ పసుపు - కుంకుమ. పసుపుకొమ్ము సూత్రం మెడలో కట్టుకునేది అంతే మొగుడున్న ఆడదానికి మంగళసూత్రం వుండాలిగా మరి. అందుకు ఐదు చిన్నాలెత్తు బంగారం కొని చేయించాను మరొకసారి మా మంగి పెరుగుకు వెళ్ళి ఆలస్యంగా వచ్చిందని, "పెరుగు మొగుడిని మరిగేవు' అని మా అమ్మ తిట్టిందట. మానమున్న ఆడది ఇటువంటి మాటలు సహించగలదంటారా? నిజంగా నేను అదృష్టవంతుణ్ని. లేకపోతే మంగి ఇటువంటి బాధలు భరించలేక ఎందులోనయినా దిగితే?

ఇంతకీ మేము వేరే కాపురం పెట్టడానికి పునాది యీ మంగళసూత్రం ముక్క గొడవే. మా అమ్మ, బాబూ ఏకమై నామీద ఎదురు తిరిగారు. మా బాబు —

"పోరా? లంజాకొడకా! నీవు చేస్తున్న పనులు చూస్తోంటే, కడుపుడికిపోతోంది, ఇక సహించను! పో. వేరే కాపురం పెట్టుకో!!."

అని కేకలేసాడు. మా అమ్మ ఏదో చెప్పి నట్టిగా కోరుకుంటుందనుకొన్నా. అందులోనూ ముసలాడికి ముక్కోపం అంచేత నేను కాసేపు కనుమరుగై పోవాలనుకొని మాట్లాడకుండా రోడ్డుమీదికి వెళ్ళిపోయాను.

కాని ఆ మల్లాట ఉన్న అగ్నికణాలు మాత్రం నా హృదయాన్ని

దహించివేస్తున్నాయి. నేను వెనుదిరిగి వెళ్ళిపోయేవరకూ నా మంగి — నిండుచూలాలు. ఆమె దీనంగా నా వైపు అలాగే చూచింది నా హృదయం దహించి పోతున్నా నేను ఒకటి మాత్రం జాగ్రత్తగా ఆలోచించాను. వేరే కాపురం పెడితే పదిమందీ నా కళ్ళు నెత్తిమీదికొచ్చాయంటారనీ, పెద్దలను ధిక్కరించాడంటారని నా భయం, ఎవరయినా లోకానికి భయ పడవలసిందేకదండీ. అయినా యీ బాధలు వింటే లోకులు పలుకాకులైనా నా పలుకులోని సత్యాన్ని గుర్తిస్తారనుకొన్నా.

నేను రోడ్డుమీద హోటలకు వెళ్ళానో లేదో, హోటలులో పేపరు చదువుతూ. మోహన్ నన్ను పలకరించాడు. నేను జరిగిన కథంతా చెప్పేను. మోహనరావుగారు ఉద్వేగంతో మాట్లాడాడు.

"నారాయణా! చేతులారా మంగి ప్రాణాలు తీస్తావు. ఈ బాధ భరించలేక ఆవిడ ఏ నూతిలోనో పడి చస్తుంది ఈ జాయింటుకుటుంబాలు స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు సంకెళ్ళు. వేరేకాపురం పెట్టు" అన్నాడు.

నేను అంగీకరించలేకపోయాను. విచారంతోనే ఇంటికి వెళ్ళేను. మా బాబు వీధిలో నిలబడి భయంకరంగా గర్జించాడు. "గుమ్మం ఎక్కితే జాగ్రత్త శో." అని.

ఇక నన్నేంచేయమన్నారు చెప్పండి. వేరే కాపురం పెట్టక తప్పింది కాదు. ఆ నూతన గృహమే ఇది.

# 28

పండుగ లగాయితు మా పనంతా బందైపోతుంది. అక్కడనుండి నోటికో వేళ్లుపెట్టుకొని కూర్చోవలసిందే. సాధారణంగా అంతా ఆ పనులు లేని రోజుల్లో అప్పులుచేసి బ్రతకవలసిందే. నాలాంటివాడికి అప్పు ఎవడిస్తాడు? ఏదో ఆ వున్న చిన్న పనులూ చేసుకొని కాలక్షేపం చేయటం. లేని రోజుల్లో పొయ్యిలో పిల్లి పడుకోవలసిందే.

ఎండాకాలం వచ్చింది. కాలువలు ఎండేశాయి అసలు చిల్లరపను లన్నీకూడా బందైపోయాయి సంఘం గురించి అందరికీ చెప్పడం, పేపరు చదివి వినిపించడం ఇదేపని.

రేపు మేడినోత్సవం అనగా ఆ రోజంతా సంఘం ఆఫీసు ముస్తాబు చేయడానికే సరిపోయింది. మేమంతా తలాకపని చేస్తుంటే చాలా సందడిగా వుందనుకోండి.

మోహనరావుగారు రేపటి రోజున బ్రహ్మాండమైన ఊరేగింపు వుంటుందని మీటింగుకూడా వుంటుందని అన్నారు. తెల్లవారేటప్పటికి అంతా కార్మికులందరినీ, ట్రేడ్ యూనియన్ ఆఫీసుకు తీసుకొచ్చే బాధ్యతకూడా నామీదుంచారు. నాకు చాలా వుషారుగా వుందిలెండి. లేకపోతే అంత చురుకుగా నేనెప్పుడూ పనిచేయలేదు. రాత్రింబగలూ పేటలన్నీ తిరిగి ఒక్కొక్క కార్మికునికి ముమ్మాటు అయినా చెప్పకుండా వొదిలిపెట్టడంలేదు అందులోనూ పనులున్న రోజుల్లోనే ఎంతో కృషి చేస్తేనే గాని కార్మికులు రారు. పనుల్లేని రోజుల్లో వస్తారా? అయితే

ఇంత హుషారుగా ఎందుకు పని చేస్తున్నానంటారా? మోహనరావుగారు మేడినోత్సవం యొక్క ప్రాముఖ్యత గురించి చెప్పినప్పటినుండీ నా రోమాలు నిక్కబొడిచాయంటే నమ్మండి. సమసని కార్యదీక్ష అంకురించిందంటే అంత అతిశయోక్తి కామకూడాదు. ఆయన చెప్పేరు కదా!

"మేడే అంటే ప్రపంచ కార్మికుల పర్వదినం. ఆనాడు దేశ దేశాలతో మారు మూలల ప్రాంతాలలోని ప్రపంచ కార్మికులంతా తమ హక్కుల కోసం ఎడతెగని పోరాటం జరుపుతామని శపథం చేస్తారు. యీ శపథం 19వ శతాబ్దంలో అమెరికాదేశపు చికాగో పట్టణములో తుపాకి కాల్పులను సహితం ఎదుర్కొని, వందలాది నేలకొరిగినా అధైర్యం చేయకుండా పోరాడిన కార్మికుల పేరుమీదుగా తీసుకుంటారు. వాళ్ళు తమ రక్తపు మడుగుల్లో తడిసి పైకెత్తిన ఆ అరుణపతాకాన్ని మరొక్కసారి పైకెగురవేస్తూ శపథం తీసుకుంటుంది ప్రపంచకార్మిక వర్గం. అంతేత మేడే కార్మికవర్గ పవిత్ర పండుగ తెలిపిందా?" అని. అంతే నా శరీరం గగుర్పొడిచింది.

వారంరోజుల ముందునుండే మేము ప్రచారం చేసాం. మళ్ళీ ఇంకోసారి ఆ రాత్రి మా కూలీలున్న పేటలన్నింటిలోనూ తీవ్రమైన ప్రచారం చేసాం. ఆవేళ నేను ఆఫీసులోనే పడుకొని — ఆ పడుకోవడమైనా ఒక గంట అలా కండ్లు మూసేనంతే — తెల్లవారిపోతుందనగా, ఎంతో ఆత్రుతతో బట్టలు మార్చుకోడానికి ఇంటికి వెళ్ళేను. మా మంగి ఇల్లంతా బహుసుందరంగా ముస్తాబు చేసింది. వాకిలి అంతా శుభ్రంగా చక్కని

కల్లాపుజల్లి, ముగ్గుతో "సుత్తి కొడవలు" పెట్టింది గుమ్మంలో వున్న చిన్న గానుగ చెట్టుకు ఒక ఎర్రజెండా కట్టింది నేను ఇంటిలోకి వెళ్ళేటప్పటికి అప్పుడే పిల్లవాడికి నీళ్ళు పోస్తోంది.

నన్ను చూచి అందికదా!

"ఏమే బావ ఇంత ఆలస్యంగా ఎందుకొచ్చావు?"

నాకంటే శ్రద్ధ ఎక్కువగా వున్నట్టు మాటలాడింది. నిజానికి శ్రద్ధ ఎక్కువేనండి. నేను కాస్త తగ్గవలసి వచ్చింది.

"అబ్బే! రాత్రంతా పనిచేయడంవలన నిద్రపట్టింది. ఒక కునుకు వేసి వచ్చేను" అన్నా.

"వస్తుంది. కునుకు - రామా! తెల్లవారుఝామునే లేవాలని జ్ఞాపకంలేదా?" అని కుండలోనుండి దోసెడు వేడినీళ్ళుతీసి ముఖం చిట్లిస్తూ అద్దాలలోనున్న కుర్రకుపై పోసింది అది సహజం చూడండీ, మగవాడు బైట విసుగుచెందుతే తన ప్రభావం ఆడదానిమీద చూపుతాడు. ఆడది భర్తమీద విసుగుచెందుతే పిల్లలమీద చూపెడుతుంది. పిల్లలు లేనావిడయితే పొయ్యిమీద చూపెడుతుంది. అంతగా జరుగుబాటుంటే. మంచంమీదో, సేవకురాలిమీదో చూపెడుతుంది అంతేగదండీ తేడా. నేను కాస్త కోపంగా ముఖం పెట్టి —

"జాగ్రత్త. కోపం పిల్లవాడిమీద చూపుతున్నావ్" అన్నా.

మా మంగి ఏమనుకుందో మళ్ళీ మాటలాడలేదు. ఎలాగయినా మా మంగికి ఓర్పు. దూరాలోచన ఎక్కువ చూశారా? నేను కోపంగా అన్నా నది మాటలాడలేదు. దేనికైనా మౌనం మంచిదనుకోండి.

నేను వెంటనే పరుగున వచ్చేశాను. నాకు మా మంగిమీద జాలి వేసింది. దాని పిసుగంతా, తను మేడెక్కి రావటానికి అవకాశం లేదు? అని మాత్రం నేను గ్రహించాను. నేను రమ్మందామనుకున్నా. చంటి బిడ్డతో ఎలా చెప్పండి! ఈ పిల్లలతో వుంటే గొడవ ఇదే! లేకపోతే టి గురంగా అని బయలుదేరే వాళ్ళమే కదా

నేను బట్టలు వేసుకొని, ఆఫీసుకు వెళ్ళేసరికి నినాదాలు మారు మ్రోగుతున్నాయి. మా తమ్ముడు ముందుండి ఏదో నినాదాలిస్తున్నాడు. నేను వెళ్ళగానే, ఊరేగింపు ట్రేడ్ యూనియన్ ఆఫీసుకు సాగిపోయింది. మేము వెళుతున్నప్పుడు, ఏ కూలిపేటలో అడుగుపెట్టినా, సుద్ద కొడవలి ముగ్గులూ. ఇండ్లకు ఎర్రజెండాలే. మా నినాదాలు దిక్కులు పిక్కటిల్లి చేస్తున్నాయి. మేము సాగిపోతుంటే, అనేకమంది అనేక విధాల అనుకున్నారు. మాకు అనుకూలంగానే వున్నాయనుకొందామాటలు. అయినా సరిగ్గా వినబడలేదు. నా ప్రక్కనుండే పోతున్న జట్కావాడు జట్కా ఆపి, ఊరేగింపు చూచి, "పెహష్, మా కూలిజాతి తలుచుకుంటే, కొండమీద కోతి దిగిరాదూ!' అనుకొని జట్కా పోనిచ్చాడు. మా ఊరేగింపు పెద్దాఫీసుకు చేరింది. అక్కడ పదివేలయినా వుంటారు. నా ఉత్సాహం మరింత ద్విగుణీకృతమైంది. అక్కడనుండి మీటింగు స్థలానికి జేరాం. ఇసుకవేస్తే రాలని ప్రజలను కండ్లతో చూచా. మా కార్మికులమంతా అందులో కలిసి కూర్చున్నాం. నేను మోకాళ్ళపై నుండి జనాన్ని చూస్తుంటే దృష్టికందడం లేదనుకోండి. నిలబడితే తిట్టరూ ప్రజలు! ఇంకో అయిదు నిమిషాలకు మీటింగు ప్రారంభమైంది. ఒక అయిదేండ్ల కుర్రవాడు మోహనరావుగారి మెడలో ఎర్రనూలుపిడి వేసేడు. వెంటనే కరతాళధ్వనులు మిన్నుముట్టాయి. మెక్ ముందుకువచ్చి మోహన్‌రావుగారు మాట్లాడారు.

అబ్బ, మోహనరావుగారంటే, ఆ ప్రజకోటేపుడే? ఒంటరిగా ఆర్టీకి వస్తుంటె ఏదో తీసిపారేసేవాళ్ళం. ఇప్పుడాయన పట్టుబడిచూచి, నేనెంతో పశ్చాత్తాపబడ్డాను. ఆయనిప్పుడు నాయకుడిలాగానే కాదు—గురువు, దైవం లాకూడా కనబడుతున్నాడు. నేను ఆయన్ను విసుగుకున్న రోజులుకూడా వున్నాయి. ఒక్కసారి రెండుచెంపలూ వాయించుకున్నా. అంతకంటె నన్ను కదిల్చివేసిన విషయం ఏమిటంటె, అబ్బ ఎంతమంది కార్మికులం అంతా ఐక్యమై కూర్చున్నాం? నిజముగా మోహనరావుగారు చెప్పినట్లు ఇది పర్వదినమేకాదు, ప్రపంచ మహోదయానికి శుభదినంకూడాను. నాకు ఆ కార్మిక వర్గాన్ని చూచి, దృఢమైన విశ్వాసం కలిగింది. ఎటువంటి కష్టతరమైన కార్యాన్నయినాసరే ఇట్టే సాధించగలమని. నిజంగా ఆ జట్కావాడు చెప్పినది సత్యం. కార్మిక వర్గానికి ఎదురులేదు. అది కంచు రథం, ఆ రథానికి అడ్డులేదనుకున్నా.

* • • • • • *

మీటింగు పటూ పోలీసులే. ఊరేగింపు బయలుదేరినప్పుడుకూడా పోలీసులు వస్తూనే వున్నారు. వీళ్ళంతా ఎందుకా అనిపించింది నాకు. నన్ను మీటింగులో బాగా కదిల్చివేసినవి, మోహనరావుగారి వుపన్యాసంలోని చివరి భాగం.

ఆయన అన్నాడు కదా,

"ఓ కార్మిక సేవకులారా! ఈ దోపిడీ దారులను, మనం నిలిపి

ఎదిర్చినవాడు. మనలను అడ్డే శక్తి లేదు. పోతే మనకు పోయేది బానిస సంకెళ్ళు వస్తే విశాల శ్రామికరాజ్యం' అన్నాడు.

ఆ మాటలకు హర్షధ్వానాలు అయిదు నిముషాలవరకు ఆగలేదు. ఆ మాటలు చూరకత్తుల్లా పోలీసుల ఎదలోపలను దూసుకుపోతున్నాయా అనిపించింది నాకు.

నేను కూడా మా సంఘం తరపున మాట్లాడేను, మా సంఘం గౌరవ సూచకంగా. ఇతర జట్ల కార్మికులు నా మెడలో దండ వేసారు. నేను మాటలాడుతూ "ఇంతనుంచి మన కార్మికుల ఎదుట కొద్దిమంది ధని కులేం నిలబడతారు. మనం బిగించిన పిడికిళ్ళు సడలించమని కంఠం పూని నిలబడితే చాలు. ధనికులు హడలిపోవలసిందే." అన్నాను.

మీటింగు అయిపోయింది.

మేము వస్తున్నప్పుడు ఒక మేస్త్రీ అన్నాడు.

"నారాయణా! వచ్చేయేడు యీ పండుగ మన ఆఫీసులో జరి పించాలి."

"ఓ. తప్పకుండా జరిపించాల్సిందే" అని చుట్టూ వున్న కుర్ర వాళ్ళమంతా ఒక్కసారిగా ముక్తకంఠంతో అన్నాం.

నేను గబగబా ఇంటికి వచ్చేస్తున్నా. మంగికి యీ విషయాలు ఎంత త్వరగా చెప్పడమా అని యీ సంగతులన్నీ చెప్పితే తను రాలేక పోయినందుకు ఎంతో విచారపడుతుందని నాకు తెలుసు. అయినా సరే చెప్పేదాకా నా మనసు ఆగడంలేదు.

గబగబా ఇంటికి వెళ్ళేను. గుమ్మంలో వుండే.

"మంగీ, హేమంగీ" అని వుబలాటంతో అరిచాను. కాని జవాబు రాలేదు. ముందుకు వెళ్లేను మంగి కనబడలేదు. మా అత్త తటాయిన గుమ్మంలోకి వచ్చి—

"ఏమిటా కేకలూ? చంటిబిడ్డ ఇల్లని తెలుసా? అప్పే తొక్కుకు వచ్చేవు. ఆ చెరువులో కాళ్లు కడుక్కొని రాగూడదూ?' అని గసిరింది.

మా ఇంటికి మా తల్లిదండ్రులు ఎవరూ రావడమే లేదుకదండీ? మా అత్తగారు మాత్రం అప్పుడప్పుడు చూడడానికి వస్తుంటుంది.

నా గుండె చివుక్కుమంది. సరే ఏంచేస్తాను? వెంటనే కాళ్ళు కడుక్కొచ్చా. అంతకుముందువున్న వుబలాటం నాకిప్పుడు లేదు. అయినా అద్దాలలో పిల్లాడ్ని వేసుకొని వుగ్గుపెడుతున్న మా మంగి వెనక్కి వెళ్ళి భుజాలు పట్టుకొని, "అబ్బ! ఎంత గొప్పగా సాగిందనుకున్నావ్ మేదే?" అన్నాను.

"... పిల్లలుంటె ఇంత గొప్పవుత్సవాన్ని చూడడానికి యీ పాపిష్టి కండ్లు నోచుకోలేదు' అని తిట్టుకుంటూ, "సరేకాని పిల్లవాడ్ని కాస్త ఎత్తుకో, నేను స్నానంచేసి వస్తాను." అంది.

"మీ అమ్మను పిలవగూడదూ?'

"నీకు పిల్లల్ని కనడం మాత్రం తెలుసే," వేళాకోళంగా మాట లాడింది

నేను కూడా వేళాకోళంగా "సరే" తే' అని నా ముద్దు బిడ్డన్ని ఎత్తుకున్నా.

# 29

నాకా ఉత్తరం చూస్తే అర్థమైంది ఆవేళ ఎందుకు పోలీసులొచ్చారో. ఆ ఉత్తరం నాకు మోహన్ నుండి వచ్చింది. అది సూర్యనారాయణ తెచ్చి ఇచ్చాడు. ఆతను తోళ్ళపనివాడు లెండి ఆతని గురించి నాకు కొంచెం తెలుసు. అప్పుడప్పుడు మోహనరావుగారికోసం వాళ్ళ ఇంటికి వెళ్ళేవాడ్నిలెండి. ఆ ఉత్తరం యిచ్చి ఏమి మాటలాడకుండానే వెళ్ళి పోయాడు.

"పోలీసులు విచ్చలవిడిగా తిరుగుతున్నారు. అంత తేలికగా వీళ్ళ వుచ్చులో పడడానికి మనమేమీ పశువులం కాదుగా? కాంగ్రెసు వాళ్ళలా మనం పూలదండలు వేసుకొని అరెస్టు అయితే ప్రజలకు అన్యాయం చేయడమే అవుతుంది. అందుచేత నేను ప్రచ్ఛన్నం కావలసివచ్చింది. నీవు వెంటనే యీ చీటి తెచ్చిన మనిషి ఇంటికి రా అన్ని విషయాలు యిక్కడ మాటలాడుదాం. అర్జంటు' ఇది ఉత్తరం.

వెంటనే సూర్యనారాయణ యింటికి వెళ్ళేను. చీకటి గది. ఆ ఇంటికున్నవి రెండే గదులు. ఇంటి చుట్టూ కనిపించని వనం. పసుపు పచ్చని పూలతో క్రమ్మి ఉంది. చీమ చిటుక్కుమనని ప్రదేశంలో వుందా ఇల్లు.

ఆ చీకటి గదిలో మోహన్ ప్రక్క పెద్ద పెద్ద లావుపాటి పుస్తకాలున్నాయి. నేను నమస్కారమండీ' అన్నా. 'ఉష్' అని సౌంజ్ఞ చేసాడు. నేను మౌనం దాల్చాను.

మోహన్‌తోనున్న ఇంకో వ్యక్తి ఎవరో నాకు తెలియదు. వాళ్ళ చర్చలు మాత్రం చాలా ఘాటుగా వున్నాయి వాళ్ళిద్దరూ నెమ్మదిగానే మాట్లాడుతున్నా. వాళ్ళ ముష్టి కాపింపులు. తలలు టగాయింపులు. అవన్నీ చూస్తుంటే కొట్టుకునేలా వున్నారు. నిజంగా నేను కొట్టుకుంటారేమో నని, తదేక దృష్టితో చూస్తూ అలానే నిలబడిపోయాను. ఇంతల్లోకే బయ ఏదో శబ్దమైంది. మోహన్ జాగ్రత్త" అన్నట్టుగా నాకు సైగచేశాడు. నేను జాగ్రత్తలో మునిగిపోయాను. వీళ్ళద్దరూ చర్చల్లో మునిగి పోయారు. అయితే మళ్ళీ ఒక్కసారిగా నా దృష్టి యీ చర్చలపై పడింది — ఎందుకంటారా? ఇంకోవ్యక్తి అన్నానే — అతగాడు — పుస్తకం నేలకొట్టి మోహన్‌ను దబాయిస్తున్నాడు.

"ఇది సంస్కరణతత్వం' అని

అందుకు మోహన్ తక్షణం అందుకొని —

"వెంటనే రిమార్కు చేయకు. నీవు సెక్టేరియన్ దృష్టిలో పడ్డావు. నీవు ప్రచారం చేస్తూనే ప్రజలలో భ్రమలు పోగొడుతూనే, ఆ భ్రమలు పోగొట్టుకున్న ప్రజలకు .పోరాటమే పరిష్కారమార్గం. అని మన కార్మికవర్గం ద్వారా చాటాలి"

"అంటే వేడినీళ్ళకు కొంపలంటుకుంటాయన్నమాట" అని ఆ వ్యక్తి బుసకొట్టాడు.

"మనది అలా కొంపలంటించే కార్యక్రమం కాదనే నేను చెబుతున్నా. ప్రజలను నడపగలిగేది కాకలుదీరిన కార్మికవర్గం ఒక్కటే.

కార్మిక వర్గానికి సమ్మె వజ్రాయుధంలాంటిది. అయితే మరీ పిచ్చెక్కినట్టు సమ్మెలు, సమ్మెలని తిరక్కూడదు. అందుకు కార్మికులు సిద్ధంగా వున్నారో లేదో కూడా చూసుకోవాలి..... పెత్తందారీ నాయకులను నాయకత్వాన్నుండి పూడపీకాలి. ఇది చిన్న విషయం కాదు. అలా చేయలేకపోయామా? కార్మికుల కత్తి మొద్దుబారిపోతుంది. వీళ్ళే సమ్మె విధ్వంసకులుగా కూడా తయారౌతారు. అంచేత మనం ముందుకు వేసే ప్రతీ అడుగూ ఎంతో జాగ్రత్తగా వేయాలి..' అని మోహన్ ఇంకా అంటుండగానే ఆ వ్యక్తి ధనామని విల్చి—

"ఇది దివాళాకోరుతత్వం?'

ఆ మాట వీడో మోహన్‌ను తిట్టినట్టుగా కనబడింది నాకు. వెంటనే మోహన్ తిరగబడతాడనుకొన్నా. కాని ప్రశాంతంగా అంటాడుగందా।

కామ్రేడ్! నీ వాదన — మాటల్లో అతివాద పదజాలమూ. చేతల్లో సంస్కరణ వాదమునూ, సిద్ధాంత పరిజ్ఞానం లేకపోతే యీ నీ తప్పుడు వాదమే టెర్రరిజానికి దోవతీస్తుంది. టెర్రరిజం ఆత్మవిధ్వంసం [illegible]మా," అని.

"కాయులే. వస్తా....' అని ఆ వ్యక్తి కాస్త పరాకుగా వున్న నన్ను దూసుకుపోయాడు.

♦ ♦ ♦ ♦ ♦ ♦

నాకు బలే కోపం వచ్చింది. కాని వెంటనే మోహన్ — నా భుజంపై చేయివేస్తూ. చిరునవ్వుతో "ఏం నారాయణా, రా నీతో

చాలా పనుంది. మంగి కులాసాగా వుందా?" అనగానే నాలో ఎక్కడ లేని శాంతం వచ్చేసి—

"మంగికేం? బాగానే వుంది' అన్నా చిరునవ్వుతో.

సరే. గోదావరి ఇక నెలరోజుల్లో వచ్చేస్తుంది. మన ఆఫీస్ సీజను కూడా ప్రారంభమౌతుంది. ప్రారంభం కాగానే మన కోర్కెల కోసం రంగంలోకి దిగాలి. ఇప్పటినుండే ఇంటింటికీ తిరిగి ప్రచారం చేయకపోతే లాభంలేదు. సమ్మె పరిస్థితులు కూడా షావుకార్లు కల్పించి వచ్చు. ఏం? ఏం అంటావు'

నాకు ఆశ్చర్యం వేసింది. ఇంతకు ముందే ఆవ్యక్తితో. మేస్త్రీ వుండగా కూలీకోసం పోరాడలేమని ఎన్నో చెప్పి ఇలా అంటారేమిటా? అని ఆశ్చర్యపోయాను.

"ఓయ్. బాబో. యీ భీమయ్య వుండగా సమ్మె:"

'కంగారుపడకు. కూర్చో" అని కూర్చోబెట్టాడు.

క్రిందనున్న పుస్తకాలు ప్రక్కకు జరిపి కూర్చుంటూ—

"ఆ పుస్తకాలేమిటి?" అని అడిగా. అడగనూ మరి? లా పుస్తకా లలా అంతంత పెద్ద బుక్కులుంటే.

"అందులోనే వుంది. విజ్ఞానమంతా. కార్మికులకు భగవద్గీత లాంటివి. ఆనాడు అర్జునునికి శ్రీకృష్ణుడు ఎలా బోధించాడో, ఇందులో మార్క్స్ అని జర్మనీ తత్వశాస్త్రజ్ఞుడు — అలా బోధించాడు.' అన్నాడు మోహన్.

"ఏమంటాడాయన?'

"ఏమంటావేంటి? సర్వతోముఖమైన సామాజిక భౌతికశాస్త్రాన్ని రచించాడు సామాజిక జీవిత విధానాన్నిబట్టి, ఏ మానవుడయినా మారుతుంటాడని ఆతని బుద్ధులూ, ఆశయాలూ, నిరంతరం మార్పుచెందుతూ ముందుకు నడుస్తాయనీ అంటాడు. అంటే నీవున్నావనుకో, తిండిలేక నీ చుట్టూ పేదరికం పంకించిన సోమరి సజ్జువల్లా, తల్లిదండ్రుల ప్రవర్తన వలన దొంగతనానికి దిగేవు. నేడు కాస్త ఆర్థికంగా ఏదో కూలి డబ్బులు తెచ్చుకోవడం వలన, నీతిగా బ్రతకడం, తిండిలేని వాళ్ళపై సానుభూతి కలగడం, వాళ్ళ విముక్తే పరమార్థం అనుకుంటున్నావు. దీనిని బట్టి నీవు పరిస్థితులకు ఒకప్పుడు లొంగావు, యిప్పుడో వాటినే లొంగదీసుకొంటున్నావు. ఇదే మానవ జీవితానికి పరమోత్కృష్టత అని ఏనాడో నిరూపించాడు మహానుభావుడు. అంతేకాదు, దరిద్రుడు — ధనికుడూ అనే తారతమ్యంలేని సమ సమాజాన్ని స్థాపించాలంటే ముందు దరిద్రులంతా ఏకమై మనను దోపిడీ చేస్తున్న ధనికవర్గాన్ని నాశనం చేయాలని శాస్త్రీయంగా ఆ పుస్తకాలలో నిరూపించాడు. ఇటువంటి పుస్తకాలు చదివితే భవిష్యత్తుపై అచంచల విశ్వాసం కలుగుతుంది తెలిసిందా!"

"మరి అడితే వర్తకుడున్నాడనుకోండి? మన వద్దనుండి యే డబ్బూ లాక్కోవడంలేదుగా, పైగా వాడే ఇవ్వడం జరుగుతుందిగా మరి మనలను ఎలా దోపిడీ చేస్తున్నాడు?"

"ఆఁ, మంచి ప్రశ్న వేశావు. యీ చరాచర ప్రపంచానికంతటికీ కష్టజీవుల శ్రమే ముఖ్యం. ఆ శ్రమకు రైలుబండీలా బొగ్గూ, నీరు

పడితేనేగాని పనిచేయదు. నీవు నిత్యం ఆహారం పుచ్చుకోకపోతే చావవు? అంచేత మీకు కావలసిన తిండికి అవసరమైన డబ్బు యివ్వాలి? అలా ఇవ్వకుండా మన శ్రమను, తక్కువ ధరకు కొనుక్కోవాలి. వాడు ఆ శ్రమతో తయారయిన సరుకులను బజారులో అమ్ముకొని లాభాలు గడిస్తున్నాడు. మన శ్రమకు తగిన ఫలం లేకపోబట్టే, మనం మన పిల్లలు అనారోగ్యంగానూ. అసహ్యకరంగానూ వుండి, మధురమైన యీ జీవితాలు పడివయస్సులోనే నాశనమై అంతమైపోతున్నాయి. విను. యీ కలప అడవుల్లోనే ఉంటుంది, న్యాయంగా దానిమీద అధికారం అక్కడ ప్రజలది. కాని ఇప్పుడు అడవులలోంచి తెచ్చిన కలపకు ఖరీదు అక్కడ ప్రజలకు ముట్టడంలేదు. పైగా అక్కడ అమాయక కోయ ప్రజలచే రాత్రింబగళ్ళు పనిచేయించి, పావలా డబ్బులు పారేసి, ఇక్క-డకు తెప్పించి, మీ శ్రమను మళ్ళీ ఇక్కడ సగం డబ్బుతో కొని, ఆ కలపంతా పెద్ద పెద్ద భవంతుల నిర్మాణానికి వినియోగించి, లక్షలకొద్దీ లాభంగడిస్తున్నాడు ఇప్పుడు లెఖ్ఖవేసుకో? నీకూ అక్కడ కలపకొట్టిన కోయవానికీ కలిపి సాలుకు, ఏదో బ్రతకడానికి రెండు వేలయినా కావాల. కాని, నీకు 400, ఆ కోయవాడు అమాయకుడు కాబట్టి వాడికొక 100-లు ఇచ్చి, మిగతా 1500-లు లాభం తీస్తున్నాడు. యీ రెండు వేల రూపాయల సరుకు బజారులో మరింత ఎక్కువ ధరకు అమ్మి, ఇం-కో 500లు నయినా కొట్టేస్తాడు. అంటే కడుపులో చల్ల కదలని సాహుకా-రుకు మొత్తం లాభం 2000 వస్తుంది, ఇదంతా తన ప్రభావమే అంటాడు అందచందాల, ఎత్తయిన భవంతులూ, యీ మన కళ్ల ఎదుట కనబడే

నాగరికతకూ. ఈ విశ్వసంస్కృతికీ మూలం మన శ్రమే. మనం శ్రమపడకపోతే ఏమీకాదు. కాని, లాభం పొందుతున్నది షావుకార్లు. చస్తున్నది మనం. ఈ పద్ధతిని రూపుమాపాలంటే, శ్రమజీవుల రాజ్యం రావాలి. అప్పుడే "పనిచేసేవాడికి తిండి, సకల సంపదలు' చేకూరుతాయి. వర్గ తారతమ్యం లేని స్వర్గధామం సృజిస్తాము. ఇదంతా కార్మిక వర్గం తప్ప ఇంకే వర్గమూ చేయలేదని ఆ మహానుభావుడు వివరంగా చెప్పేడు. ఒక్క మాటలో చెప్పాలంటే. ఆయన సిద్ధాంతాలూ మూడు సోపానాలుగా వుంటాయి. అర్థశాస్త్రం సాంఘికశాస్త్రం. భౌతికతత్వ శాస్త్రం. ఇందులో అర్థశాస్త్రం దున్నిన భూమిలాంటిది. సాంఘికశాస్త్రం మొక్కలాంటిది. తత్వశాస్త్రం పుష్పంలాంటిది. అంటే మామూలు పుష్పంకాదు ఉన్నత మానవ మేధస్సులోపలనుంచి సౌరభ, సోయగములతో జనించిన సర్వతోముఖ విజ్ఞానపుష్పం. దీనినే మార్క్సిజం అంటారు. దీనిని పఠిస్తే ప్రపంచంలోనున్న ప్రతి విషయానికీ పరిష్కార మార్గాన్ని అతి సులువుగా సాధించగలుగుతాం తెలుసా? నిజంగా నీవు కార్మికుడవు. ఎంతో అనుభవం వుంది. దానికి యీ విజ్ఞానాన్ని కూడా జతచేర్చి ఒక్కొక్క విషయానికి నీవు పరిష్కారమార్గం చెబుతుంటే ఇంద్రజాలం లాగుందేనని ఆశ్చర్యపోతారనుకో." అని ఎంతో ఉత్సాహంతో పరవశత్వంలో చెప్పేడు. ఆనందముతో అతని కండ్లు చెమ్మగిల్లాయి. ఆయన మాట ముత్యాల్లాగే వున్నా? అర్థమూత సమంతగా వున్నట్టు నాకు గోచరించింది.

ఆయనన్నాడు —

"సరే నేను రెండు పుస్తకాలు ఇస్తాను తీసుకెళ్లు"

"తప్పకుండా ఇవ్వండి. చదువుతాను. ముందు ఒక్కటే ఇవ్వండి చదివేక రెండోది ఇద్దురుగాని." అన్నా। నిజంగా అంత గొప్ప పుస్తకం ఒక్కటయినా చదివితే చాలనిపించిందనుకోండి నాకు. ఆయన ఒక పుస్తకం ఇచ్చాడు. అది చాలా లావుగా వుంది. దాని పేరు "అమ్మ"

అది ఇస్తూ అన్నాడుకదా?

"నీవు శారీరక పరిశ్రమ చేస్తున్నావ్ ఇక మానసిక శ్రమ దానికి జోడించావంటే ... .... అప్పుడు చూచుకో"

"అలాగేట్టె కానివ్వండి" అన్నా.

మోహనరావుగారు ఏదో తడుముకుంటున్నట్టుగా అన్నారు.

"సరే। మాటల్లో మరచాను. ఇదిగో? మనమీద ప్రభుత్వం కన్ను వేసింది. మనం రేపట్లా ప్రభుత్వ కళ్ళల్లో దుమ్ముకొట్టి పనిచేయాలి. అడితిలో సీజను ప్రారంభం కావస్తుంది. ఇంకో నెలలో గోదావరి వస్తుంది. అంచేత మనం వెంటనే కార్యక్రమం మొదలుపెట్టాలి. ముందు మనం నూతన ఎన్నికలు జరపాలి. అందులో యీ మేస్త్రీలు కాని వస్తే, మన కార్యక్రమం అంతా భగ్నమైపోతుంది. ఆదివారం సెలవుకు కూలీ యివ్వాలని పట్టంలో వున్నా. వర్తకులు మొండిచెయ్యి చూపుతున్నారు. దానిపై ఇతర సంఘాలలో ఆందోళనకూడా జరుగుతోంది. మనంకూడా ఆందోళనకు పూనుకోవాలి. ఇంకా కూలీ గొడవ వుంది. మొత్తంమీద ఎత్తుపల్లాలన్నీ సరిజేయవలసిందే? ఈ దఫా

ప్రభుత్వం వర్తకుల పక్షాన్నుండి యిప్పటికీ పరిస్థితులను తీసుకు రావచ్చు. అందుచేత యుపకులనందరినీ ప్రోగుచేసి యిప్పటినుండే తీవ్ర ప్రచారం ప్రారంభించాలి. అందరిలో చొరబడి మన కోర్కెలను ప్రచారం చేయాలి. మన కోర్కెలు ప్రజలుకూడా బలపర్చేలాగు ప్రయత్నం అందుకోవాలి తెలిసా!" అని కనుబొమ్మలు ఎగరేసాడు.

నేను ఒక్కసారిగా ఇంత భారాన్ని నా భుజస్కంధాలపై మోయ గలనా అని దీర్ఘ నిశ్వాసాన్ని విడిచా.

"ఏం నిట్టూర్పు విడిచావు? అన్నాడు మోహన్.

"ఏదికయినా ఆ మేస్త్రీలు ఆ సుబ్బన్నగారు చాలా అష్టండీ! అన్నా.

వంటి పిల్లవాణ్ని దువ్వినట్టుగా నా మేని దువ్వి అన్నారు.

"గత సంవత్సరం ఏమయ్యారు వీళ్ళంతా? కూలి పెంపుకు వ్యతిరేకంచూపేసరికి ఆకూలి పెంపుదలకాగానే అంతా ఒక్కసారిగా బయటపడ్డారు. యీ సారి ఇంకా గట్టిగా ఆందోళనకు దిగితే వీళ్ళే పారిపోతారు. మరేం భయంలేదు. నీవేమీ దిగులుపడకు తెలుసా. సరే వెళ్ళు.

"మంగికి మిమ్మల్ని చూడాలని చాలా కోర్కెగా వుంది. రమ్మని చెప్పింది కూడాను." అని నేను ఆయన వంక చూచాను.

ఆయన చిరునవ్వు నవ్వి. బుర్ర చిటికెనవ్రేలుతో గోక్కుంటూ— "సరే వస్తాను రెండుమూడు రోజుల్లో. రేపు పేపరు మిల్లువాళ్ళను కలుసుకోవాలి," అన్నాడు. "సరే" అని నేను వెళ్ళిపోయాను.

# 30

అమ్మయ్య వర్షఋతువు ప్రారంభమైంది. గంగాభాగీరథి పెద్ద పెద్ద కలపపలకలను అమాంతంగా తీసుకొచ్చి రేవులలో వొదిలిపెడుతోంది. మా అడితిలో పని తిరిగి ప్రారంభమైంది. నేను పనిలోకి వెళ్లాను. మంగిని మాత్రం పనిచేయించడానికి నాకు మనస్సు యిష్టపడలేదు. ఎందుకంటారా? మా బాబు అప్పుడప్పుడు అనేవాడుకదా.

"ఆడదానిచే పనిచేయించుకు తినే మగవాడు గాడిదతో సమానంరా! చూడు. మీ అమ్మను ఎప్పుడయినా గుమ్మం దాటి బైటకు అడుగు వేయనిచ్చే వాడినా?" అని.

నేనందుకే మానిపించలేదులెండి. మా మంగి వెనకటి యౌవ్వనంలో వున్న మంగికాదుగా! ఇప్పుడు మంగి బిడ్డతల్లి కదండీ ఇప్పుడు చాలా బలహీనంగా వుందిలెండి. అప్పటి మృదువైన ఆ గుండ్రని బుగ్గలూ తుమ్మెదల జంటలానున్న ఆ విశాలమైన కండ్లూ, ఇప్పుడు నాలుగు గుంటలుగా కనబడుతున్నాయి. అప్పుడు నీలమేఘచ్ఛాయతో నిగనిగలాడే ఆ నిగువైన శరీరం. ఇప్పుడు సన్నగా వుంది. ఇలా అంటున్నానంటే కురూపిగా వుందనుకునేరు! కాదుసుమండీ! అప్పటి అందం వేరు. ఇప్పటి అందం వేరు. అని మాత్రమే అప్పుడు నవయౌవ్వనాంగి. ఇప్పుడు గృహలక్ష్మి. ఇంతకీ ఆడదానికి కావలసింది__అందచందాలే కావుకదండీ. అయిదవతనంతూనా వుంటేనే చెప్పకపోవడమేం? నాకిప్పుడే మరీ అందంగా, కళకళలాడుతూ కనబడుతోంది. అందులోనూ,

ముంగి పనంతా బిడ్డన్ని చూసుకునే సరికే సరిపోతుంది. ఇక దానికి వనే మిటిలెండి ఏదో కాస్త. అదితీకి చల్దిగంజి తెచ్చిపెడితే అదేచాలు.

ఆవేళ కలప మహాజోరుగా వచ్చింది. ఆ రాత్రింతా వర్షం కురిసినందువలన గట్టంతా కాలేస్తే జారిపోయేలావుంది. మాయ వర్షం దీని కొంపేం కూలిపోయింది. చెప్పండి. ఆ పిలవాలుగా వున్న గట్టుపై బరువైన పలకల్ని వెదురుబొంగు బుజాన్నేసుకొని ఎలా గట్టెక్కించడం చెప్పండి. ఏదో నాకు యీ మోత అలవాటయింది కాబట్టి సరిపోయింది లేకపోతే చచ్చినంత పని. అంతా ఎందుకు? కొత్తగా నేను పనిలోకి వచ్చినప్పుడు బట్టినవాడెవడున్నాడు చెప్పండి. మా జట్టులో వీర్రాజు తప్ప.

మా అదితి రేవు వుంది చూశారు? నల్లరేగడి మట్టేమో — కొమ్ముకాసి. గతుకులతో నిండిన ఆ గట్టు ఎక్కుతోంటే అడుగడుక్కీ గండమే. పలకమోసే ఏనమండుగురి అడుగులు ఒక్కసారే పడాలి. మాటలా? మోసేవాడికి తెలుస్తుంది బరువు.

ఉషోదయం కాగానే పనిప్రారంభమైంది. అరుణోదయం కాబోతోంది. అనూరసారథ్యంతో సూర్యుడు తన మేలు వెచ్చని ఎర్రని కిరణాలను లోకానికి ప్రసాదిస్తూ తూర్పున ప్రత్యక్షమయ్యాడు. మేము గబగబా పలకమోత పూర్తిచేసి. చల్దికి పోదామని మోతను కాస్త చురుకుచేసాం.

అసలు నెమ్మదిగా అడుగు వేస్తేనే జారిపోయేగట్టు చురుకుగా అడుగేస్తే ఎలాగుంటుంది.? ఆలోచించండి మేమంతా ఒక్కొక్క అడుగు వేస్తోంటే. నడుంలోని ఎముకలన్నీ పెళా పెళా విరుగుతున్నాయ్.

అంత వర్షాకాలంలోకూడా చెమట, ధారాపాతలుగా కారుతోంది ఇంకా వయం. మా జట్టులో సూరన్న వున్నాడే, అతను పాట అందుకో బట్టి కొద్దిగా ఆ అడుగయినా ఉషారుగా పడేది.

ఒక్కొక్క చరణం సూరన్న పాడింతర్వాత మేం అందుకుంటే వాళ్ళం.

"ఏలేయ్యాలా ఏలేయ్యాలా!

ఐలాసో .... ఓహో ....' అని.

"ఓహో!" అనే టప్పటికే మా అందరి అడుగులు ఒక్కసారి పడేవి. మళ్ళీ రెండో చరణం ఎత్తుకునేసరికి ఆ వేపు అడుగులు దానికే సరిపోయేది.

మళ్ళీ సూరన్న అందుకునేవాడు

"శ్రీవరదా యీ దీనుల కాపాడూ ..."

"ఓ దేవా!.... ఓహో!....' అనేటప్పటికి మేము "ఓహో!' అని అడుగువేసి ఆ మొదటి చరణం అందుకునే వాళ్ళం. ఇది కష్టాన్ని కప్పేస్తుందనుకోండి.

ఇలా పాడుకుంటూ ఆ జర్రున జారుతున్న గట్టు మీద ఒక్కొక్క కష్టాన్ని ఎదుర్కొంటూ — ముందుకు పోతున్నట్టుండేది. ఆ కష్టాలను ఎదుర్కోడంలో ఆ పాట మాకు ఆనందాన్నిచ్చేది

కొండపైనుండి రాయి దొర్లించడం సులభమేగాని. ఎక్కించడమే కష్టమంటారు పెద్దలు. కాని మా జీవితము అదికాదు. ఆ జాము

తున్న గట్టుపై ఎన్ని కష్టాలుపడి, ఆ పలకను ఎక్కించేవాళ్ళమో. అంత కష్టంతో మళ్ళీ గట్టు దింపి పెట్టికి చేరవేయవలసివచ్చేది. అంతేనండి. జీవితంలో కష్టసుఖాలు సమానంగా చూచుకొని గడపాల్సిందే కదండీ

ఆ గట్టు ఆ మోత అంతా మాలాంటి శ్రమజీవుల జీవితం ఎంత కష్టభూయిష్టంగా వుంటుందో స్ఫురణకు తెస్తుంది. — అంతే. ఏ అడుగుతో కాలుజారినా మా జీవితాలు సర్వనాశనమే కదండీ. జారి క్రింద పడ్డామా? రేవులోకి కొట్టుకుపోయామే. అంతవరకూ వెళ్ళనిస్తుందా మోస్తున్న పలక? ఈలోపులో మీదపడి గంగాదేవి వాడిలోకి పంపే బదులు, భూదేవి వాడిలోకే పంపుతుంది. ఈ జీవితం వుంది చూశారూ? వైకుంఠపాళీ లాంటిదనుకోండి. కష్టపడి పిల్లపాముల గండాలుదాటి నిచ్చెన లెక్కుతూ పాకిపోయాంరా — అంతే. పెద్దనోరు తెరుచుకుని వుంటుంది — పాము. నోటిలో గాని పడ్డామా? తిన్నగా పందికడుప్పులోకి వచ్చేస్తాము. మళ్ళీ ఎంతో శ్రమపడితేనేగాని పైకి ఎక్కలేం. చూడండి జీవితంకూడా కొంచెం ఇంచుమించు అంతేకదండీ. కష్టాలొచ్చినప్పుడు తట్టుకుంటూ ఓర్పుతో, పట్టుదలతో ముందుకు పోకుండా నిరుత్సాహంతో కుమిలిపోతామనుకోండి, ఇక ఆ జీవితంకూడా అధోగతేనండీ. అందుకే యీ మధురమైన జీవిత సుఖాన్ని అనుభవించడానికి త్యాగాలుకూడా చేయవలసి వుంటుందన్నాడు, మోహన్ ఒకసారి.

తొమ్మిది కావచ్చింది. ఎండ ఎక్కువౌతోందనగా, మా పలకల మోత ఆపుజేసి, ఎవరిమట్టుకు వారు చల్దికి వెళ్ళిపోయారు. నేను తువాలుతో వొళ్ళు దులుపుకుంటూ ఆత్రుతగా, చింతచెట్టువైపు చూచాను.

మా మంగి ఎంతసేపటినుండి వుందో. ఆ చింతచెట్టు క్రింద — గంప ముందు పెట్టుకొని కూర్చుంది. మాటలేమిటి? క్రోసుడుదూరం నుంచి తేవాలి మరి. అడ్డుగా సీతంపేటలోంచి వస్తే మైలుదూరం ఉంటుందను కొంటా.

మా మంగిని చూడగానే ఒక గంతేసి చెట్టుక్రిందకు వాలిపోయాను. మా మంగి చిక్కిపోయినా లక్ష్మీకళ తాండవమాడుతోంది ముఖంలో. తలకు స్నానంచేసి కండ్లకు కాటుక పెట్టిందేమో, ఆ చింత చెట్టు కొమ్మల్లోంచి. చొచ్చుకు వస్తున్న సూర్యకిరణాలు గాలికి రెపరెప కొట్టు కుంటున్న ముంగురులు మీద పడి, ఇంద్ర నీలాల్లా మెరిసిపోతున్నాయి. ముఖం పువ్వుల్లో పెట్టినట్లు వుందనుకొండి. ఆ ముఖం నాకు ఎంతో ముద్దేసింది.

గంపమీద పరచిన పైట తొలగిస్తూ, అన్నా

"చాలా త్వరగా వచ్చేసావే?"

"త్వరగా కానిద్దూ. పిల్లవాడేడుస్తాడు" అంది — నేను తొల గించిన పైట వెనక్కి విసురుతూ.

మా మంగికి నా రుచులన్నీ బాగాతెలుసు. నాకు చద్ది అన్నంలో తెల్ల నీరుల్లిపాయంటే ఎంతో యిష్టం. ఒకటయితే చాలదేమో. కుండెడు చద్దన్నమైనా సునాయాసంగా ఏక్కించేయగలను కాని నా మంగి రెండు తెచ్చింది. నేను సంతోషంతో అన్నా అన్నంలో పుప్పు కలుపుతూ —

"మంగీ, యీ వేళ మనం సినిమాకు వెళ్ళిపోదాం, ఏం?"

ఇదివరకు సినిమాలంటే చంకలెగరేసే మంగి ముఖం చిట్లిస్తూ —

"ఈవేళ పని యెక్కువైందో లేకపోతే అప్పుడే సినిమా? ఇంకేం సంసారం పట్టించుకోవద్దూ! అందులోనూ పేదవాళ్ళం కాస్త పొదుపు చేసుకోకపోతే ఎలా అనుకున్నావ్?" అంది.

మా అమ్మకూడా వెనుక ఇలాగే అనేది. ఆ అనడంలో కఠోరం వుండేది. కాని. మంగిలో ఎంత మృదుత్వం వుందనుకున్నారు? అబ్బ! అప్పుడే మంగికి సంసారం వొంటబట్టేసిందే.

కాని నాకటువంటివంటే మొదటినుండీ మంటే. పొదుపు. ఏం పొదుపు చెప్పండి? అర్ధం పీద దమ్మిడీని సాలుకతో వేలే పిసినిగొట్టు ముండాకొడుకుల్లా! దేబిరిగొట్టు ముఖం పెట్టుకొని. ఖర్చుపెట్టమంటే నాకు మాచెడ్డ మంట. ఏదో ఎప్పటికప్పుడే ఆనందం. బ్రతుకున్న తరువాత ఆనందంలేని బ్రతుకేల బ్రతుకు చెప్పండి అయినా మంగి మాటకు ఎదురు చెప్పదలుచుకోలేదు.

"అప్పుడే సంసారం వొంటబట్టిపోయిందే." అని మాత్రం అన్నా— ముద్ద నోటిలోకి వేసుకొంటూ.

"ఏడాదవ్వొస్తూంది. వొంటబట్టదూ? తినమూ? ఎప్పుడూ కబుర్లే."

"ఆఁ, ఆఁ. తింటున్నానండి అలివేలు మంగమ్మగారూ!" అని గబగబా నాలుగు ముద్దల్లో. వట్టి అన్నం అంతా పూర్తిచేసి, గంజి నాలుగు గుక్కలు పట్టేటప్పటికి హాయిగా వుందనుకోండి. చద్దిగంజి

నిజంగా మాకు తల్లిపాలే. గంప మంగి నెత్తిపై పెట్టి నేను రేపులోకి వచ్చేసాను.

పలకమోత అయిపోయినందువలన, బాజాలమోతకు, కొమ్ములు వస్తున్నారు మా వాళ్ళు ఇంతలోకే పేపరుబిల్లు కుర్రోడొకడు— వాడొట్టి ఆకతాయిగకతెండి. ఎప్పుడూ వాడిమకాం మా సంఘ మాఫీసే. ఒగుర్చుకుంటూ వచ్చి "ఇంకేముంది? మోహన్‌రావుగారిని పోలీసులు లారీలపై తీసుకుపోతున్నారు.' అన్నాడు.

నా గుండెల్లో రాయిపడింది. అప్పుడు నా పక్కనే వున్న సూరన్న — "మంచిపని జరిగింది, శని వొదిలింది వూరికి.' అన్నాడు. నాకు కోపం వచ్చింది. కాని, మాట్లాడలేదు. వీర్రాజు పటుక్కున అందించాడు జవాబు — "యీ షావుకార్ల నెత్తికి మేకులు దిగొట్టే వాళ్ళింకా వున్నారులే" అని, నేను మాత్రం ఒక్క నిముషం అక్కడుండకుండా వచ్చేసాను,

# 31

యింటికి వచ్చి, మంగికి విషయం చెప్పేటప్పటికే తెల్లబోయింది. ఆ వార్త విన్నప్పటినుండి నా నరాలు స్వాధీనం తప్పాయి. సరిగా అడుగే పడడంలేదు. గబగబా అనంతరావు యింటికి వెళ్ళాలని బట్టలు వేసుకొని గుమ్మందాటబోతున్నాను.

మంగి అడ్డొచ్చి—

"ఆయన అరెస్టు అయ్యాడంటే నేను నమ్మను. పోనీ, భోజనం చేసి వెళ్ళకూడదూ?" అంది.

"అబ్బా! తరువాత చూసుకోవచ్చులే. భోజనం ముందా? ఈ పని ముందా?" అని బయటికి వచ్చేసాను.

రోడ్డు మార్గాన్ని. గాకుండా. గొడ్డుమార్గాన్ని బట్టి పొలాలంట బయలుదేరా.

పోలీసుల లాఠీ వెళ్ళటంమాట నిజమే. ఆనందరావు ఇంటి మీద దాడి చేసిన మాట నిజమే. ఎందుకలా అనుకున్నానంటారా? నేనింకా ఊళ్ళో అడుగు పెట్టానో లేదో. ఊరంతా సందడిగా వుంది. అంతా చెప్పుకుంటున్నారు. ఆ ఊళ్ళో కూలి సంఘాలకు వ్యతిరేకమైన సరుకు చాలా వుందిలెండి.

నేను వీధిలోంచి వెళుతుంటే కొందరి మాటలు ఇలా చెవిలో బడ్డాయి

"రాత్రి వచ్చినట్టు చూసాంకదరా? ఎలా పోయాడురా దొంగముండా కొడుకు? చాలా ఆశ్చర్యంగా వుందే?"

"మొత్తంమీద ఇది మహేంద్రజాలంలా వుందిలే. ఒకవేళ తెల్లవారు ఝామునే తిరిగిపోయాడేమో!"

ఈ మాటలు నాకెంతో సంతోషాన్ని కలిగించాయి. మండుటెండలో దప్పికొన్న వానికి మంచినీళ్ళు దొరికినట్టయిందనుకొంటి.

కాని నాకింకా అనుమానమే. అయినా ఆనందరావు ఇంటికి. వీధిత్రోవను వెళ్ళేదానికంటే దొడ్డిత్రోవనే వెళ్ళడం మంచిదనుకొని. ఆ

పీపీ ప్రక్కనుండి నెమ్మదిగా పెరటిత్రోవన వాళ్ళదడి తాటాకులు వత్తిగించి లోపలికెళ్ళా ఆ తాటాకు చప్పుడుకు గమ్మున అరుంధతి బయటికి వొచ్చి—

"ష్! కొంప ముంచేస్తావు. ఇప్పుడే పోలీసులొచ్చి, వెళ్ళేరు. నెమ్మది" అంది.

ఒకవేళ ఆయన అరెస్టు అయితే అరుంధతి ఇలా ఎందుకుంటుంది. అని అనుకొని — నోటితో మాటలాడకుండా "ఏం? వున్నాడా?' అన్నట్టు సౌంజ్ఞచేశాను.

"ముందు లోపలికిరా తరువాత చూసుకోవచ్చు." అని కండ్లతో అంది — అరుంధతి. అరుంధతి ఎంత తెలివైన అమ్మాయనుకొన్నాను. అబ్బ ఎంత జాగ్రత్తో మాటంటే.

నేను దొడ్డిలోంచి గుమ్మంలోకి వచ్చాను. అరుంధతి, తలుపు నెమ్మదిగా వేసింది మామూలుగా వేసిందా! ఎవరైనా చూస్తున్నారేమోనని అటూ ఇటూ ముందు పరిశీలించి మరీ వేసింది.

వేలితో గది చూపించి, అరుంధతి ప్రక్కకు తప్పుకుంది.

నేను గదిగుమ్మంలోకివెళ్ళి అలా అయిదు నిముషాలు నిశ్చేష్టుడనై నిలబడిపోయాను. ఎందుకంటారా? ఎదురుగుండా దొంగముని వేషం వేసిన అర్జునుడిలాగా మోహన్‌రావుగారు మంచంపై కూర్చున్నారు. నన్ను సౌంజ్ఞతో కూర్చోమని ఆహ్వానించారు. నేను కూర్చొని ఆశ్చర్యంగా అన్నా—

"వూళ్ళో గగ్గోలుగా వుంది, తెల్లవారు యామున వెళ్ళిపోయి వుంటాడని అంతా అనుకుంటున్నారే" అన్నా.

ఆయన జేబురుమాలు అడ్డుపెట్టుకొని నవ్వేడు. మళ్ళీ నేను ఆతుర్తతో అన్నా —

"ఏం? ఎలా తప్పించుకొన్నారు?"

"అరుంధతి నడుగు చెబుతుంది." అన్నాడు మోహన్‌రావు ఎదటి గది చూపిస్తూ —

నేను "అరుంధతి" అని పిల్చా.

నెమ్మదిగా, గుమ్మం దగ్గరకువచ్చి — మోహన్‌రావుగారి మాట వినినట్టుంది — "ఆయననే అడుగు" అని వెళ్ళిపోయింది.

నేనన్నా:

"మా మంగి జ్యోతిషం చెప్పినట్టు చెప్పిందనుకోండి"

"ఏమని"

"ఆయన అరెస్టు అయ్యాడంటే నేను నమ్మను. అని'

"ఎలా అయినా ఆడవాళ్ళు దేనికయినా తగుదురు.' అని ఏదో భావార్థంగా అని ఎదుట గదివైపు చూసాడు.

"చెప్పండి! ఏమైంది ఎలా తప్పించుకున్నారు?' అని మళ్ళీ ఆతుర్తతో ప్రశ్నించా.

"అరుంధతిని అడగమన్నానుగా!' అన్నాడు నవ్వుతూ.

"మీరు చెప్పండి!" అని మళ్ళీ అడిగా.

"చెప్పడానికేముంది? అరుంధతే రక్షించింది. అదిగో...." మాసిన బట్టల బుట్టవైపు చూపిస్తూ — అందులోనే నన్ను దాచింది, వాళ్ళంతా

వెతికేరు. అటకకు అటుకు కూడా ఎక్కి చూశాడు. చివరికి తెల్లముఖాలు వేసి వాళ్ళకు బుద్ధిచెప్పారనుకో' అని నవ్వేడు.

ఆయనకు ఆ జ్ఞాపకంతో నవ్వొచ్చింది గాని నాకు చాలా కోపం వచ్చింది. నాకు ఆనాడు భోజనం వడ్డించే పుంటూ అయినంతటికీ, మోహన రావుకు జరిగిన సంభాషణ, పిసినారివాళ్ళు తెలిసికొచ్చినట్లు, నా మనోనేత్రాల ముందుకు వచ్చింది ఇక నాకు కోపం ఆగలేదు. అన్నా ఏమైనా అనడానికి తెగించలేకపోయేవాడిని కాని యీనాడు తెగించేశాను. ఏదో అనకుండా వుండలేకపోయాను. వెంటనే తీవ్రంగా ముఖం పెట్టి అనేశా —

చూశారా? హృదయం ఉన్న స్త్రీ తన ప్రాణాన్నయినా యిస్తుంది"

ఆ మాటను ఆయనర్థంచేసుకున్నాడనుకొంటా. ఆ మాట బలంగా గుండెల్లో గుచ్చుకొని ఉండాలి అతని ముఖంలో నివ్వెరపాటు కనబడింది. ముఖం ఆ మాటకు వెనక్కి తూలింది కూడాను.

ఓ నిముషం పున్నాక నేనే అన్నా,

"యీ వేళ రాత్రికి మా ఇంటికి రావాలి సుమా."

ఆయన ఏదో ఆలోచనతోనే తలూపాడు.

ఆ అంగీకారాన్నందుకొని నేను వచ్చేసా.

రాత్రికి వస్తానన్న మోహనరావుగారు రాలేదు. నాకు అందోళనగానే వుంది. చాలా సేపటివరకూ—అంటె, సూర్యోదయం కావస్తోంది దాకా అనవసరంగా పని మానివేయటం ఎందుకని గబగబా పనిలోకి వెళ్ళాను. అంతకు ముందురోజున మిగిలిపోయిన పలకలు పోశాం. అవి ఇంకా తరగవేలేదు. మా సాహుకారు వచ్చి—

ముందు రేవులో బాజులు ఆ పడవ మీదికి ఎక్కించండి' అన్నాడు.

ఏమైనా మేస్త్రీ యిష్టంగా. దానికి మేస్త్రీ అన్నాడు గండా:

"హూఁ! మోసెయ్యండిరా, గంటలవి" అని. మేస్త్రీకేం తెలుసు మోత సంగతి. ఆ బాజులన్ని మోయడానికి సరిగ్గా పూటంతా పడుతుంది. గంటలో అయిపోతుందంటాడు. సరే ఏదయితే ఏం? కూలి వస్తుందిగా అని మోయటం ప్రారంభించాం.

పది దగ్గర కావస్తోంది. కాని మంచి భోజనం చేసేలేదు. రాత్రికి వస్తానన్న మోహన్ రాకపోవడం, మంచి భోజనం లేకపోవడం నాకు మతీ కంగారుగా వుంది. పోని వెంటనే భోజనానికి వెళ్ళొద్దామా అంటె కోటి తిండా లెక్కడ? కంబాలవెడపెక్కడ? నా ఖాతా హోటలుందిగా. వెంటనే వెళ్ళి ఏదో కాస్త టిఫిన్ చేసి, మళ్ళీ మోతకు అందుకున్నా. రోజూ మోతలో మునిసిపాలిటీవాళ్ళను తిట్టకుండా అడుగు పడేదికాదు. కాని యీ వేళ పాటలూ, తిట్లూ లేకుండానే జరిగిపోయింది.

సాయంత్రం అయింది. కూలికి మేస్త్రి, సాహుకారు వద్దకు వెళ్ళేరు. మేము చుట్టూ చేరాం. మేస్త్రీ, సాహుకారూ, ఏదో గుస గుస లాడుకుంటున్నారు. నాకు అనుమానం తట్టింది. మా జట్టులో మంచి యువకులున్నారులెండి. ఏదైనా తప్పే ఎవడినయినా నోరు మూయించగల రనుకోండి అందులోనూ వీర్రాజున్నాడే. మంచి గడేకారిరకం. సూరన్న అటువీళ్ళు లేకపోతే, చిత్తం వచ్చినట్టు సాగివుండేవి. వెంటనే ఒకడు అందుకున్నాడు.

"ఏమిటండీ మేస్త్రీగారూ గుసగుసలు? సాహుకారుగారు ఏమంటారు?"

సాహుకారు — కోపంతో అన్నాడు.

"మీకెందుకోయ్. పొనకంలో పుడకల్లా? మీ మేస్త్రీ వున్నాడుగా।"

"పని చేస్తున్నది మేమా? మా మేస్త్రా?"

దీనితో సాహుకారికి మేస్త్రీకి కూడా ఒక్కసారిగా కోపం వచ్చింది, ముందుగా సాహుకారు వ్రాతబల్ల మీదనుండి ముందుకు వంగి—

"అయితే మీరే కూలి పుచ్చుకోండి." అని మేస్త్రీ వంక చూసాడు రెచ్చగొట్టే విధంగా.

మా మేస్త్రీ ఆ మాటలలో పడ్డాడు.

"అవును మరి! నేనెందుకు? పనిచేస్తున్నది. మీరేగా. యీ పను లన్నీ ఎవడు చేస్తాడు? రేపటినుండీ ఇవన్నీ కూడా మీరే చూసుకోండి?" అన్నాడు కోపంతో.

మేమంతా చెమటోడ్చితే, కూలీ పుచ్చుకోవడంకూడా మా మేస్త్రీకి పెద్ద పనే అయిపోయింది. అవును మరి! ఏదో పితలాటకంపెట్టి డబ్బు సంపాదించడానికి కష్టపడటం కూడా అవసరం కదండీ! ఇంతకీ మా మేస్త్రీ అన్న పనులన్నీ ఏమిటంటారా?

విడంగా వున్నాయిలెండి, ఇంటికి నాలుగు కర్రిపేళ్లూ, ఏదో అంపం పొట్టూ తీసికెళ్ళాలంటే, ఆ కబుర్లూ యీ కబుర్లూ చెబుతూ కూర్చోవాలి కదండీ! అందులోనూ, అవన్నీ సాహుకారు బండిమీదే తీసుకెళ్ళాలిగా! అటువంటప్పుడు ఏదో ప్రక్కని కూర్చొని పిల్లిమీద ఎలుకను, ఎలుక మీద పిల్లినీ ఎక్కిస్తూ మాటలాడకపోతే ఎలాగు చెప్పండి. ఇదంతా తక్కువ పనా. ఏమిటి!

ఈ తగువు తేలేలాలేదని, నేనే కలగజేసుకొని అన్నా—

“ఏమిటో వాళ్ళు రెచ్చిపోయారని పెద్దలు మీరు రెచ్చిపోతే ఎలా చెప్పండి! కానివ్వండి మేస్త్రీగారూ!”

సరే కూలి పుచ్చుకోవడం జరిగిపోయింది. ఇక పంపకం వద్ద ఎలాగూ వుంది. గొడవ! పంపకం వద్ద ఏ తగువు వచ్చినా కథమూష్టి పర్యంతం అయితేనేగాని, తేలనే తేలదు.

లెక్కతేస్తే కూలి మనిషికి ముపాతిక డబ్బులూ రావడంలేదు.

“మరి ఉదయాన్ని నాజాలకేం వేగాడు కూలి” అన్నాడు వీర్రాజు.

“ఎగుమోత తేగాదంతే!” అన్నాడు మేస్త్రీ.

"అదేం కుదరదు. రేవులోంచే తేరాలిచ్చి. కలిసొచ్చిన కూలికి లాభం పెంచుకొంటే. యీ పద్ధతేం కుదరదు! అన్నాడు వీర్రాజు.

ఎవడు కొట్టినా మన కడుపే" అని మా జట్టులో ముసలాతన్నాడు.

"పూరుకుంటే సరి. అందరి కడుపులూ కొట్టొచ్చు. ఎన్ని పూళ్ళయినా ఏలొచ్చు.' అన్నాడొక యువకుడు.

సూరన్న ఏమంటాడో. దానిని బట్టి నా వుద్దేశం చెబుతామని కనిపెట్టుకు చూస్తున్నాను. అంతలోకే సూరన్న అందుకుని:

"కనీసం ఎగుమోత, దిగుమోత కూలివేటినా బాగుణ్ను కదండీ!" అన్నారు.

"సరే వెళ్ళి అడుగుదాం.' అని లేవబోయాడు మేస్త్రీ.

"అదేం కుదరదు. ఎగుమోత, దిగుమోత రేవుకు చేరా కూలీ వేయాల్సిందే. వాటికి అప్పన్నామా ఏమిటి!' అన్నాడు వీర్రాజు చురకత్తిలా.

"అయితే మీరే వెళ్ళండి" అన్నాడు మేస్త్రీ. కూలీ సొమ్ము ముందు పారేస్తూ —

"పుణ్యం పంచకం మీకా! పాపం పంచకం మాకా! అయితే మీరెందుకు!' అన్నాడింకో యువకుడు.

ఇది కులపల్లి గోత్రాలవరకూ వచ్చేలావుందని నేనే కలుగచేసుకున్నా.

"సరే పదండి ఇక్కడెందుకు మనలో మనం గొడవపడడం షావుకారు వద్దనే తేల్చుకుందాం. పదండి" అన్నా.

అంతా లేవారు. సాహుకారు వద్దకు వెళ్ళేం. శేషగిరిరావుగారు కూడా వున్నారు.

"ఈ కూలీకి మావాళ్ళంగీకరించడం లేదండీ!" అన్నాడు మా మేస్త్రి.

"ఏం ఏం కష్టపడ్డారు! రేవులో బాజాలు పడవలో వేయడమేగా, అయితే యింకో జట్టుతో వేయింకోవాలన్నమాట!" అన్నాడు సాహుకారు. నాకా మాట గుండెల్లో గతుక్కుమని గుచ్చుకుంది. ఏమిటో! మావాళ్ళంతా ఆ సాహుకార్ల కూడా పోతూ, మేస్త్రీలతో, గొడెర్రిల్లా పోవడమేగా! లేకపోతే ఎన్నివేల గుండెలున్నాయి. ఆ మాటలనడానికి! ఈ మేస్త్రీమాండాకొడుకులు చేసారు యీ గొడవంతా. ఎవడి జట్టుకు వాడే అధినేత. వాళ్ళిష్టమొచ్చినట్టు కూలి రేట్లు పుచ్చుకోవడం. ఒక పద్ధతా. ఒక సిద్ధాంతమా! అందుకే ఇంకో జట్టును తెచ్చుకుంటానన్నాడు. మా కార్మికుల్లో ఐక్యతవుంటే ఆ మాటంటాడా! ఏమైనా, మా మోహన్ చెప్పినట్లు యీ కూలిరేట్లలోనున్న యీ గతుకులు పూడిస్తే నేగాని, కార్మికుల్లో ఐక్యత రాదని నేను మౌనంగా పూరుకొన్నా.

పౌరుషంతో వీర్రాజు 'ఏ జట్టు చేస్తుందో తమ్మనండి!" అన్న మాట ఆ సందడిలో వినబడలేదు. ఎలాగయినా సాహుకార్లు, మాలో మాకు తగువులు పెట్టడానికే ఎప్పుడూ చూస్తుంటారు కదండీ!

సరే సాహుకారు అన్నమాటకు మేస్త్రి ఏమంటాడా! అని ఎదురు చూసాను' సీళ్ళు నములుతూ _

"ఏమో మావాళ్ళంగీకరించడంలేదండీ." అన్నారు సూరన్న లేచి —

"ఎగుడు, దిగుడు మోతలయినా వేయకపోతే ఎలా చెప్పండి!' అన్నారు,

శేషగిరిరావుగారు అందుకొని –

"పని కొంచమైనా కూలి మీ ఇష్టంవచ్చినట్లు వేయాలన్నమాట. రివాజు ఇంతే,' అని మా సాహుకారును సమర్థిస్తూ మాట్లాడాడు. వీడి కిక అది సమర్థించడంకాదు రెచ్చగొట్టడం.

ఇక నేను షావుకార్ల మాటలు సహించలేకపోయాను. "రివాజు ఎవడు పెడితే వచ్చింది. రివాజు! నోటికి ముద్దలతకుండా, కట్టుకట్టే యీ రివాజులు పోయి ఒక పద్ధతి ఏర్పడాల్సిందే.' అనుకున్నా. నేను అర్థంచేసుకున్నదేమిటంటే. యీ వర్తకులు వాళ్ళలో వాళ్ళకు ఎన్ని తగువులున్నా స్వార్థులు. అంతా ఏకమే. అని.

"అవును. సూరన్నగారన్న కూలి ఇవ్వాల్సిందే' అన్నా. అప్పటికే జట్టు అందరితో ఏకాభిప్రాయంకలిగింది.

శేషగిరిరావు తన వెనుకటి లోకువను ఆధారం చేసుకొని. తేలికగా తేలిపోయాడు – కుళ్ళిపోయిన చేప గోదావరిలో తేలినట్టు – అన్నాడు గండా!

మీ బాబు సొమ్మేం లేదిక్కడ.'

మిగిలిన వాళ్ళంతా ఒక్కసారిగా తగులుకున్నారు.

"వూ!" వీళ్ళ బాబుల కష్టార్జితమే వుందిక్కడ!' అని వ్యంగ్యంగా ఒకడన్నాడు.

"మిమ్మల్ని ఎవరు మాటలాడమన్నారిక్కడ?" అని ఇంకొకతన్నాడు మొత్తంమీద ఊపిరిసలపకుండా, తలకొక మాట విసిరేసరికి శేషగిరిరావు గారికి మా కూలోళ్ళ మీద తెల్పినట్టుంది. ఏమైనా కాలేకడుపులు వుండే గుండెలు ఏకమైతే, వీళ్ళు ఎన్ని కుట్రలు పన్నితే మాత్రం కూలోళ్ళ దగ్గర కుదురుతాయండీ? ఏదో గౌరవం దక్కించుకోడానికి –

"మీరూ మీరూ చూసుకోండి నాకెందుకొచ్చిన గొడవ?" అంటూ లేచి వెళ్ళిపోయాడు. పాపం శేషగిరిరావుగారు కోతుల తగువు తీర్చడానికి వచ్చినట్టు వచ్చారు. మేమేం కోతులం కాదుగా.

ఆఖరికి మా పొత్తికి సాహుకారు తట్టుకోలేక, ఎగు, దిగు మోతలు వేసి, కూలి ఇచ్చేసారు. అదయినా తెగేవరకూ సాగదీస్తే లాభం లేదని మేం మౌనం దాల్చేంలెండి.

నాకు యీ గొడవలో సంతోషించదగ్గ విషయం ఏం కనబడిందంటే సాహుకార్లకు దాసుడయిన సూరన్నకూడా కలిసొచ్చేడు. పొట్ట సమస్య వస్తే ఎవరయినా ఏకం కావల్సిందే కదండీ.

నాకు ఆకలి దహించుకుపోతోంది. మోహన్ కూడా రాలేదు. మంగి కోసం తేలేదు. ఈ రెండూ నాకు అంతోటవిగానే వున్నాయి. హృదయాన్ని తపనకు హోటలువాడికి డబ్బులు ఇచ్చివేసి, ఇంటి త్రోవ పట్టాను.

మా ఇట్టు కుర్రోళ్ళంతా నాకూడా పడ్డారు.

'పెత్తందు పీకేస్తేనే గాని లాభంలేదు నారాయణా' అన్నాడు పేరాజు.

"ఇటువంటి హోతలొస్తె - మోయం అవి చెప్పేయడమే" అని ఇంకొకడన్నాడు.

తన యౌవ్వనమంతా యీ వర్తకులకు దారపోసి. ముసలి తల్లి చంద్రుడవయినా రక్షించుకోలేకపోతున్నామే. అర్ధాకలితోనే కృంగిపో వలసి వస్తుందే: అప్పులు మోపైపోతున్నాయే: అని బాధపడుతూ. అంటున్న నా సోదరుల ముఖాలు చూచి నాకు జాలికలిగింది. అంత గట్టిగా వాళ్ళు తేల్చుకోవాలంటున్నారంటే. వాళ్ళ బాధలే వాళ్ళను తెగించేలా చేస్తున్నా యని గ్రహించాను. నాకు యీ మేస్త్రీలమీద సాహుకార్లమీద వొళ్ళు మండిపోయింది. కాని ఏంచేస్తాం: సమయం వచ్చిందాకా: నేనన్నా వాళ్ళతో-

"ఈ వేడి అందరికీ పుట్టాలిగా. అసలు జబ్బు. యీ మేస్త్రీం తోనే పోదు. ఒక పద్ధతిలో కూలిరేట్లు నిర్ణయించాలి. ఆదివారం కూలి గొడవ తేల్చుకోవాలి. ఒకటా: వీళ్ళను కమిటీనుండి తీసేస్తేనే సరిపోదు. జట్లులో మేస్త్రీలను కూడా తగ్గిస్తెనే. వీళ్ళను పూర్తిగా. పునాదులు కదిలించగలుగుతాం' అని అటూండగా వీరాస్త్రిజు అడ్డొచ్చి -

"మన జట్టులో ఎంతసేపు పీకేయాలి మన మేస్త్రీని:" అన్నాడు.

నేను కాస్త సముదాయిస్తూ -

"వీరాస్త్రిజూ. మనం వొక్కరం చేస్తె సరిపోదు. ఇది అధితి మొత్తం మీద అన్ని జట్లలోను జరగాలి. ఇంతకీ త్వరగా ఎన్నికలు జరిపి ముందు కమిటీలో వీళ్ళ పని పట్టి. కూలి రేట్లు విశాదంకూడా తేల్చుకుంటే తరు వాత చూడొచ్చును."

"అయితే ఇంతకీ ఎన్నికలెప్పుడు ?"

"అది మన ప్రచారం మీద వుంటుంది. పీర్నాజా, జనం నిద్రాహారాలు మానయినా సరే, ఎంత త్వరగా ప్రచారం పూర్తిచేస్తే అప్పుడే జరిపెయ్యొచ్చు." అన్నా.

"ఏదో త్వరగా తేల్చేయ్యాలసిందే. ఈసారి వీళ్ళను ఎవడెన్నుకుంటాడో చూస్తాం. సరే వెళతాం.' అని వాళ్ళంతా వెళ్ళిపోయారు. నేనూ "తేల్చుకోవలసిందే' అని వెళ్ళిపోయాను.

## 33

నేను యింటికి వెళ్ళేటప్పటికి యిల్లంతా గందరగోళంగా వుంది. మంగి పిల్లవాడ్ని భుజాలపై ఎత్తుకొని, పాలిస్తూ అరుగుమీద అటూ, ఇటూ త్రిప్పుతోంది. మంగి భుజాలపై పిల్లవాడు తలవ్రేలాడేశాడు. తీరా - ముఖం చూస్తే తెల్లగుడ్లు కనబడుతున్నాయి. నాకు కంగారెక్కువై పోయింది.

నేను రావటం చూసి, మంగి ఇంటిలోకి చూస్తూ -

"అమ్మా! అయనొస్తున్నారే.' అంది.

నేను సరిగ్గా గుమ్మం ఎక్కేటప్పటికి మా అత్తగారు ఎదురుగా వచ్చి -

"యీ బుట్ట చెరువు గట్టుపై పారేసిరా నారాయణా' అని దీనంగా అంది.

ఆ బుట్ట ఏమిటోకూడా నేను అడగలేదు. ఎలా అడగమన్నారు చెప్పండి! ఎంతో పిచారంగా వున్నారు. మా అత్త, మంగినూ. నేను మా అత్త ఏమీ మాట్లాడలేదు.

తీరా బుట్ట చూస్తే, ఆ బుట్టలో పీక తెగ్గోసిన కోడిపిల్ల మూడు విమ్మకాయలూ, ఆయిదు రాగి కాసులూ, పసుపూ నలుపూ అన్నంముద్దలూ వున్నాయి నాకు ఆశ్చర్యమేసింది. మా అత్త లోపలికెళ్ళగానే నేను మంగిని అడిగా.

"ఇదేమిటి?"

"పిల్లవాడిపై అముండ పడింది." అని బాధతో అంది మంగి.

నాకింకా ఆశ్చర్యమేసింది.

"ఏముండ?"

"ఇంకేముంది? మొన్న చచ్చిందిగా గొడ్రాలిముండ?' అంది కోపంగా, పండ్లు కొరుకుతూ.

నేను విభ్రాంతుడనయ్యా చచ్చిన ముండేమిటి? పడటం ఏమిటో? అని.

"అదిగో! దొడ్డిలో చింత చెట్టుపై వుందట ఆ లంజ. వెధవ లంజ చెప్పుచ్చుకు కొట్టాలి - లంజని" అని తిట్టింది.

నాకిప్పుడర్థమైంది. మా పిల్లవాడిపై గాలివాలిందని. ఏదో "దెయ్యం" అంటారుగాని, నేనెప్పుడూ, యీ దెయ్యాలను చూడనేలేదు. ఏమో పెద్దలు చెప్పింది నిజారికే పోతుందా? అనే అనుమానం మాత్రం నన్ను పీకులాడింది.

ఇంతకీ నా కొడుకు ఆరోగ్యం బాగు కావాలి. పట్టి గొడ్డురాలయితే. పిల్లల్ని తిట్టుకొని, వేపించుకు తింటుందిగాని, పిల్లలున్నవారికి. కొడుకు ఆరోగ్యం కంటే కావలసిందేముంది, చెప్పండి? అందులోనూ. పిల్లలు లేనివాడికి కార్తీక్యం కూడా పెరుగుతుంది కాదండీ? ఫలవృక్షానికి పండు లేకపోతే ఎంతో, సంసారానికి పిల్లవాడు లేకపోతే అంతేగా. ఏదో భగవంతుడి దయవల్ల నా పిల్లోడి ఆరోగ్యం బాగుపడితే అదే చాలు. ఎన్ని బుట్టలయినా పారేస్తాను. అందులోనూ పెద్దలు 'అపుత్రస్య గృహం శూన్యం' అన్నారుగా. నిజం చెప్పొద్దూ, నేను ఇంటికి వచ్చేటప్పటికి తప్పటడుగులు వేసుకుంటూ, "తాల్లా తాల్లా" అంటూ, నా కౌగిలిలోకి ఒరవడిగా వచ్చి. తన చిరునవ్వుతో, నా ఆయాసాన్ని తీర్చే బిడ్డ ఆరోగ్యం కంటే నాకెక్కువ కావలసిందేమిటి చెప్పండి?

బుట్ట పట్టుకొని గుమ్మం దిగాను. నాకు ఎలక్ట్రిక్ స్తంభం అంత దూరంలో మోహన్ ఎదురయ్యాడు. ఇటువంటి మూర్ఖపు పనులు చూస్తే మోహనరావుగారు, తిడతారని నాకు తెలుసు. అందుకే గబగబా రోడ్డుదాటి చెరువు గట్టుపైనున్న వటవృక్షాన్ని సమీపించాను.

చిటికెలో ఆయనకూడా సమీపించాడు. దూరంనుంచే - "ఏమిటది?" అన్నాడు.

"వస్తా. పదండి. ఇంటికాడ ఎవరూ లేరుతే" అన్నాను — నేను కంగారుగా.

ఇంతలో అతను దగ్గరగా వచ్చి.

"ఇద్దరం కలిసే వెళదాం" అన్నాడు.

"సరే' అని గబగబా, ఆ మర్రిచెట్టు తొర్రలో బుట్ట పెట్టి. కాళ్ళు కడుక్కోడానికి చెరువులోకి దిగుతుండగా, దగ్గరకు వచ్చి అన్నాడు— మళ్ళీ.

"ఏమిటది?'

నేనేం మాట్లాడలేదు. అది బుట్ట అని మాత్రం మోహన్‌కు తెలుసు. ఎలాగంటారా? నేను ఆ తొర్రలో పెట్టడం చూశాడు. కాని అందులో ఏముందో తెలియదు. అయిన నేనేదో సంసారం పని శ్రద్ధగా చేస్తున్నాననుకున్నట్టున్నాడు మళ్ళీ చిరునవ్వుతో అన్నాడు

"ఏం నీతో సంసారం బాగా వేళ్ళు తన్నుకున్నట్టుందే?'

నేను కాళ్ళు కడుక్కోడానికి రేవులోకి వెళ్తూ ఉండటంవలన ఆయన నా విషాద ముఖాన్ని కనిపెట్టలేదు. నేను వెంటనే సమాధానం చెప్పకుండానే కాళ్ళు కడుక్కొని బయటకు వచ్చి. బుర్ర వొంచుకుంటూ, ఆయన మాటకు సమాధానంగా నా బొటనవేళ్ళు, తేమగానున్న, ఆ చెరువు వొడ్డు నేలలో గుచ్చాను. నాతో సంసారం ఎంత లోతుగా వేళ్ళు తన్నిందో ఆయనకు నా చర్య వలన అర్థమయ్యే వుంటుందనుకుంటా. నిరాశ వదనాన్ని ఆయన కనిపెట్టి —

"ఏం నిరాశగా వున్నావు? ఆ బుట్ట ఏమిటి?' అన్నాడు.

"పిల్లవాడి మీద గాలిపడిందట'

"ఎవరయినా చెప్పారా? నీవు చూశావా?" ఆత్రుతతో, కోపంగా నా ముఖం మీదకి ముఖం పెట్టి అన్నాడు. ఆ మాటలలో ప్రేమలోనుండి వుద్భవించే కోపం మాత్రమే బయటకొచ్చింది. కేకలేస్తాడని నేనన్నా? —

"మంగి, మా అత్త కూడా అంది"

"ఈ ఆడవాళ్ళతో మా చెడ్డ చిక్కులున్నాయి. వీళ్ళకు తెలీదు చెప్పితే వినరు. పిచ్చివాడా? నీకయినా తెలీదూ. దెయ్యాలు భూతాలు తప్ప మరేంటి చెప్పు?.... పద పద యింటికి అసలు విషయాలేమిటో తెలుసుకుందాం" ఇద్దరం యింటికి వెళ్ళాం. కాస్త మసక చీకటి పడిందప్పటికే, ఎవరూ మోహన్‌రావుగారి జాడ కనిపెట్టలేదు లెండి. ఇంటిలోకి వెళ్ళిపోయాం.

మా అత్తగార్ని కూర్చోబెట్టి అసలు విషయమంతా అడిగారు. నాకయితే చెప్పడులెండి. మోహనరావుగారికి మొగమాటం వలన అంతా చెప్పింది. నేను పనిలోకి వెళ్ళాక రెండు తులాల రస కర్పూరం వేయడం సాధుగారి విభూతి, సోది చెప్పడం, ఆఖరుకు దిష్టి తీయించడం వరకూ జరిగిందంతా చెప్పింది. మోహనరావుగారు ఎంతో బాధపడుతూ చెప్పేరు.

"ఇదంతా వట్టి పిచ్చమ్మా! రెండు తులాలు కర్పూరం వేస్తే పెద్దవాళ్ళు సహితం భరించలేరే. పిల్లవాడికా వేయడం? మన వాళ్లు ఇలాగె పిల్లల్ని చంపుతారు. అంత విరోచనం కాకపోతే, ఆముదం పట్టకూడదూ హాస్పిటల్‌కు తీసుకెళ్ళకూడదా!' అని ఎంతో నొచ్చుకొని. నాకు ఒక చీటి ఇచ్చి, అర్జంటుగా పెద్ద స్టేషన్ వద్దకి వెళ్ళి డాక్టరును తీసుకు రమ్మన్నారు.

మోహన్‌రావుగారిచ్చిన ఉత్తరం డాక్టరుగారికి చూపించగానే ఆయన మరుక్షణం బయలుదేరి నాతోనే వచ్చేసారు. అలా వెంటనే వచ్చే డాక్టర్లు బహు అరుదు చూడండి. అందులోనూ ఒక్కొక్క డాక్టరు, దక్షిణం

మందు వెళ్లిస్తేనేగాని రానే రాదు. నాకు చాలా సంతోషమైం. అంత దూరంనుండి, నా కష్టాన్ని అసలు పరిమాణాన్ని గుర్తించి వచ్చిన డాక్టరుగారిని ఎంతైనా లోలోన మెచ్చుకున్నాను.

ఆయన వచ్చి, పిల్లవాడ్ని చూడగానే మోహన్ ఏమైతే చెప్పాడో అదే చెప్పాడు. పైగా రసకర్పూరం ఎంత శక్తివంతమైన వస్తువో మాకు కండ్లారా నిదర్శనపూర్వకముగా చూపించాడు కూడా. ఆయన ఎంతో వ్యధతో అన్నాడు గండా:

'ఆ రసకర్పూరం వలన జీర్ణకోశం అంతా పచ్చిపుండు అయిపోయి తిండిపడక, నీరసపడి, తల[illegible]తేసి, గ్రుడ్లు తేలేస్తే దెయ్యం అనుకున్నారు. యీ బైరాగులు ఇటువంటి అనుమానాల్ని, భూతాలుగా చిత్రించి, పిల్లల జీవితాల్ని నాశనం చేస్తారు," అని మందిచ్చాడు.

నామీద చిరబురలాడిన మా అత్తగారు డాక్టరు చివాట్లు పెడుతూంటే నోరెత్త లేదు. కాని పెదవులు మాత్రం విరిచింది. అంతేకదండీ? - యీ బాంధవులతో - ఎంత తలకాయ మెరిస్తే అంత పెద్ద డాక్టరు.

తెల్లవారాక పిల్లవాడు తేరుకున్నాడు. యీ మందు వలననే అని మా అత్తకు నమ్మకం లేదు. నేనూ - మంగి నమ్మేం. మోహన్ చెప్పినట్లు యీ భూతాలు పట్టి భ్రమలే అనుకున్నా.

మరునాడు ఆదివారం, నేను యింటి వద్దనే వుండిపోయాను. నాకు మోహన్ ఎన్నో రాజకీయ విషయాలు బోధించడం మొదలెట్టాడు. ఇంతలోకే మా బాబు దగ్గరనుండి కబురు వచ్చింది.

'కాస్సేపు పడుకోండి. నేను సంఘం ఆఫీసుకు వెళ్ళి, వచ్చే వారం ఎన్నికల గురించి కుర్రాళ్ళకు చెబుతా." నాకు అనుకున్నప్పుడు ఆ పని పూర్తి కాకపోతే ఏమిటో అదో బెడదగా వుంటుందిలెండి.

"కూర్చో, తొందరేమిటి," అన్నాడు మోహన్. ఏదో వుంది లేకపోతే సంఘం పని గురించి వెళ్తానంటే ఎందుకు ఆపుచేస్తాడా? అనుకుని కూర్చున్నా.

సంచిలోంచి ఏదో ఉత్తరం తీసి, "ఇది చదువు!" అని నా చేతికి ఇచ్చాడు.

చదవటం మొదలుపెట్టాను.

"మోహన్! ... అని మాత్రమే సంబోధించి వుంది' అన్నా నేను ఎందుకు నాకు అనుమానం వచ్చిందంటారా? ఆ ఉత్తరం వసు వ్రాసింది. ఒక ప్రేమికురాలినుండి వచ్చిన ఉత్తరం "ప్రియా' అనో, "ప్రియమైన' అనో, సంబోధిస్తూ వుండొద్దండీ? అదే నా అనుమానం.

మోహన్ అన్నాడు.

"ముందు చదువు.'

మళ్ళీ చదవటం మొదలుపెట్టాను.

"నీ ఉత్తరం అమృతభాండంలా అనుకున్నా.... తీరా విప్పి చదువుతూంటే. నీ ఉత్తరంలోని, షరతులు అని చూచి, నా హృదయం కంపించింది. దీర్ఘ విశ్వాసంతో వుత్తరాన్ని మడిచి ఆలోచించా. నాకెంత పేపూ ఆ వుత్తరం. నవనీతాన్ని తాకుతున్న అగ్నిజ్వాలగా కనబడింది

నాకింక ఆలోచన తట్టలేదు. రవికి చూపించా. అది చూచిన రవి "మోహన్ అరెస్టు అయితే నీ బ్రతుకు అడవిగాచిన వెన్నలయిపోతుంది. ఆలోచించుకో!' అన్నాడు. నిజమే. మోహన్. నాయీ యౌవ్వనం. మూడు పువ్వులారుకాయలుగా వికశించాలనే వాంఛిస్తున్నాను. మోహన్! మంటల మధ్యనున్న నిన్ను నేను కాకలేకపోతున్నందుకు క్షమించు.'

- "పుష్ప"

నా గుండాగిపోయింది. నిజంగా యిది చదివి మోహన్ ఎంత బాధ పడిపోయాడో! నేను కోపంతో అన్నా!

"చూచారా! ధనికుల మాటలన్నీ యిలాగే వుంటాయి. నమ్మించి. నూలుపోగుతో గొంతులు కోసే రకం. ఏమైనా యీ కుందనపు బొమ్మలకి హృదయముండదు చూడండి '

"బాగా అన్నావు నారాయణా. నేను ఆనాడే అనుకున్నా. నీకు జ్ఞాపకముండే ఉంటాదనుకుంటా — ప్రేమ త్యాగాన్ని కోరుతుందేగాని. స్వార్థాన్ని కోరదంటె ఉమ మౌనందాల్చింది. పైపెచ్చు నా ఉత్తరం నవనీతాన్ని కాకుతున్న అగ్నిజ్వాలలా వుందట. అసలా హృదయం నవనీతమైనట్టు. అది నవనీతం కాదు - నల్లరాయి. ఇక దానిని అంటుకునే దేమిటి! నిజంగా నారాయణా. పేదల హృదయమే నవనీతంలాంటిది ఎన్నో బోధించే నేను ఇంతలో పెడమార్గం తొక్కేను. నీవు, మొన్న అరుంధతి నన్ను రక్షించిన సందర్భంలో 'చూచారా! హృదయం యిచ్చిన అడదే ప్రాణం ఇస్తుందన్న" మాట బాణంలా నా గుండెల్లో

గుచ్చుకుంది. నేను పుస్తకాల్లోంచి ఎన్ని చదివినా, నీసానబట్టిన రత్నాల్లాంటి జీవితానుభవాలు తోసిపేయలేను. వెంటనే ఉమకు ఉత్తరం వ్రాసా. ఇది దానికి జవాబు. నారాయణా! ఇదిగో నా నిశ్చయం. నేనరుంధతినే పెండ్లాడతా." అని నా చేయి పట్టుకొని ఎంతో వొత్తిడిగా జాడించాడు.

నేను వెంటనే ఎగిరి గంతేసాను. వాడితో పిల్లవాడికి సగం పైట తొలగించి అమృత సదృశమైన తన పాలను ఇస్తున్న మంగి భుజాలు పట్టుకొని —

"మోహన్ అరుంధతిని పెండ్లాడుతున్నాడు తెలుసా! అన్నా.

ముందు "అబ్బ! మంచిబెద్దాలేదు." అని సిగ్గుతో, పాలతో పొంగిన రొమ్ములపైకి పైట సర్దుకోబోతున్న మంగి, 'నిజమే నిజమే.'' అని పిల్లవాడ్ని భుజాలపై వేసుకొని, మోహన్ దగ్గరకు వచ్చి —

"నిజమే. ఒట్టేయండీ." అని ఆతురతతో అంది.

"ఒట్టేమిటి? యదార్థంగా చెబుతున్నా.' అన్నాడు నవ్వుతూ మోహన్.

మా మంగికి ఒట్టు వేయించుకోవడం సరదాలెండి! అన్నా నేను నవ్వుతూ.

మరి మీ బాబు వాళ్ళు ఒప్పుకోవద్దూ."

"బాబూ, అమ్మనూ ఎప్పుడో వొదులుకున్నా. అందరినీ వొదులుకున్నా. ఒక్క ముక్కలో చెప్పాలంటే, నా సమస్త కుటుంబం యీ పేద ప్రజలే మంగి' అన్నాడు మోహన్, జాలిగా మంగి ముఖాన్ని చూస్తూ. ఆ మాటలు, మమ్ములిద్దరినీ తన్మయం చేసాయి.

# 35

రేపే ఆదివారం. ఎన్నికలకు ఏర్పాట్లు చాలా గొప్పగా చేసేం లెండి. సంఘం పెట్టిన పదేండ్లకు ఇదే మొదటి సభేమో — చాలా ఆట్టహాసంగా చేసాం. ప్రవేశపెట్టదలచుకున్నవి రెండే తీర్మానాలు. కూలీ రేట్ల పట్టిక ఒకటి. ఆదివారం సెలవుకూలి ఒకటి అంతే. కూలిరేట్లు అందరితో ఆలోచించి మోహనరావుగారే తయారుచేసి యిచ్చారు. ఉదా: మామిజాతి. బూరుగు. పనస మొదలైన అన్ని రకాల కలపలకు చక్కగా కుదిరేలా ఉన్నాయా రేట్లు ఆ పట్టిక చూస్తే. ఇక కార్మికులలో కూలి రేట్లలో తగవులు రావడం సాహుకార్లు చీల్చేయడం ఇటువంటివేమీ జరుగనే జరుగవు. అది అమలుజరుగుతే కార్మికులలో మంచి ఐక్యత ఏర్పడుతుందనుకోండి. ఇక ఆదివారం సెలవు కూలి — గవర్నమెంటు కూడా అంగీకరించి చట్టంచేసిందే. — ఇంకా చాలా సమస్యలున్నాయిగాని నిచ్చెన ఎక్కినట్టు ఒక్కొక్క మెట్టు ఎక్కాలి తప్ప. ఒక్కసారే ఎగిరి దామంటే లాభం లేదు కదండీ! అన్నిటికంటే చిక్కు సమస్య కొత్త ఎన్నికలు, ఎన్నికల సమస్య వుండే. చాలా కష్టం. మేము తయారుచేసిన జాబితాలో ఇద్దరు మేస్త్రీలు, సూరన్న పేర్లు తప్ప తక్కిన మేస్త్రీల పేర్లు లేనే లేవు ముఖ్యంగా జాబితాలో భీమయ్య పేరు లేదు. ఆ ఇద్దరు మేస్త్రీలనయినా ఎందుకేశామంటారా? ఏదో అందరినీ తృప్తిపర్చాలని. ముక్కుకు సూటిగాపోతే లాభంలేదుగామరి. అందులోనూ, పుట్టెడు సంసారం నెత్తిమీద వుంది, కష్టపడినా కాలంగడవని మేస్త్రీలు

న్నారుకదండీ — వాళ్ళను వేసుకోకం వలన నష్టంలేదు. ఇక సూరన్న అంటారా? నిజానికి అతన్ని తగ్గి చేయవలసిందే. కాని మోహనరావు గారు అన్నారు గదా!

“అతడు పెద్ద సంసారం వున్నవాడే. పి.తోపాటు కొమ్ము భుజాన వేసుకొని మోసేవాడే. పొట్ట సమస్య వచ్చినప్పుడు ఏకంకాకుండాపోడు. ఒకవేళ అతను కాంగ్రెసు అని తీసివేస్తామనుకో, అతని వెనకనున్న జనాన్ని చూడొద్దా!”అన్నాడు.

నేను మాత్రం దీనికి ముందు అంగీకరించలేదు సుమండీ. ఎందుకంటారా? ఏదో సూరన్న ఒకదానిలో కలిసొచ్చినా అదయినా నా నెత్తిమీదకు వచ్చిన సమస్య కాబట్టి కలిసొచ్చాడు. లేకపోతే ఎన్ని విషయాలలో యితను సహాకార్ల పెంపుడు బిడ్డలా ప్రవర్తించలేదూ? అదీగాక పోయినా. అతని వెనుక జనాన్ని చూడమంటాడుగందా? ఆ లెక్కన చూస్తే. భీమయ్యకు ఇతర మేస్త్రీలకు మాత్రం వెనుక జనంలేరూ, అలాగంటే మోహనరావు ఏమన్నాడో తెలుసా?

“భీమయ్యలాంటి మేస్త్రీలకూ, సూరన్నకూ సంబంధంలేదు. కార్మికులందరిలో యీ మేస్త్రీలపై చాలాకాలంగా అసహ్యం వుంది. కాని నోరెత్తి మాట్లాడలేకపోతున్నారు. సూరన్నపై అలాగుండానురి.”

“సరేలెండి.” అని నేను బలవంతంగా అంగీకరించాను.

మోహనరావుగారికి బలవంతంగా ఒప్పించడం అంటే అయిష్టం అంచేత నన్నెలాగయినా ఒప్పించాలని మళ్ళీ అన్నాడు.

"మనం అతని వెనుక జనాన్ని చూడాలి. మీ జట్టులో మాత్రమే అతనిపై వున్న ద్వేషాన్ని చూడకూడదు. అందులోనూ ట్రేడుయూనియన్ ఒకరి సొత్తుగా వుండకూడదు. ఐక్య సంఘాన్ని మనం నిర్మించాలంటే, కాంగ్రెసు అయినంతమాత్రాన్నే అతన్ని త్రోసివేయకూడదు. అందులోనూ, నూతన్న కాంగ్రెసులో, కరుడుగట్టిన మొండిరూళ్ళకర్రి సిద్ధాంతి కాదుగా' అన్నాడు.

నా బుర్ర కిరిగింది. "సరే' అని హృదయపూర్వకంగానే అంగీకరించా.

ఏమైనా, ఆ రోజు శనివారంనాడు నేను అడితీకి వచ్చి కాస్త అభిప్రాయాలు, ముఖాలనుబట్టి సేకరిస్తే, భీమయ్యలేని జాబితా నెగ్గేలా కనబడలేదు. అందులోనూ, ఎన్నికలు వగైరాలపై ప్రచారం వేడి, వేడిగా అందుకుంటేమో? ఆవేళ పరిశీవాడూ ఎన్నికలగురించి ఆలోచించేవాడే, వాళ్ళ అభిప్రాయాలు ఎలావుండబోవ్వంది. కాని తాము తమ నాయకులను ఎన్నుకోవడంలో వాళ్ళకు పెద్ద బాధ్యత వుందనేది మా ప్రచారం వాళ్ళలో గుర్తింపచేసినందుకు. అంతేకాదు కదిల్చివేసినందుకు నాకు చాలా సంతోషంగా వుంది కాని నన్ను యీ భీమయ్య సమస్య మరీ పీడిస్తోంది, "ఎవరయినా "పెద్ద" ఆఫీసునుంచి వచ్చి, రేపు వార్షికోత్సవంలో మాట్లాడితే బాగుండు"ననిపించింది నాకు. ఏమైనా మోహన్‌తో మాటలాడాలని బయలుదేరా! ముందు అడితీలో కుర్రాళ్ళందరికీ ఇంకోసారి ప్రచారం చేయమని హెచ్చరించి మరీ బయలుదేరాను.

మోహన్ ఇప్పుడెక్కడ దొరుకుతాడు? అతను ఒక ప్రాంతంలో దొరుకుతాడా? ఏమైనా సరే, అని ఆనందరావు ఇంటికి బయలుదేరా.

నేనూ ఆనందరావు ఇంటికి వెళ్ళేసరికి, ఇంటి వద్ద, ఆనందరావు లేడు, వాళ్ళమ్మాలేదు. లోపల కేరింతాలు, కొడుతున్న శబ్దం వినబడుతోంది.

నేను లోపలికి ప్రవేశించి చూచేటప్పటికి, మోహన్ అరుంధతి చెవి పట్టుకొని నవ్వుతూ—

"హూఁ చెప్పు. ఇప్పుడు నేను చెప్పినది' అని చెవి మెలిపెడుతున్నాడు.

అరుంధతి ! 'ఈ' అని అరుస్తోంది

అబ్బ! ఎంత త్వరగా చనువు వేసుకున్నాడు. ఏముందిలెండి రెండు హృదయాలూ కలవాలిగాని. కలిస్తే ఎంతసేపండీ చనువు వేసుకోవడం? వ్రిలబడిన మనిషినల్లా గబుక్కున లోపలికి వెళ్ళా అరుంధతి సిగ్గుతో మోహన్ నుండి తప్పించుకొని, దిగ్గున మంచందిగి, నిలబడింది. ఎందుకు చెప్పకపోవాలి? నా శరీరం చివుక్కుమంది సుమండీ

"అంతా అయిపోయిందేమిటి?" అన్నా.

"అయిపోవడానికేముంది? రెండు చేతులు కలపడమేగా?" అన్నాడు మోహన్ నవ్వుతూ అతని ముఖంలో కాస్త సిగ్గు తాండవించింది. మగవాడికే సిగ్గున్నప్పుడు ఆడవాని సంగతి వేరే చెప్పాలా? అరుంధతి సిగ్గుతో అక్కడ నిలబడలేక పక్క గదిలోకి వెళ్ళిపోయి పొయ్యిదగ్గర కూర్చుంది. నేను, వాళ్ళిద్దరూ ఏదో ఆనందంగా కాలక్షేపం చేస్తుంటే. ఓపికను కోల్పోయి వాళ్ళ మనస్సులను కనిపెట్టలేక గబుక్కున లోపలికి వెళ్ళినందుకు ఎంతయినా బాధపడ్డాను. నిజంగా, కొత్తగా పెండ్లయిన

వధూవరుల మనస్సులను అందులోనూ తల్లిదండ్రులు బహుసులువుగా కలపెడతారనుకోండి. అందుకే అటువంటి తల్లి ఏ పనికి వెళ్ళని మనిషి అయినా పిళ్ళద్దతిపి, వారి ఆనందానికి వొదిలిపెట్టి ఎక్కడికోపోతుంది. నేనూ తిరిగి వెళ్ళిపోతే బాగుంటుందనుకోండి. కాని పీకలమీదికివచ్చి కూర్చున్న సమస్య నన్ను వేధిస్తుందిగా. అందుకు వెళ్ళక తప్పిందికాదు.

నేనన్నా —

"ఈ తీర్మానం నెగ్గడం కష్టం. ఎవరో మీలాంటి ముఖ్యులు వచ్చి మాటలాడాలితప్ప నాతరం గాదు."

నన్ను బహిరంగంగా ఎలా రమ్మన్నావు చెప్పు' అన్నాడు. ఆయన తీర్మానం పెట్టడం విషయంలో, నా నిజమైన కష్టాన్ని గుర్తించినట్టు జాలిగా మాటలాడాడు.

"పోనీ. ఇంకే ముఖ్యులైనా సరే." అన్నా.

ఆయన కాస్సేపు ఆలోచించి అన్నాడు.

"సరే. ఆవేళ సూర్యనారాయణ ఇంటిలో నాతో మాటలాడాడు చూశావు. — అతనిని పంపితే?"

"ఆయన బాగా మాటలాడతాడా అని. అదిగాక, ఆవేళ ఆయన మేస్త్రీలుండాలని అన్నాడుగా!'

"ఆ తిక్క యిప్పుడు తగ్గిందిలే. మొన్న ఆపరాల జట్లు సమ్మె జరిగినప్పుడు, మేస్త్రీల నాయకత్వంలోని పస తెలుసుకున్నాడు,

"సరే, పంపండి. అది వెళ్ళిపోడానికి రేపా.

మోహన్ మళ్ళా హెచ్చరించాడు.

"జాగ్రత్త. ముందు కూలిగురించి తీర్మానము పెట్టి తరువాత నూతన ఎన్నికల తీర్మానము పెట్టండి సుమా"

"సరే, నేను గదిలోంచి బైటకు వచ్చి, వంటగదిలో వంట వాండు తున్నట్టు నటించి, మా మాటలన్నీ వింటూ నిలబడ్డ అరుంధతితో ఉక్రోశంగా అన్నా.

"ఇంత నీవు మాతో మాట్లాడవుతే. పెద్ద నాయకుడ్ని వాడిలో వేసుకున్నావు. ఇంకెందుకు మాటలాడతావు,'

అరుంధతి చాలా తెలివైన పిల్లకదండీ! మరి ఏమందో చూడాం!

"అలా మాటలాడను. నేనూ నాయకురాలినై. మీరు తప్పు పనులు చేస్తూంటే చెవి పట్టుకొని మాట్లాడతాను.' అంది.

'అమ్మదొంగా'' అని వేళాకోళంగా వాట్టిచెయ్యి విసరబోయాను.

దేనితోనో కొడుతున్నాననుకున్నట్టుంది. హడలిపోయిందంటె నమ్మండి. "టక్"మని తలుపు వేసేసింది. నేను చటుక్కున వీధిలోకి వచ్చేసాను. మళ్ళీ గమ్మున తలుపుతీసుకొని బయటకొచ్చింది. నేను నోటితో బొటనవ్రేలు పెట్టుకొని నాలుగు వ్రేళ్ళూ ఆడిస్తూ, వెక్కిరించుకుంటూ వచ్చేశాను. అది చూచి విరగబడి నవ్వింది — అరుంధతి.

# 36

కండ్లు అలా మూసుకునేసరికి. ఆదివారం వచ్చేసింది. ఆవేళ ఆఫీసు మంచి కలివిడిగా వుంది. నేను ఊహించినట్లు యేమూల నుంచి చూస్తున్నా. మీటింగుకు వస్తున్న కార్మికులే. పదయ్యేసరికల్లా వెయ్యికి దాటిపోయారు. విచిత్రమేమిటంటే ఎప్పుడూ రాని ఆడకూలీలు కూడా రెండు వందలకు పైగా వచ్చారు.

కాస్సేపటికి అంతా కూర్చున్నారు. అందరి ముఖాల్లో ఏదో అశాంతి వెల్లివిరుస్తోంది. కాని కనీసం రెండు గంటలలో మీటింగు పూర్తి చేయకపోతే ఒక్కడుండడు. ఆ విషయం తెలిసే ముందు నేను లేచి. ఎకౌంట్లు చదివా—ఆ ఎకౌంట్లు సరిచేసేటప్పటికి మోహనరావుగారికి వారంరోజులు తీసుకుందనుకోండి భీమయ్య చేతిలో ఎకౌంట్లు సరిచేయడం మాటలేమిటి? అతనిష్టంవచ్చినట్టు ఖర్చుపెట్టి జమాఖర్చు వ్రాయడు యీ ఎకౌంట్లుగాని సరిగా లేకపోతే లేబరు కమీషనరు సంఘమే రద్దుచేస్తా రని యీ మేస్త్రీలకేం తెలుసు?

ఇక నేను ఎకౌంట్లు చదవగానే. గందరగోళం బయలుదేరింది. ఒక మేస్త్రీ లేచి —

"మరి గత సంవత్సరం వసూలు చేసిన డబ్బంతా ఏమయింది?" అన్నాడు.

అదిగో అప్పుడే అడుగులో హంసపాదు. నిజంగా నాకు ఆ ఎకౌంట్లు దగ్గిరుండి మోహనరావుగారు ప్రతీదీ వివరంగా

చెప్పబట్టి సరిపోయింది గాని. లేకపోతే వీళ్ళతో చట్టవంత పనిజరిగేది. నేను చెప్పా—

"బ్యాంకులో వెయ్యిరూపాయలకు పైగా వుంది.

"మరి తతిమా డబ్బో?" అన్నాడింకొకడు.

ఇంతమందిలా ప్రశ్నలేస్తుంటే బెల్లం కొట్టిన రాయిలా. శీనయ్య మాట్లాడడే వాడేమిటి. పెద్ద సంస్థానపు ఏనుగులా కూర్చున్నాడు. మామిడాకు రెమ్మలా ఆ వారి తలపాగా గ్లాస్కో వలువలార్చి. దానికి బంగారు కాసుల బొత్తాములూ. దానూ సూ — డబ్బు తూకేవాడు శీనయ్య అయినా — అంతా అనుగుతుంటే లేచి మాటలాడడే,

నేనే సమాధానం చెప్పా.

"బొంబాయి ట్రేడ్ యూనియన్ ఆఫీసుకు, బెజవాడకు కట్టిన రుసుము గత ఏడాది తోళ్ళ కార్మికుల ఇండ్లు కాలిపోయినందుకు సహాయం చేసినది.....ఇంకా ....చిల్లర ఖర్చులు... " అని నేనంటూండగానే —

"మరీ లెక్కలన్నీ మాకెందుకు చెప్పుకోవు?" అన్నాడొక కూలి.

"అంతా ఆమోదించినట్టే... తర్వాత తేల్చండి." అన్నాడు, సూరన్న. అంతా చప్పట్లు కొట్టేశారు. అమ్మయ్య ఒక గొడవ వదిలిపోయింది.

వెంటనే కూలిరేట్లు వివరాల పట్టిక వాళ్ళముందు పెట్టా. ఆ పట్టికను విపులంగా వివరించా. ఇటువంటి కూలిరేట్లకోసం ఎన్నాళ్ళనుండో కలలు కంటున్నారేమో — కార్మికులంతా సులువుగా అంగీకరించారు.

ఆదివారం సెలవు కూలి పెట్టాం దానిని వ్యతిరేకిస్తూ, ఒక అంటాడుగందా.

"పనిచేయకుండా కూలి ఎవడిస్తాడయ్యా?" అని, వాడు అచ్చంగా సాహుకార్ల పెద్దకొడుకులా మాటలాడాడనుకోండి.

ఆ ప్రశ్న వేసేసరికి, నేనింకా జవాబు చెప్పకుండానే వీర్రాజు లేచి —

"ఆదివారంనాడు పని ఎవరు చేయమన్నారయ్యా? ఇంకో రోజు కూలితో సెలవిస్తే సరి" అన్నాడు.

"గవర్నమెంటు చట్టప్రకారం, ఆదివారం అడితీలు కట్టేయవలసిందే' అన్నాడతను.

"అందుకేనోయ్. కూలి యిమ్మంటూ, ప్రభుత్వ చట్టాన్ని అమలు జరుపుతారు కాని, ప్రభుత్వమే చెప్పిన కూలి ఇవ్వరేం?" అని వీర్రాజు కేకలేసాడు. మాగట్టిగా విసిరాడులెండి ఆ రెండు మాటలూనూ దాని మీద ఇక గందరగోళం అవుతుందని పెద్దాఫీసునుండి వచ్చినాయన లేచి గవర్నమెంటు చట్టాన్ని చూపిస్తూ —

"గవర్నమెంటు ప్యాసుచేసినప్పుడు, వీళ్ళొప్పుకుంటారా? వీళ్ళ బాబొప్పుకుంటాడా?' అని బుసకొడుతూ మాటలాడాడు. ఆయన ఇప్పటి మాటలనుబట్టి, నేననుకున్నదేమిటంటారా? దురుసుతనం ఎక్కువని. ఆ బుసా మా వీర్రాజు ఇవ్వలేదండి.

మొత్తం సభ అంతా అంగీకరించారు.

"సరే, ఈ కోర్కెలు వర్తకులు నెలరోజులలోగా అంగీకరించక పోతే, సమ్మె చేస్తాము. మన కోర్కెలు నెరవేర్చుకోవాలి. చెప్పండి? ఏమంటారు?' అన్నాడాయనే

నేను ఆశ్చర్యపోయాను, తీవ్రమైన కోపం వచ్చింది కూడా. యీయనను సమ్మె గురించి ఎవరు మాట్లాడమన్నారు?

సభలో పెద్ద గొడవ బయలుదేరింది.

మేస్త్రీలంతా వ్యతిరేకించారు. అక్కడక్కడ కూర్చున్న యువకులంతా, "చట్. కుదరదు. సమ్మె చేసి తీరాల్సిందే' అన్నారు - గబగబా చప్పట్లు కొడుతూ. మొత్తం సభ ప్రతిష్టంభన ఏర్పడింది. మేస్త్రీలు భీష్మించుకూర్చున్నారు. నేను ఏదో పరిష్కారమార్గం కోసం లేచి -

"ఇప్పుడే సమ్మె చేసేస్తామనుకోకండి. షావుకార్లకు మన కోర్కెలను తెలియబరుస్తాం. అంతే తీరా వాళ్ళంగీకరించకపోతే అప్పుడు ఆలోచించుకోవచ్చు.' అన్నా. ఆయన మాటలాడిన దానికి దీనికి తేడా ఏమిటంటారా? చేసిన తప్పును పదిమందిలో చెప్పుకున్నట్టు కదండీ. నా ఉద్దేశ్యంలో అదే మంచి.

"సరే. అలా వ్రాయించి త్వరగా తేల్చేద్దురూ' అని ఓ మేస్త్రి అన్నాడు విసుగుదలతో.

'సరే. ఏమంటారు? అని. యీ దఫా చేతులెత్తమన్నా.

లేచిన చేతులు లెక్కపెట్టాం. 1100 తేలేయి. ఇక మిగిలితే రెండు వందలు అంతే.

“అమ్మయ్యా! ఇప్పటికి ఎలాగో నెగ్గేం, ఇక ముందుంది - మునక్కపండుగ. ఎన్నికల సమస్య వుంది చూసారూ? చిన్నప్పుడేసిన వొంటాకు పసరు కక్కిస్తుందనుకోండి అప్పటికే పదకుండున్నర అయిపోయింది సూర్యకిరణాలు తీవ్రమైన వేడితో గుచ్చుకుంటున్నాయి. అందరికీ చెమటలు కారుతున్నాయి

అప్పుడు ఉక్రిక్ యూనియన్ ఆఫీసునుండి వచ్చినాయన లేచి - ఎన్నికల చిత్తు జాబితా చదివి - మంచి ధాటిగా -

“ధైర్యంగా పనిచేసే యువకులు నేతలు కావాలి త్యాగంతో పనిచేసే యోధులు కావాలి అటువంటివారినే ఎన్నుకోండి' అని అరుస్తున్నాడు.

“భీమయ్యగారి పేరు లేదేం.” అన్నాడొక మేస్త్రి ఏదో భీమయ్య ఆ పక్షం మీదనుంచి పోటీపడ్డాడు, ఆ లేచినవాడు పూర్వ కమిటీలో మెంబరే అతన్ని తీసేసినా నోరెత్తలేకపోయాడు. భీమయ్యను తీసేసినందుకు పాపం కష్టంకలిగింది. అదొక నాటకంలాగుంది ఎదిరించినవాడి మొగుడు దొస్తైతే తన మొగుడూ వస్తాడనే పిచ్చి తప్ప ఇంకేమి కాదులెండి.

జాబితాలో సూరన్న పేరుంది కాబట్టి. అతను వ్యతిరేకంగా మాటలాడలేదు.

ఒక మేస్త్రి లేచి - “జాబితా బాగుంది. కాని భీమయ్యగారుండాల్సిందే” అన్నాడు.

దానిమీద గందరగోళం బయలుదేరింది.

మరి ఏమనుకున్నాడో — ఆఫీసరు మౌనం వహించాడు. అదే సమయంలో ఆఫీసు గుమస్తా సైగచేసి. లేచి బయటకు వచ్చాడు. మేమూ బయటికి వచ్చేం. ఏదో. మాతో పిచ్చాపాటీ మొదలెట్టాడు.

"ఈ ప్రభుత్వం మాట నీటిలో మూటనుకోండి. ప్రభుత్వం చట్టం చేసినా ఆచరణలో అమలుజరగవద్దని ఆర్డర్లున్నాయి. నేను ఏం చెప్పగలను? మీ శక్తినిబట్టి చూసుకోవలసిందే?' అన్నట్టుగా ఆయన భావాల్ని బట్టి అర్థంచేసుకున్నాం.

ఓసోసి. ఇదంతా ద్వారపూడి దొంగలజట్టే. ఒకడు బండిలోవి లాగితే. ఇంకొకడు వాడిలోవి. మరొకడు జేబులోవి లాగేసేకంలాగే వుంది. అన్నట్లు వెనుక మోహన్ చెప్పాడుగదండీ. అసలా వర్తకులు ప్రభుత్వం ఒకటేనని. యీ వర్తకుల లాభాలను కాపాడడానికే ప్రభుత్వం అని కూడా చెప్పేడు. అలా చెప్పినప్పుడు నాకంత సులువుగా అప్పుడర్థం కాకపోయినా యిప్పుడు బాగా అర్థమైంది.

ఇక మా వీర్రాజు త్రోవపొడుగునా నాతో ఏదో అంటూ శాపాలు మిరియాలు నూరుతూనే వున్నాడు. "అంత చేతగాని ప్రభుత్వం చట్టం ఎందుకు చేయాలి?' అని వాని పట్టువల. మేం లేబరు ఆఫీసునుండి అటీతి చేరాం.

ఓ! చూసుకోండి. అటీతి కుతకుతలాడుతూ వుడుకుతోంది. అసలే పదిరోజులనుండి వర్తకులు మిమ్ములను సమ్మెకట్టు రెచ్చగొట్టే విధానాలాలోచిస్తూనే వున్నారుగా వాళ్ళకింతకూ అంత మంటెందుకంటారా? వాళ్ళేలా చెబితే అలా గింతే మేస్త్రీలను తీసేసామని.

మేము ఆఫీసునుండి తిరిగి ఆదితీకి వెళ్ళేటప్పటికి శేషగిరిరావుగారి చుట్టూ జనం మూగివున్నారు ఇప్పుడు నాకు తెలిపింది. శేషగిరిరావుగారే ఆదితీ సంఘం ప్రెసిడెంటని. మేము ఆదితీలో అడుగు పెట్టేటప్పటికి, మాకెదురుగా చాలామంది కూలీలు వచ్చేరు. అందులో ఒకడన్నాడు.

"అదిగో. మేస్త్రీలను తీసికెళ్ళి మాయంచేస్తున్నారు. సంఘం తరఫున నీవెళ్ళి. ఏదైనా సరే వాళ్ళతో సంప్రదించడానికి వీలులేదని చెప్పు' అన్నాడు.

అ॥ నేననుకున్నట్లే జరిగింది. మేము ఎలాగూ రెచ్చిపోతామని మేస్త్రీలను పిలిచి సంఘాన్ని కాలదన్నారు. సరే ఫలితం ఎలావుంటుందో నని అనుకుంటూనే నేను గబగబా శేషగిరిరావుగారి ఆదితీలోకివెళ్ళా—

శేషగిరిరావుగారు కండ్లెర్రజేస్తూ –

"నీకేం సంబంధంలేదు – బయటికిపో? మేస్త్రీలే యీ కూలీలకు ప్రతినిధులు. వీళ్ళతోనే ఒడంబడిక చేసుకుంటాం" అన్నాడు.

నేను నాలుక కొరుక్కున్నాను. ఎంత తప్పుచేసాను. వాళ్ళు ఎన్ని కుతంత్రాలు పన్నినా మనకేం? దూరంగా వుండవలసిందనుకున్నాను. సరే అయిపోయిందిగా.

వెంటనే నా వెనుకనున్న కూలీలు ముందుకు వచ్చి. యీ పరాశ వానికి పుగుర్రలు మోయి —

"నాతాయనే మా ప్రతినిధి అతనితోనే మాటలాడాలి." అన్నారు. నా శరీరం పొంగింది. నా వెంట్రుకలు నిక్కబొడిచాయి. ముందుకు వెళ్ళడమే మంచిదనుకున్నా. లేకపోతే. యీ వర్తకుల పొగరుమోతుతనం

కూలీలకు ఎలా అర్థమయ్యేదిమరి? అహా! యింత గౌరవంగా చూడబడు తున్న నాయకుడిని, కూలీలకు ద్రోహం చేయాలని ఎలా బుద్ధిపుడు తుంది చెప్పండి

బయట మా వీరాౖజు అల్లరి ఎక్కువై పోయింది. నేనింకా శేష గిరిరావుగారి అడితితోనే వున్నా. వీరాౖజు కేకలు బయట వినబడు తున్నాయి. తిరా ముఖం ఎత్తి బయటకు చూస్తే పనులన్నీ కట్టేసి. యీ గొడవేమిటో చూద్దామని కూలీలంతా వచ్చేసి రోడ్డు క్రిక్కిరిసి పోయారు.

'మనం ఎన్నుకున్న వ్యక్తినన్నా? సంఘాన్నన్నా. ఒక్కటే. శేష గిరిరావుగారు నారాయణను అగౌరపరచటమంటె, రెండువేలమంది కూలీలమైన మనలను చెప్పుతో కొట్టి ధాకించి చేశారన్నమాట. వచ్చే యండి. పోదాం. ఆ మేస్త్రీలతోనే పనిచేయించుకోనివ్వండి మనం శేష గిరిరావుగారిచే బూతులు తినడానికి ఆపిసీతిపరులమేంకాదు పదండి ' అంటు న్నాడు వీరాౖజు. వాడికి అరికాలుమంట నెత్తికెక్కిపోయింది. వాడు బయట మాటలాడుతుంటే, యీ అవమానానికి ఆ చుట్టూ వున్న కూలీలకే గాక. నాకు కూడా ఘుద్రేకం వచ్చేసింది. దేనికన్నా ఓర్పు మంచిది కదండీ. అలాగే వూరుకున్నా.

శేషగిరిరావుగారు మళ్ళీ కండ్లెర్రజేస్తూ ---

"ఇదిగో. నారాయణా! ముందు బయటికి పో. లేకపోతే యీడి పిస్తా. నా అడితిని దోపిడీ చేస్తున్నారని పోలీసులకు ఫోను చేస్తా' జాగ్రత్త." అన్నాడు.

అతని మాటలు చూస్తే నిజంగా సమ్మెకు రెచ్చగొట్టి, మేము మేస్త్రీలను తీసేసినందుకు కసితీర్చుకోవాలని, అన్న మాటలు కాకపోతే ఏమిటి చెప్పండి

ఇక నేను సహనం కోల్పోయా.

"చేయి చూద్దాం." అన్నా.

మా యిద్దరి మాటలూ విన్న బయట కూలీలు ముక్త కంఠంతో ——

"ఏమీ చూడనక్కరలేదు! రా, నారాయణా! బయటికి వచ్చేయ్. ఈయనెవరితో రాజీచేసుకుంటాడో చూద్దాం!" అని పిలిచారు.

నేనింక కూలీల గౌరవం కాపాడదలచి, "పదండి!" పోదాం." అని బయటికి వచ్చి రోడ్డుమార్గం పట్టా. నాకూడా మా అదితీ కార్మికులంతా వచ్చేసారు.

కొంచెందూరం వడిచాక నేనే నోటికి రెండు చేతులు అడ్డుపెట్టి—

"సోదరులారా! అంతా పేపరుమిల్లు మైదానంలోకి రండి. అక్కడ ఆలోచిద్దాం" అన్నా.

అంతా పేపరుమిల్లు మైదానంలోకి వచ్చేశారు. కుతకుతలాడుతున్న ఆవేశం. అంచులుదాటి పొంగిపోయింది. ఇక అక్కడ కార్మికులకు ఎవ్వరూ ఎదురు చెప్పలేదు. చెప్పేరా, వాళ్ళ కోపానికి ఆహుతి కావలసిందే. కార్మిక శక్తిని కండ్లారా చూడాలంటె. ఎవరికయినా ఇంతకంటే అవకాశం దొరకదనుకోండి.

మీటింగు మంచి అలజడిగా వుంది వీర్రాజులేచి —

"మనలను శేషగిరిరావుగారు అగౌరవపరచినందుకుగాను, అసమ్మతిగా యీవేళ పనులు మానేయాలి. క్షమాపణ ఇస్తేగాని మనం వెళ్ళకూడదు.' అన్నాడు.

అంగీకరించారు. ఆ ప్రదేశం ఏపనిపయినా చేయించే స్థితిలో వుంది. ఆ కూలీల మనస్సులను కనిపెట్టి ఎవ్వడు మాటలాడినా వాళ్ళకు నాయకుడయిపోతాడనుకోండి.

"మేము చెప్పేవరకూ ఎవ్వరూ పనుల్లోకి వెళ్ళటానికి వీల్లేదు" అన్నాను నేను.

అంతా అంగీకరించారు, సమావేశమైపోయింది. అంతా ఎవరిండ్లకు వారెళ్ళిపోయారు.

# 38

మీటింగు కాగానే మోహన్‌కోసం ఖంగారుగా పూటలంక వెళ్ళేను. అయనక్కడ లేడు. సూర్యనారాయణ ఇంటికి వెళ్ళినా లేడు. ఆతన్ని కనుక్కుంటే ప్రక్కనే వున్న మునిసిపల్ కార్మిక పేటలో వుంటాడని చెప్పగా అక్కడకు వెళ్ళేను. ఆయనక్కడ దొరికాడు.

"నమస్కారమండీ" అన్నా.

"రా, రా, కూర్చో బలే విజయాన్ని సాధించావు. రా, నీకోసమే చూస్తున్నా' అని నా వెన్నుచరిచాడాయన. ఏమిటో ఆయన విజయం అంటాడు కాని యీ పరిస్థితి తెలీదనుకున్నా.

విజయంలాగే వుంది. అంతా పనులు మానేశారు."

"ఎందుకు?' అన్నాడు ఆత్రుతతో.

విషయాలన్నీ మొదటినుండీ చెప్పాను. ఆయన ఆశ్చర్యపోయాడు. "సరే నేను అన్ని పనులూ వొదిలిపెట్టి ఇదే చూస్తా. వెంటనే మన యువకులనందరినీ దళాలువారీగా, అన్ని పేటలకూ పంపి, మన కార్మికులనందరినీ రేపు వుదయం జనరలు బాడి అని మల్లయ్య పేటకు తీసుకురా. జాగ్రత్త. ముందు కార్యక్రమం ఆలోచించడానికే అని చెప్పు. నేను కోరీలో వుంటా. అక్కడనుంచి వాళ్ళను తీసుకురావచ్చు. నా విషయంమాత్రం చెప్పవద్దు సుమా. జాగ్రత్త. పోలీసులుంటారు' అన్నాడు.

నేను వెంటనే ఒక నిముషమైనా ఆలస్యం చేయకుండా బయలుదేరాను. ఒకిపూటలో అందరినీ కలుసుకొని, మరునాటి ఉదయానికి తీసుకురావడం మాటలేమిటి? ఏమైనా పేచీమీద వున్నారు కాబట్టి వెంటనే వెళ్ళితే పని జరగొచ్చనుకుని బయలుదేరా.

ఎలాగయితే ఏం? అందరినీ వుదయానికి మల్లయ్య పేట తీసుకొచ్చేం. అక్కడనుండి నెమ్మదిగా మోహన్ చెప్పినట్టు కోరీకి తీసుకుపోయాను

కోరీలో ఒక్కొక్కసారి ఎగురుతున్న ధూళిని చూస్తుంటె ప్రపంచానికి పట్టిన త్రుప్పును దులుపుతున్నట్టుంది. ఆ భూమిని దొలుస్తున్న కూలీలను, పైనుండి చూస్తే, లోతైన కందకాల్లో వాళ్ళు నలకల్లా కనబడుతున్నారు. ఆ కూలీల నల్లటి శరీరాలు, పొడుచుకువస్తున్న రవికిరణాలను అయస్కాంతంలా ఆకర్షించుకొని నిగనిగలాడుతూ మెరిసిపోతున్నాయ్. వాళ్ల నలకల్లా కనబడుతున్నా వాళ్ళ శక్తి అపారం వాళ్ళు గునపాలకే

శక్తినంతా కేంద్రీకరించి రంధ్రాలను తవ్వి మందు దట్టించి పేల్చు స్తూంటే. క్రిందనుండి హిమపర్వతాల్లా ధీరంగా, ఠీవిగా వున్న ఆ భూశిఖరాలు. ఢనేలుమని పగిలిపోతున్నాయి. ఆ భూతాన్ని బ్రద్దలుచేసి తీసిన కంకరబండలను తునాతునకలుగా కొట్టి రాసులేస్తున్నారు — చాలా మంది కూలీలు.

మీరు గతుకులులేని రోడ్లపై పడుస్తారే? ఆ రోడ్లన్నీ యీ శ్రమజీవుల స్వేదంతో తడిపిన కంకర సముదాయాలే కాని ఆ పైపైన రోడ్లకు కారకులు — సుప్రసిద్ధ సారంగధర కొండ పరిసర ప్రాంతాలలో. లోతైన కందకాలలో. తమ రక్తాన్ని స్వేదంగా మార్చి. కూడుగుడ్డ లేక ఆ బిడ్డలతో అహో! రామచంద్రా!' అని కుమిలిపోతున్న కష్ట జీవులు అని మీరు గుర్తించరు. అప్పుడు మీరెలా చూస్తారండీ? ప్రపంచంలో అనేకులు శ్రమిస్తుంటే. కొందరు ఆనందాన్ననుభవిస్తారు. అందులో మీరొకరయితే ఎలా చూడగలరు?

కష్టజీవులైన కొందరు ఆడకూలీలు తమ చిన్న చిన్న పూరిగుడిసెలను. ఆ కోశీలలోనే కట్టుకొని. తమ ముద్దు బిడ్డలకు ఒక ప్రక్క పాలిస్తూ, నెత్తిపై సూర్యుడు అంతుశక్తితో పొడుస్తుంటె, నాలుగు తాటాకులు రెండు వెదుళ్ళు పైనేసుకొని మండుటెండలో సుత్తిపట్టి ఆ కంకర బండలను అతి ప్రయాసతో, సన్నని కాంక్రీటుగా మార్చే స్తున్నారు నిజంగా వాళ్ళు పనులు చేస్తున్నప్పుడు చూస్తుంటే. ప్రకృతినే మార్చేస్తున్నట్టు కనబడుతుంది కాదండీ మరి! అతి సుందరమని చెప్పుకోబడే.

పెద్ద పెద్ద నగరాలలోని ఎత్తైయిన కాంక్రీటు భవనాలన్నీ. యీ కాంక్రీటుతోనే కదండీ. నిర్మించబడుతుంటా.

నేను మీటింగు స్థలాన్ని చూస్తూ. ఇంకా కొంచెం పైకి వెళ్ళాను. రోడ్డు ప్రక్కనే కొన్ని పూరిగుడిసెలున్నాయి. ఒక వృద్ధ శిల్పి సుత్తీ. సేనం పట్టి. చిరుచెమటలు కారుస్తూ, రమణీయ సర్వాంగ సుందర శిల్పసముదాయాన్ని చెక్కుతూ, చేయేసినా జారిపోయేటంత సుస్నిత శిల్పాన్ని తీర్చిదిద్దుతూ. మధ్య మధ్య ఆ వృద్ధశిల్పి అంగలార్చుతున్నాడు.

మీరు. మిమ్మల్ని. నాగార్జున కొండ హంపి అజంతా ఎల్లోరా మొదలయిన శిల్పకళాక్షేత్రాలలో ముగ్ధులను చేసి. సజీవంగా చెండిచే ప్రతిమలు చూచి "ఆహా, హా, ఆంధ్రశిల్పం!" అని భుజాలు తడుము కుంటూ ఉబ్బి తబ్బిబ్బులౌతారే కాని వాటి సృష్టికి వారసుడయిన యీ వృద్ధ శ్రామిక జీవిని తలచనయినా తలచరు కాబోలు. ఆ శిల్పి శోకిస్తున్నాడు.

జనమంతా వచ్చేస్తున్నారు ఒక కందకంలో కూర్చున్న మోహన్‌ను చూసాను. మా కూలీలనందరినీ ఒక ఎత్తయిన కొండ ప్రక్క హాయి గొల్పు గాలిని. ఆహ్లాదపూరితమైన చల్లని నీడలు ఇస్తున్న పెద్ద మర్రిచెట్టుక్రింద కూర్చోపెట్టాను, తిన్నగా అక్కడికి మోహన్‌ను తీసుకొచ్చా. అంతా ఆశ్చర్యపోయారు. మోహన్ ఎక్కడనుంచి వచ్చాడో అని.

సంతోషపూరితులయిపోయారుకూడాను. నేను ముందే ముఖ్యులయిన యువకు లందరితో చెప్పడం వలన చప్పట్లు. ఏ విధమైన గొడవ లేకుండా అంతా శాంతంగా కూర్చున్నారు

ఆయన ఆ మర్రిచెట్టు మ్రానును అనుకొని వుపన్యాసం మొద లెట్టాడు.

"కాపీతుండి. కుక్కకాటుకు చెప్పుదెబ్బ. దెబ్బని దెబ్బతో తీయాలి. మన కోర్కెలన్నీ తీర్చేదాకా యీ సమ్మె కొనసాగిద్దాం.' అని హెచ్చరించాడు. వేదిమీద వున్న కార్మికులు. అ!! అంతే సమ్మె చేసినా ఫలితం కావాలి' అని చప్పట్లు కొట్టేరు ఒక అరగంట మీటింగు జరిగింది. అంతా ఉత్సా హంతో లేచిపోయారు. నేను మోహన్‌తో వెళ్ళిపోయా. ముందు సంఘం ఆఫీసుకు వచ్చి. వర్తకులకు. "కోర్కెలకోసం సమ్మె చేస్తున్నా"మని నోటీసుయిచ్చి యింటికి వెళ్ళిపోయాను.

# 39

సమ్మె ప్రారంభించి అప్పుడే అయిదురోజులయింది. పోలీసుల పైశాచిక వికటాట్టహాసం చేస్తున్నారు. అడితీలన్నింటిలో ఎక్కడచూసినా పోలీసులే ఒక్కొక్క దొంగ కూలీకి, ఒక్కొక్క పోలీసు బాయొనెట్లు తెరచిన తుపాకీలతో నిలబడి. దగ్గరవుండి పనులు చేయిస్తున్నారు. ఆ దొంగకూలీలలో చాలామందికి తాము పనిచేయడం అంటే. తమలాంటి కూలీల కడుపు కొట్టడమేనని తెలియదు. కోటిలింగాల పేటలో వున్నాడు తెండి— ఒక రౌడీ నాయకుడు కాంగ్రెసునని చెప్పుకు తిరుగుతాడు.

వాడు సాహుకార్లవద్ద లంచం తిని, కొంతమంది రౌడీ వెధవలతో వెళ్ళి చుట్టుప్రక్కలనున్న హరిజనులను లాక్కొచ్చి పనులు చేయిస్తున్నాడు. సాహుకార్లూ, యీ రౌడీవెధవలూ, అన్ని పేటలకూ, అన్ని పల్లెలకూ వెళ్ళి నానా అగచాట్లుపడితే ఆవేళ యాభై మంది వరకూ దొంగకూలీలొచ్చారంతే. అందులో ఎనమండుగురికి అప్పుడే నడుములు విరిగాయి. మోస్తున్న పలక మీదపడింది. చేతగాని పనులు చేస్తే చేతులు విరగ్గొట్టుకోవడంతప్ప ఇంకేముంది? అందులోనూ, కొత్తవాడు పనిచేయడమంటె మా అవితిలో ఉంటాడు.

దొంగకూలీల వద్ద పికెటింగుకు పంపిన యువకులనందరినీ, పోలీసులు అరెస్టు చేసేరు. ఎక్కడెక్కడ పెట్టిన బోర్డులన్నీ లారీల మీద ఎత్తుకుపోయారు. అంటె ఇక కూలోడు కొత్తదానికి వీల్లేదన్నమాట. మాటలాడితే సాహుకార్లు, అదితిలు కట్టేస్తామంటారూ? మేము కూలీకోసం సమ్మె చేస్తేనే యింత నిర్బంధమా?

నాకు పట్టుకు యీ నిర్బంధ విధానం పోలీసులను చూస్తుంటే వొళ్లు మండుకుపోతోంది. ఆవేళ మేస్త్రీలనందరినీ పోలీసులు స్టేషన్‌కు తీసుకుపోయి, సమ్మెకు కారకులయిన కూలీలను చూపెట్టమని బలవంతం చేశారు.

భీమయ్య నా పేరు చెప్పగా, మా బాబును పోలీసు ఆఫీసరు గదమాయిస్తే — మా బాబేమన్నాడనుకున్నారు? "ఆ పోకిరీ లంజాకొడుకు నా కొడుకేమిటి? వెధవ నా కొంపలోంచి ఎప్పుడో పోయాడు. వాడిక్కి నాకూ సంబంధమేలేదు." అన్నాడట.

మేస్త్రీలద్వారా తెలుసుకున్న కూలీలను పోలీసుస్టేషన్‌కు తీసుకు పోయి బాదుతున్నారు. స్థానిక కాంగ్రెసు నాయకులు. ఇంకోవైపు. యీ మేస్త్రీలనందరినీ. ఆడితీ వర్తకసంఘం ఆఫీసు ఎక్కించి —

"ఇదిగో! మీరు జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసులో చేరతాం అంటె వొదులుతాం. లేదా! మీ పని.........మరి చూసుకోండి.' అని బలవంతం చేశారు.

భీమయ్య ఏడుపు ముఖంపెట్టి — మరి తికమకలు రకంకూడా కతంటి — అన్నాడు గండా

"ఆ వెధవలంతా మాతో వుంటె యీ గొడవ అంతా ఎందుకు? ముక్కుకు తాళ్లుకట్టి చేతిలో వుంచుదును. మీరెరుగరూ యీ పదేళ్ళు ఎలాచేసానో?" అన్నాడట.

అప్పుడు కాంగ్రెసు నాయకుడన్నాడట.

"మీరయినా చేరండి.'

"ఓ! ఇంకేం తప్పకుండా చేరతాం" అన్నారట అంతా.

ఓహో, వీళ్ళ జాతీయ ట్రేడుయూనియన్ కాంగ్రెస్సంటే. యీ మేస్త్రీలు. సాహుకార్లూనూ అన్నమాట.

దొంగకూలీలు రాకుండా శతవిధాలా మేం ప్రయత్నిస్తున్నాం పికటింగు చేస్తున్న యువకులనందరినీ ఒకవైపు అరెస్టుచేస్తుంటే. ఆ పికెటింగు కార్యక్రమం ఆడితీలో లాభంలేదని ..........కొంతమంది యువకులను దళాలుగా ఏర్పరచి. పేటపేటకూ ప్రచారానికి పంపుతున్నాం.

సాహుంకార్లు ఎస్సైకెత్తుతేరారు. మరెవ్వరూ దొంగకూలీలు రాక పోతే ఏంచేస్తారుమరి. ఆ వున్న నెంబైమంది దొంగకూలీలనూ పోలీసుల కావలాతో పనికొగానే రూపం ముళ్ళులోనే పెట్టి. గొడ్రెపోంల వేటలతో తృప్తిపరుస్తూ. మళ్ళీ ప్రయాన్నే పోలీసు కావలాతో బయ టికి తెస్తున్నారు. మేము రాత్రులందు కిరపత్రాలు ఆడిల్లలోకి గుప్పి స్తున్నాం. మొత్తంమీద ఐదో రోజుకు మాదే పైచేయి.

అబ్బా! యీ సమ్మె అంటే మాటలుకాదు మమ్మండీ! నిజంగా పెండ్లిచేసిచూడు. సమ్మె చేయించిచూడు.' అన్న సామెత వూరికే పోలేదు. అందులోనూ యీ సమ్మె పెండ్లికంటె చాలా కష్టమనుకోండి. నాకు మోహనరావుగారు రెండేండ్లు నూరిపోసిన రాజకీయ విషయా లన్నీ యీ సమ్మెలో స్పష్టంగా కనబడుతున్నాయి.

వర్గపోరాటంలో పడిత జనుల సహాయంతో, కూలీలంతా మాత్రమే ఒకప్రైపువుండి పోట్లాడతారనీ. ఏదో అటూ, ఇటూ వూగిస లాడే రకంతప్ప తొంగిలిన దోపిడీ సజ్జంతా ఒకటి అవుతారని నాకు మోహన్ ఇచ్చిన పుస్తకంలో వుందికూడాను.

వూళ్ళో పరిస్థితికూడా ఇలాగే వుంది. మా సమ్మెను బలపరుస్తూ కూలి సంఘాలే ఎక్కువ ఆందోళన చేస్తున్నాయి. ఏమైనా పేదోడు పేదోడిపై సానుభూతి చూపించకపోతే ఎవడిమీద చూపిస్తాడు చెప్పండి.

# 40

చీకటి రాక్షసునిలా చేతులుచాచి నేలను ఆక్రమించింది. నేనా రాత్రి లింగంపేట బయలులో ప్రచారానికి దళాల సన్నద్ధంచేస్తున్నా. ఎవడో కార్మికద్రోహి సమాచారమందజేసి వుంటాడు — ఆ కాళరాత్రిలో కాలయముల్లా పోలీసులు ప్రత్యక్షమయ్యారు, "ధనా"మని ఆకాశంలోకి వాళ్ళు కాల్చడం — వెంటనే మా దళాలు చెదిరిపోవడం జరిగిపోయింది నేనా యాదృచ్ఛిక సంఘటననుండి తేరుకోకముందే నన్ను పోలీసులు చుట్టుముట్టేసారు, పోలీసాఫీసరు, ఎడాపెడా చెళ్ళు చెళ్ళున కొట్టాడు. జుట్టు పట్టుకొని వొంచి మెడపై మోచేతితో పొడిచాడు. ఆ ఆఫీసరును చూస్తేనే భయమేస్తుంది, వాని తలకాయ వాని భుజాలమధ్యకు దిగి పోయి నట్టుంది కండ్లు కబంధుడిలా బోరపీదున్నాయి.

"చెప్పు లంజాకొడకా నీ పేరేమిటి?' అని పండ్లు పటపటా కొరికి మళ్ళీ కొట్టాడు.

నా జీవితంలో ఎప్పుడూ ఒకడిచేత ఇంతబలవంతంగా దెబ్బలు తినలేను. ఇంకా చెప్పవలసివస్తే, నేను నలుగురిని తన్నా. నేను మొండి ఘటాన్నయినందువలన వాడు కొట్టిన దెబ్బలన్నింటినీ దులిపేసా నేనేమీ మాటలాడలేదు.

" ఎవని కొంప కొట్టడానికిరా దొంగలంజాకొడకా అర్ధరాత్రికాడ కాసేవు?" అని చేతిలోనున్న కొరడాకామాతో డొక్కలో పొడిచాడు.

నా కండ్లు తిరిగాయి. నోటమాట రాలేదు. "అమ్మ" అని రాబో తున్న మాటను పెదవులతో బలవంతంగా ఆపుచేసుకున్నా. కడుపు రెండు చేతులతో పట్టుకొని అలాగే కూర్చుండిపోయాను.

"లేరా కేటులంజాకొడకా!" అని ఇనుపనాడం వున్న బూటుతో తెన్నుమీద తన్నాడు. నేను గిరగిర తిరిగిపోయి నేలమీద పడిపోయాను.

అలా పడిపోయిన నన్ను గబగబా లారీదగ్గరకు యీడ్చుకు పోయారు. లారీలోవున్న ఒక్క పోలీసు —

"మా ప్రాణాలు తీస్తున్నారు ... లంజాకొడుకులు" అని తుపాకి మడమతో పైనుండి పొడిచాడు. అది కాస్త తప్పిపోయి కుడి పార్శ్వాన తగిలిందిగాని. లేకపోతే అమాంతంగా కన్ను పోవలసిందే. క్రిందనుండి నన్ను నలుగురు పోలీసులు లారీలోకి విసిరేసారు. నన్ను లారీలో పారవేసిన అయిదు నిముషాలకు, ఒకరినితన్నుకుంటూ తీసికొచ్చి లారీలో పారేసారు. నేను హడలిపోయాను. కొంపదీసి మోహన్ కాదుకదా! అని మరి అంత పొడుగే వున్నాడు ఇతనూనూ. మోహన్ కూడా. మాతోనే వున్నాడా పొలాల్లో. కంగారుగా ముఖాన్ని పరిశీలించటం మొదలెట్టా. ఎలక్ట్రిక్ దీపానికి కాస్త దూరంలోనే లారీ వుండటంవల్ల ఆ విద్యుత్‌కిరణాల సహాయంతో ఆ ముఖాన్ని పరిశీలించగలిగాను. అమ్మయ్య! అనుకున్నా మోహన్ కాదు. ఒక జట్టుకూలి. పాపం ఎంత గట్టిగా తన్నారో" అని విచారించా.

రాత్రి పదకొండు గంటలు. టంగ్ టంగ్ మని కొట్టబడ్డాయి. మమ్మల్ని పోలీసుస్టేషన్ ఏడు మెట్లూ ఎక్కించారు. వరండాలో నిల

బెట్టారు. అప్పటికే నా ఓపికంతా హరించిపోయింది. ఇంకా ఏంచేస్తారోనని గుండెలు బితుకు బితుకుమంటున్నాయి. నన్ను గోడకు నిలబెట్టారు.

నాకెదురుగా ఒక్క ఆఫీసరు, కాకి యూనిఫారంపై గుర్రపు జీనులా వున్న క్రాసు బెల్టును ధరించి, లావాటి శరీరంతో కూర్చున్నాడు. అతని కండ్లు ఏనుగు కండ్లలా వున్నాయి. దట్టమైన మర్కటపు వెంట్రుకలతో నిండి ముందుకు పొడుచుకొస్తున్న కనుబొమ్మల క్రిందనుండి నావైపు చురచురలాడుతూ చూచాడు. ఏనుగులాగే వాని కంటికి నేను ఓ పెద్ద బ్రహ్మరాక్షసునిలా కనబడ్డట్టున్నాను. నన్ను పట్టుకొని తెచ్చిన ఆఫీసరు వాని చెవిలో ఏం వూదాడో వాడు కుర్చీలోంచి లేచి, నా జుట్టు పట్టుకొని, కొబ్బరికాయ కొట్టినట్లు, గోడకు నా తలకాయనేసి దబ దబా బాదాడు బాదుతూ —

"తమ్మ్యూవిస్తువా?........ లంజాకొడకల్లారా. మీ రోజులు దగ్గర కొచ్చాయి ...చెప్పు? నీ పేరేమిటి?"

నాలుక తడబడలాడిస్తూ, బాధతో మూలుగుతూ —

'వా....రా....య....ణ.' అన్నా.

"పొడండి. లంజాకొడుకుల్ని?" అని పోలీసుల వొంకచూస్తూ, నా లోదవడల్లో పొడిచాడు. నేను తూలిపోయాను. చుట్టూవున్న పోలీసులు లాటిదెబ్బల వర్షం కురిపించారు. "ఎన్" మని కణతపై తగిలిన దెబ్బకు నేను పడిపోయాను. అంతే తరువాత ఏం జరిగిందో,

తెల్లవారుఝామున స్పృహవచ్చి చూచేసరికి. నా ప్రక్కనున్న జట్టుకార్మికుడు హాయిగా గుర్రుపెడుతూ నిద్రిస్తున్నాడు ఈ వికాటకవాటాల్లో.

బంధింపబడిన వ్యక్తికి ఇంత స్వేచ్ఛగా ఎలా నిద్రపట్టిందా? అని ఆశ్చర్యపోయా. నేను ఎడమప్రక్క తలత్రిప్పిచూడడంలో ఏదో నా దవడకు బల్లగా తగిలింది. తీరాచూస్తే నా శిరస్సుచుట్టూ రక్తం మడుగై పోయివుంది. తల తడిమి చేతులు చూచాను. నా తలకంటుకున్న చిక్కటి రక్తాన్నిచూచి భయకంపితుడనయిపోయాను. నా జన్మలో అంత రక్తాన్ని చూడలేదు. ఇలా ఎందుకు బాధపెడుతున్నారో? నాకర్థంకావడంలేదు. రక్తసిక్తమైన. నా అకచేతితో, నా మంగి, నా బిడ్డడు యీ నా హింసలు చూచి. కండ్లు రెండు చేతులతో మూసుకొని ఏడుస్తున్నట్టు ప్రత్యక్ష మయ్యారు. నా ధైర్యనాడుల్ని పగ్గాలపటి లాగినట్టు వెనక్కిలాగుతున్నారు చూస్తున్నకొలదీ నా శరీరంలో దడపుడుతోంది.

తెల్లవారింది. మళ్ళీ ఆ ఆఫీసరు నా ఎదట ప్రత్యక్షమయ్యాడు. నా ఎదుట వాడు భయంకర నరపిశాచంలా నిలబడ్డాడు కాపలా పోలీసు "బర్"న తలుపుతీసాడు. తియ్యడమే తడవుగా, నలుగురు పోలీసులు నన్ను బరబరా బయటికు యీడ్చేరు. కరుకుగావున్న ఆ సిమ్మెంటు నేలకు నా శరీరం కొట్టుకుపోయి, బాధపెడుతోంది. దొడ్డిలోకి తీసుకెళ్ళి మూడు బాల్చీల నీరు నా నెత్తిపై దిమ్మరించి, మళ్ళీ తీసుకొచ్చారు. కొట్టుకుపోయిన నా శరీరం భగ్గున మండిపోతోంది.

ఆ ఆఫీసరు నడుంపై రెండు చేతులు వేసుకొని కాళ్ళారజాపి ఠీరా రుగా నిలబడి అడిగేడు.

తెలిపిండా నా సంగతి? వెనుకటి ఆఫీసరునుకాను. వాళ్ళందరినీ బ్రతకాలని కొట్టేరు. నేను చావాలనే కొడతాను తెలుసా? చెప్పు నీవు కమ్యూనిస్టువేనా? అని గుడ్లెర్రచేశాడు.

కమ్యూనిస్టు అంటే ఎలాగుంటాడో నాకు తెలియదు. ఆఫీసరు అలా అడగడంతో నాకనిపించిందేమిటంటే: కూలివాళ్ళయిన నన్నే ఇలా చావతంతున్నారే? నేనే వాళ్ళకు ఇంత శత్రువయినప్పుడు, కమ్యూనిస్టు అనేవాడు వాళ్ళకు మరీ శత్రువన్నమాట. ఈ విషయం నాకెప్పుడయితే బుర్రలోకి వచ్చిందో ఏదో చెప్పి యీ కఠోర హింసాకాండ నుంచి తప్పించుకుందామనుకున్నానేగాని నోరెత్తలేకపోయాను. నా పని ముందుచూస్తే నుయ్యి, వెనుకచూస్తె గొయ్యిలాగొచ్చింది. బ్రతికుండగా ప్రాణాలు తీసేలావున్న ఆ ఆఫీసరుముందు గడగడా వణికిపోయాను. తప్పించుకునే మార్గంకోసం మండుటెండలో జలాశయం వెదకుతున్నట్టు వాయువేగంతో నా మనస్సు పరుగెడుతోంది. యీ నా మనస్సును అతివేగంతో నడుపుతున్నది. నా మనోనేత్రాలముందు, ఏకధార కన్నీటితో ఏడుస్తూ కేరింతాలుకొడుతూ "లాలా, లాలా." అని వస్తున్న నా బిడ్డడు మాత్రమే.

ఏమయితేం? "సత్యమే జయం," అన్నారుగా పెద్దలు. నిజాన్నే చెప్పేను.

"కాదు"

"కాదురా? లంజాకొడకా? పోనీ వాళ్ళతో నీకు సంబంధమేమిటి? చెప్పు, చెప్పవా? ముక్కలు ముక్కలుగా తరుగుతాను జాగ్రత్త." అని హుంకరించాడాఫీసరు,

వీళ్ళు నిజం చెప్పినా తన్నేలాటున్నారు. సత్యానికి ఎప్పుడూ కష్టాలేకదండీ కాని ఎప్పటికయినా సత్యంజయించితీరుతుందని నా నమ్మకం.

ఆ సత్యాన్ని మూటగట్టి, సప్తసముద్రాలలో పారేసినా, మళ్ళీ వొడ్డుకే చేరి కర్తవ్యాన్ని పాలిస్తుంది, ఆని ఓర్పుతో నేనం మాటలాడలేదు.

ఇంతట్లోకే ఇంకొకడు ముందుకొచ్చి —

"ఈ లంజాకొడుకు ఇలా చెబుతాడా!" అని చాచి కొట్టాడు. నేను వెంటనే నా దవడపై చెయ్యి అడ్డుపెట్టుకొన్నా. లేకపోతే పండ్లు రాలేవి. ఆ దెబ్బ ఎంత గట్టిగా కొట్టాడంటె, వాడు కొట్టి అరగజం వెనక్కి తూలిపోయాడు.

"ప్రక్కలిరగదన్నండి. వాడే చెబుతాడు" అన్నాడాఫీసరు. ఇక దానితో నా చావు మూడిందనుకున్నా.

మోకాళ్ళు, మోచేతులు, కాలికీలలు, భుజాలు వగైరా సర్వావయవాలపై ధన్ ధన్ మని కొడుతున్నారు. నేనింక పెదవులుమూసి వుండలేకపోయాను. ఆ బాధలు పశువులుకూడా భరించలేవు. సరుణ్ణి నేను ఒక లెక్కా. నాకు తెలియకుండానే నా పెదవులు పలికాయి.

'చెప్పుతా... కొట్టకండి."

"మంచిసీళ్ళన్నాడిరా పెధవకి ముందే ఏడవగూడదూ!" అని ఆ కొడుతున్న వ్యక్తి, ఆయాసంతో నిట్టూర్చి. చేతిలోని లాఠీని క్రిందకు అతిభారంతో దింపేశాడు.

మంచిపిళ్లు ఇచ్చారు. త్రాగి అన్నాను.

"అయ్యా. రక్షించండి. నా పెళ్ళాం బిడ్డల ముఖాలయినా చూచి రక్షించండి. ప్రమాణికంగా, యీ భూదేవిసాక్షిగా చెబుతున్నా. కమ్యూనిష్టులెవరో కూడా నాకు తెలీదు."

"దెబ్బలుగాని చెయ్యం అనవదూ? హుఁ' అని ఆఫీసరు బూటు కాలితో కెలుక్కుమని. గుండెలపై తన్నాడు. నేను గోడకు దాపై బోయి. "అమ్మా.' అంటూ జారిపోయాను.

ఎంత కిరాతకుడయినా, పిల్లలుగలవాడికి కాస్త జాలి అయినా ఉంటుంది. ఇవి పిల్లాపీచులేని గొడ్డురకాలు. నేనింక తేవలేకపోయాను.

నా సెల్‌తో నాతోపాటు నిద్రించిన కార్మికుడ్ని బయటికి తీసారు. పాపం. ఆ కార్మికుడు యీ నా దెబ్బలు, రక్తం చూచి అప్పటికే వొణికి పోతున్నాడు. నన్ను చూపుతూ. ఆ కార్మికుడ్ని ఆ ఆఫీసరు అడిగాడు.

"ఒరే. వీడు కమ్యూనిష్టేనా?'

"నాకు తెలీదు. కాని బాబు, మా సంఘంలో పనిచేసేవాడేనండి." అన్నాడా కూలి.

ఆఫీసరు సిబ్బంది నుద్దేశించి —

"వీళ్ళు వట్టి మరాఠీ రకాలు. పేకెలు కోసినా నిజం చెప్పరుగా?" అంటూ కార్మికుని వైపుచూచి ——

"సరిగ్గా చెప్పు లేకపోతే నీకూ ఆ గతే' అన్నాడు.

"నిజంబాబు అంతకంతే నాకు తెలీదు."

'సరే? ఈ లంజాకొడుకు నోటిలో వుచ్చపొయ్యి." అని ఆజ్ఞాపించాడు ఆఫీసరు.

ఓయి రామచంద్రా. సత్యానికి పరీక్ష ఇదా అనుకొని విభ్రాంతుడ నయ్యాను, ఆ కార్మికుడన్నాడు —

'రావటం లేదండయ్యా "

"ఇదంతా దొంగెత్తు నీళ్ళు తాగించండి లంజాకొడుక్కి" అన్నాడాఫీసరు.

ఆ కార్మికుడికి నీళ్లు తాగించి "ఏరే ఇప్పుడు పాయ్?" అన్నాడు.

"రావడం లేదండి!"

'రావడం లేదురా? ..' అని పెద్దగ ఆ కార్మికుడ్ని పళ్ళు రాలేలా కొట్టి ఒక త్రోపుతో కొట్టులో త్రోసేశారు. ఆఫీసరు పోలీసులకేదో చెప్పి వెళ్ళిపోయాడు.

వాళ్ళు మళ్ళీ నన్ను జుట్టు పట్టుకొని చేతులకు సంకెళ్లువేసి. బలవంతంగా చింతరువ్వలతో బాదడం మొదలెట్టారు.

నాకిక నరాలు పట్లు తప్పిపోయాయి. నేను అమాంతంగా క్రింద పడిపోయా, నా భార్యా పిల్లలకోసమైనా శరణందామనుకున్నా. 'రోటిలో తలదూర్చి రోకటిపోటుకెరవడం ఎందుకు?" అని మళ్ళీ ధైర్యం తెచ్చుకున్నా.

ఇక నన్ను కొట్టిన పోలీసులూ విసుగెత్తిపోయారు.

ఒక బలంగావున్న పోలీసు. నా గుండెలపై బాది తన్ని – "జాగ్రత్త. భోజనం చేసి వస్తా. చెప్పవా? బయొనెట్టుతో పొడిచేస్తాం? ఖబడ్దార్' అని ఒగురుస్తూ అన్నాడు. అంతా వెళ్ళిపోయాడు.

రాజుతున్న అగ్నిజ్వాలలు. వాయుదేవుని పవనాలను. ఇంకొక వైపు మరలి కాస్త విశ్రాంతి యిచ్చినట్లయింది. అప్పటికి మొత్తం ఏకధాటిగా పదిహేను గంటలు బాదారు. ఏమాత్రం బలహీనుడయినా వాడి ప్రాణం వుసురుమంటూ ఎగిరిపోయేది. నేనయినా ఇంకో గంటగడిస్తే

నా ప్రాణాలు ఎగిరిపోక తప్పదు ఏమో ముందు గతి ఎలాగుంటుందో? ఏమైనా ఇదొక యమలోకం. యీ యమలోకంలో ఎవరు పడినా తన భవిష్యత్తు సుఖదాయకమనుకోవడం భ్రమ. అసలు యీ బందిఖానా వుందే— కష్టపరంపరలు తప్ప ఇంకేమీ కాదు

సరిగ్గా మధ్యాహ్నం మూడయింది. నన్ను బయటికి తీశారు నా గుండె బితుకు బితుకుమని కొట్టుకుంటోంది. సంకెళ్లు తీసివేసి కారుతున్న రక్తాన్ని కడిగించేరు. అంతట్లోకే స్టేషనుముందు పోలీసులారీ ప్రత్యక్షమయ్యింది. నన్ను రెండు చేతులు పట్టుకొని లారీ ఎక్కించారు. "అమ్మయ్య." అని దీర్ఘ విశ్వాసాన్ని విడిచాను యీ బందిఖానా ఎంత కష్టపరంపరయైనా, మనిషన్న తరువాత భవిష్యత్తుపై ఆశా దృక్కులు నిగిడ్చి అవలోకించుట అసహజం కాదుగా.

# 41

నన్ను తిన్నగా సబ్‌జైలుకు తీసుకుపోయారు. సబ్‌జైలులో నాకా వేళ నిద్రపట్టలేదు. దెబ్బలేని తావేలేని నా శరీరం ఎంతో బాధ పెడుతోంది. ఆ బాధలకుతోడు ముందింకేమి చేయబోతారోననే మానసికా వేదన.

ఠక్కున తెల్లవారింది, సెంట్రీపోలీసులు టంగ్ టంగ్ మని గంటలు కొడుతున్నారు. అలా కొడుతున్న ప్రతీ గంట నాకు వాళ్ళ

గంటలా వినిపిస్తుంది. నా గుండె టక్, టక్ మని కంపిస్తూ కొట్టుకొంటోంది.

కడు శాంతంతో పదకొండో గంట వినబడింది. నేను సావధానంగా గంటలు లెక్కపెడుతూ పడుకున్నా. కిర్రున గేటు తెరచుకుంది. నా శరీరం గగుర్పొడిచింది. వార్డు పోలీసులిద్దరు భూతాల్లా ప్రత్యక్షమయ్యారు.

"రారా, బయటికిరా" అని హుంకరించాడు పోలీసు. నేను తటాలున లేచాను నోరెత్తకుండా.

వార్డరు పిల్లలుగలవాడనుకుంటాను, నా స్వరూపాన్ని చూచి అన్నాడు —

"మళ్ళీ తీసుకొస్తే జైలు బట్టలు కట్టించి తీసుకెళ్ళకూడదయ్యా" అని.

నన్ను పిలిచిన పోలీసు మెత్తబడ్డాడు. ప్రక్క పోలీసు వెంటనే అందుకొని —

"అదేం కుదరదు. ఆలస్యమైపోతుంది. తీసుకురండి" అని ఆజ్ఞాపించాడు.

నా మంగి వచ్చి యీ నా బట్టలు చూచి భయకంపితురాలై పోతుందే. బట్టలు మార్చివస్తే ఎంత బాగుండును? అనుకున్నా.

మళ్ళీ మంగి వస్తుందా? అన్న ప్రశ్న నన్ను ఎదుర్కొంది. రాదేమో? బాయొనెట్టు మొనల మధ్యనున్న వాని కోర్కెలు సఫలమౌ

తాయా? గగన కుసుమాలౌతాయా? వీటికి జవాబు నాకు బట్టలు కట్టించమన్నప్పుడు వచ్చిన సంతోషములోనూ. పోలీసు నిరాకరించినప్పుడు కలిగిన విస్పృహలోనే దొరికింది.

ఒక పిక్క వస్త్రాలతోనే నన్ను బయటికి తీసారు. నేను వాళ్ళ ముందు నడుస్తున్నానే గాని వాళ్ళెక్కడికి తీసుకువెళుతున్నారో నాకు తెలియడంలేదు. నా రెండు కళ్ళూ. నాలుగు కళ్ళకోసం వెదుకుతున్నాయ్.

యాదృచ్ఛికంగా కోర్టుముందు నా రెండు కాళ్ళూ ఆగాయి. నన్ను లోపలికి తీసుకెళ్ళి బోను ఎక్కించారు. ఇప్పుడు నా కళ్ళు కోర్టుహాలును పరీక్షిస్తున్నాయి ఎత్తయిన పీఠంమీద న్యాయాధికారి కూర్చున్నారు. ఆయన తలపై గోడకు చేతితో వ్రాసిన తరాజు వ్రేలాడుతోంది. దానిపైని సన్నని వస్త్రంలో నగ్నంగా కనబడుతున్న రాణిబొమ్మ. ఆవిడ కుడిప్రక్క గార్ధభ వర్చస్సు గలిగిన చక్రవర్తి బొమ్మగల పటం వ్రేలాడుతోంది. కుడివైపునున్న చక్రవర్తి కుడికాలి క్రింద ఆ ధర్మ కాటా. కుడి పళ్ళెం మొగ్గుచూపుతోంది.

నన్ను ఆ న్యాయాధికారి ప్రశ్నించారు.

“నీవు అడివిలో దొంగవని. మొన్న కలప దొంగతనం చేసావని నీపైన నేరమారోపించబడింది. ఏమంటావు?”

ఈ ప్రశ్న నన్ను ఆశ్చర్యచకితుణ్ణి చేసింది. ఇది అక్రమంగా మోపిన నేరం తప్ప ఇంకేమీ కాదు. నేనన్నా —

“అది అబద్ధం. నాకు ఆ నేరానికి సంబంధం లేదు.”

ఈ నేరానికి సంబంధం లేకపోతే, వెనుక దొంగతనాలు చేసే వాడివా?'

ఈ ప్రశ్న నన్ను ఆలోచనలో పెట్టింది. ఏం సమాధానం చెప్పాలో నాకర్థంకావడంలేదు. అమాయకులపై నిందారోపణ చేయడానికి యీ న్యాయాధికారులు, తమ తెలివితేటలన్నీ ఉపయోగిస్తారు.

నే ననేశాను.

“నాకు తెలీదు”

వెంటనే బయటనుంచి ఒక వ్యక్తిని పిలిపించారు. ఆ వ్యక్తి గబగబా వచ్చి, బుర్రవొంచుకుంటూ సాక్ష్యం బోనులో నిలబడ్డాడు. ఆ వ్యక్తి న్యాయాధికారి అడిగిన ప్రశ్నకు జవాబుగా —

“ఇతను నాకు తెలుసు. పెద్ద గజదొంగ” అన్నాడు.

ఆ మాటకు నేను ఏమరపాటుగా వున్నవాని భుజంతట్టినట్లు వులిక్కిపడ్డాను. నేను గజదొంగనా? ఏమిటి? నేనేం దొంగతనం చేసాను, అనుకొని తీక్షణంగా, ఆ వ్యక్తి ముఖంవైపు చూచాను. ఆ ముఖం పరిచయమైనదే, ఆ ముఖంతో నాకు ఐదేండ్ల క్రిందట పరిచయం. వాడింకెవరనుకున్నారు? వాడే — పయోముఖ విషకుంభంలా, ఆ ముఖం వాడూను. పూర్వ బాకీరేవుల్లో మూడొంతుల ఖరీదుకు రెండింతలిచ్చి నా వద్ద కలప కొన్నవాడే 'ఓరి, నమ్మకద్రోహీ' అని చీదరించుకున్నా. కోర్టు బయట వరండాపై, ఇద్దరు అడితీ వ్యాపారులు, నన్ను క్రూరహింసల పెట్టిన ఆఫీసరూ ఏవో మంతనాలు జరుపుతున్నారు, కార్మికుల సమ్మెకు

కారకుడనని కవిర్భ్యాకోనికి ఇవి పత్రికలు. పోలీసు ఆఫీసర్లు కలిపి చేసిన కుట్రలా కనబడింది. నిజానికి సమ్మెకు నేనా కారకుణ్ని? కార్మికుల కాలే కడుపులే వాళ్ళను సమ్మెకు పురిగొల్పాయి. సమ్మెకు ఒకడు కారణం అంటే నేనొప్పుకోను. ఈ ప్రపంచం ఒకరి ఇష్టాయిష్టాలతో ప్రమేయం లేకుండా గిర్రున తిరిగిపోతుంది. కార్మికుల సమ్మెలు కూడా అటువంటివే.

వాదాలన్నీ అరగంటకు నా జీవనాడుల్లోని రక్తప్రవాహాన్ని స్తంభింపజేసిన మాట విన్నాను.

"ఇతనిపై ఆరోపించబడిన నేరం నిజమైనదని నమ్ముతూ, ఆరు యేండ్ల కఠిన శిక్ష విధిస్తున్నాను."

శిక్ష, శిక్ష, కఠినశిక్ష! ఆరేండ్లు! దేనికి? దున్నపోతు యీనిందంటే, దూడను కట్టేయమన్నట్టుంది తీర్పు. నన్ను హింసలు పెట్టినవాడే నా ప్రతివాది! వాడి సాక్ష్యమా? వీళ్ళకు సపోర్టు. పత్రికలా వీళ్ళకనుకూలంగా తీర్పా? ఏమిటీ విచారణ? ఈ కోర్టు పేదలను హింసించడానికి ప్రభుత్వం చేతిలోని ఆయుధమనడానికి సందేహమేమిటి? న్యాయం గుడ్డిదా? అని కళ్ళు మూసుకున్నా. చేతులకు అరదండాలు పడ్డాయి. పోలీసులు లాగిన తరువాతగాని నా కాళ్ళు బయటపడలేదు.

మంగి గేటువద్ద తదేక దృష్టితో చూస్తోంది. మంగి ముఖం క్షణ క్షణానికి మారుతోంది. చూస్తున్నకొద్దీ దెయ్యంపట్టినదాని ముఖంలా కనబడుతోంది. నా భయంకర రూపాన్ని చూచి చంకలోని పిల్లవాడు

కెవ్వు కెవ్వున ఏడుస్తున్నా, మంగి పలికించడం లేదు. తండ్రినయిన నన్ను చూచి పిల్లవాడు "లాలా! లాలా!" అని కిలకిలా నవ్వవలసిందిపోయి ఎందుకలా ఏడుస్తున్నాడు! ముక్కుపచ్చలారని ముద్దుపాపలకు భయంకర రూపం కనబడితే ఏడవకపోతే నవ్వుతారా?

మంగి జీవచ్ఛవంలా వుంది. మంగి కన్నీటి ధారలు అవతస్థం పై నుండి క్రింద టపటపా పడుతున్నాయి, ఆ ధారలను భూదేవి కడుపారంతో దిగమింగుతోంది. మంగిని చూచి నా కండ్లలో గిరున్తిన కన్నీరు తిరిగి పోయింది. కంఠం అశ్రురుద్ధమైంది.

గద్గద కంఠంతో అరిచా.

"మంగీ, మంగీ," అని చేతులు చాచి ముందుకడుగేసా. నన్ను పోలీసులు వెనక్కిలాగారు. మంగి ఒక్కసారిగా "బేర్" మంది. నా బిడ్డడు రెక్కలు తెగిన పక్షిలా విలవిల తన్నుకున్నాడు. మళ్ళీ అడుగు ముందుకు వేయబోయాను. "టక్"మని గొలుసులు బ్రేకువేసి పక్కకు మళ్ళించాయి. నరహంతకులు, ఘొల్లుమంటున్న నా భార్యా బిడ్డల ముఖాలు చూచైనా జాలిలేని పాషండులు. నేను మంగినుద్దేశించి, తుది మాటలు చెప్పా.

"మంగీ, వెధవ ప్రపంచం. నాకయిదేండ్లు శిక్ష వేసింది. పిల్లవాడ్ని ఎలా చూస్తావో! చీకటి పక్షం రోజులే మంగి."

"ధన్"మని నా మెడమీద దెబ్బపడింది. దఫేల్మని నా కళేబరం లారీలో పడింది. లారీ తలుపులు టటాలున మూతపడ్డాయి. మంగి రోదన నా చెవుల్లో మారుమ్రోగింది. లారీ "బర్" మంటూ నా మంగి

రోదనయినా వినపించుకుండా పది నిముషాలలో సెంట్రల్ జైల్ గేటు ముందు ఆగింది. సన్నాహ్వానిస్తూ, ఇనుపకోటల కవాటాలు తెరుచుకున్నాయ్. బయటనుండి చూస్తే ఆది యమలోకంలాగే వుంది.

ఇదీ—ప్రపంచం! నన్ను నా భార్యా బిడ్డలనుండి బలవంతంగా వేరుచేసి యీ కత్తెరబోనులో వేసేసింది. పైగా నన్ను దొంగంది. కాదు! కాదు! గజదొంగనట! ఎవరు గజదొంగలు? గుండెలపై చెయ్యేసుకు చెప్పండి"

# 42

ఏం చెప్పతేరు? లేకపోతే పెద్ద మనుష్యుల్ని కూడా నేరస్థుల లిస్టులో కెక్కించి, రోజూవారీ స్టేషన్లో వస్తారేందుకునే పోలీసుల్లా నన్నింకా పరీక్షించదలుచుకున్నారా? అయితే నా తర్వాత కథ కూడా వినేసి మరీ మీరు నిర్ణయానికి రండి.

నేనలా కత్తెరబోనులో అడుగుపెట్టానో లేదో, అప్పుడే తయారు_ యమకింకరుడు వుంటారుకదండీ, జైలులో_ హెడ్ వార్డర్లు.

"రండి. రండి.' అంటూనే నాకు స్వాగతమిస్తూనే వెనుదిరిగి చూస్తూ—రావాలి. మంగలినాథ, రావాలి." అంటూ మంగలినికూడా పిలుస్తున్నాడు. నేనాశ్చర్యపోయా — వాని వ్యంగ్యధోరణికి, సాయంత్రానికి

తెలిపింది—యంత్రంలాంటి అతని జీవితంలో అది సహజధోరణేనని. మార్పులేని అతని జీవితంతో యీ ధోరణే ఒక మార్పు. పాతపై విరక్తి కలిగినప్పుడల్లా మానవుడు, ఏదో కొత్తదనానికి మార్పుచెందటం కూడా సహజమేకదండీ!

అలా హెడ్‌వార్డరు పిలవగానే, పొడితో మంగలి తయారు. గుబురుగా పెరిగిన నా జుట్టు గబగబా కత్తిరించేశాడు. యిలా కత్తిరించడంలో వాళ్ళకున్న ప్రయోజనం చమిటైన తరువాత హెడ్‌వార్డరు చెప్పాలకగాని తెలియలేదు. ఇందులో రహస్యమేముందిలెండి! కాస్త ఎదిగిన జుట్టయితే సవరాల బేరగాళ్ళు బేడ్డబ్బులు ఎక్కువ పారేస్తారని—అంతే. అమ్మను మరి. ఎలాగూ బ్రతకక్కపోతే ఎలా చెప్పండి — యీ వార్డర్ల జీవితం. సర్కారువాళ్ళు ఇచ్చే జీతం – నెత్తిమీద టోపీ మోయడానికే సరిపోదు.

సరిగ్గా పదకొండు కొట్టారు. జుట్టు కత్తిరించడంతోనే సరిపెట్టలేదు — వీళ్ళు. మా ఖైదీలకు పెట్టే రేషను కూడా కత్తిరించారు, పైగా మజ్జిగలో నీళ్ళు, అన్నంలో రాళ్ళు. వండిన పాత్రా–ఇనుపది. ఆ తిండి తిన్న ప్రతీవాడూ, వెంటనే పాస్పటయి ప్రక్కపైనో, లేక కంపెత్తిపోయే లిట్రిన్‌లోనో కాలక్షేపం చేయవలసిందే

"ఏంటయ్యా!" అని వార్డరు వడిగితే, కంట్రాక్టరటువంటివాడట. వాడు – మంత్రులకు బంధువట, వాడు పోసే ముదికి నీరంతా తీర్థంగా సేవించాల్సిందేనట. వాడ్నది ప్రయోజనమేంటిలెండి – వడిలో ఆవేశించిన ఆ దురాశా పిశాచాన్నవాలి.

అయితే రోగాలకు దూరంగా వుండేవాడు - ఒకడున్నాడు - మా వార్డులో. ఉత్తరాదినుండొచ్చాడు - వాడు. వాడు తినేవి రొట్టెలేమో, యీ రోగాలు వాడికంటవ్. వాడికి కొట్టేకాదు, గంజాయి బాగా అలవాటు. పేకాట పాడి పాటీ ఇవన్నీ జైలులో నిరాటంకంగా సాగుతాయ్ - లెండి. సొమ్ముంటే ఎక్కడ ఏది సాగదు చెప్పండి? ఈ మార్వాడీ వున్నాడే— వాడు బలే గజదొంగ మీరు బయట రూపాయలే ఖర్చుపెట్టగలరు. వీడు జైల్లో కాసులే ఖర్చుపెడతాడు. వాడే అన్నాడొకసారి - "ఈ పోలీసులా? మత్తుగా తిని, త్రేన్పులొచ్చేదాకా తిరుగుతారంతే గాలిని పోగుచేసి, అమాయకులపై ఏదో కేసుపెట్టి, పై ఖర్చుకు తంటాలు పడతారంతే కాకపోతే, ప్లాటుఫారంపై బీటుకొడుతున్నాడు - పోలీసు. రైలుపెట్టె లోంచి మెడనిండా నగలున్న ఆడదీ. ఇంకా జనం దిగుతున్నారు. దర్జాగా ఆ ఆడదాని మెడలో చేయిపెట్టి కాసులపేరు తీసినా, పట్టుకోలేక పోయాడా పోలీసు. అనుమానంపై పట్టుకోగలిగాడు నన్ను - అదయినా కాసులపేరు పట్టుకోడం వాళ్ళకు చేతకాలేకపోయింది." అని పీక వొదిలించి "ఓహ్" అన్నాడంతే అరచేతిలో కాసులు రాలాయ్. కాసులు చూపిస్తూ అన్నాడు వాడు. "చూసావా? ఈ పోలీసులున్నారే - వస్తువును పట్టుకో లేని చేతగాని శకాలు. అధికారముందికదా అని మనుషుల్ని పట్టుకుంటా రంతే" అన్నాడు.

వాడు - తన్ప యీ తిండికి మేమంతా భయపడిపోయాం. ఆవేళ సోమవారం సోమవారంనాడే - జైలు సూపర్నెంటు ఖైదీలను పరీక్ష చేయడానికి వస్తాడు. సెల్లోనున్న ఖైదీల మధ్యనుండి, ఆ సూపర్నెంటు

పికిందరులా లోపవిరుచుకొని నడుచుకుపోతాడు. ఆ అదనులో ఖైదీలు కష్టసుఖాలు చెప్పుకోవాలి చేయి అడ్డంపెడితే సూపర్నెంటు అగుతాడు, అప్పుడు పెదవులు కదపకుండా చెప్పాలి.

కాని నేను పెదవులు కదపకుండా చెప్పలేకపోయాను — ఆ పని నా చేతకాలేదు. ఆ చెప్పటంలో మొత్తం ఖైదీల కష్టాలన్నీ ఏకరవు పెట్టేశాను— ధైర్యంచేసి. ఇంకొకడు వన్ను సమర్థించాడు.

సూపర్నెంటు మా సొద అప్పుడు వినిపించుకున్నాడో లేదోగాని, ఆయన తన ఆఫీసుకు చేరిన మరుక్షణం మాకు కబురొచ్చింది — దొరగారు పిలుస్తున్నారని.

నా జీవితంలో ఎన్నడూ ఒక పెద్ద ఆఫీసరు ముందు నిలబడి ఎరుగను. అలా నిలబడగలిగిన ఆ రోజు ఎంత సంతోషించానో మాటల్లో చెప్పలేను. అందులోనూ ఓ పెద్ద ఆఫీసరు నేను చెప్పేది వినడానికి పిలవటమంటే మాటలా?

తీరా వెళ్ళేటప్పటికి జైలరూ— అతను మలబారు మనిషేకూడా— నల్లగా దున్నపోతు వాహనుడు. యముకున్నాడే - సరిగ్గా అలాగే వున్నాడు. నాతోపాటు ఇంకో ఖైదీకూడా వున్నాడు.

వుదారంగా ఆ జైలరు అడిగాడు.

"మీ ఆహారంతో మీరంతగా బాధపడుతున్నారా?

"అవును — భరించలేని బాధండి,' అన్నా నేను వినయంగా.

ఇంకేముంది? చుర చుర చూచి. చురకవేసినట్లు అనేసాడు, వార్డరుతో —

"అయితే పిల్లదరినీ ఒంటి కొట్టులో పారేయ్' అని.

అడిగినందుకు సుఖం లభించింది గందా! అవి చాలా ఆనందించాము,

జైలరు — ఆర్డరు వేయడమే తడవుగా నన్నా ఒంటికొట్టుకు తీసుకుపోయారు — వార్డర్లు.

ఆ కొట్టు చూడగానే నా ఒంటిలో జెర్రులు ప్రాకాయ్. పగవాడికయినా వొద్దురా బాబు — యీ నరకం అనుకున్నా. మీకు నమ్మకంది, నమ్మకపోంది. అది ఒంటికొట్టు కాదు — చీకటికొట్టు. ప్రతి ఖైదీలను రేపు పురితీస్తారనగా ఇందులో పారేస్తారు. అమ్మబాబోయ్. ఆ కొట్టు చూస్తుంటె — పీడకలలు, కళ్ళముందు కనబడతాయి కొట్టంతా చండాలమైన వాసన. అంతేకాదు బాబు. ఆ కొట్టు నరంబీ పట్టుకొని అరుస్తూ ఆటలాడుకునే గబ్బిలాలు. పాతెపట్టులు చూచి. నా శరీరంలో జెర్రులు ప్రాకడంకాదు పాములు బుసకొట్టేయుంటే నమ్మండి. యీ కొట్టులోనే. నన్ను "టకీ' మని కొట్టి, మరీ త్రోసేసారు — వార్డర్లు.

ఇదీ జైలు. ఇదో నరకం. ఇక్కడ పల్లెత్తుమాటలాడామా, ఆది కాల్లు మరమేకులయిపోతాదంతే.

# 43

ఎప్పుడయితే నన్నా చీకటి కొట్టులో పారేసారో, నా [illegible] ఒంటిబ్బుతెర క్రమ్మినట్లయింది. [illegible] ఆ కొట్టులో. [illegible]లవులను

తీవ్రించేసే. కొరుక్కుతినే చలి. కప్పుకోడానికి దుప్పటిలేదు. ఇక తించలక్కంగాని— అధికార్లు పరోక్షంగా పెట్టే బాధలు. ఆ బాధలకుతోడు నా శరీరం తొలిగి బాధించే వల్లులు. ఆ వల్లుల బాధను ఓర్చుకుంటే చీదపేళ్లు, ఏమైనా మీ అందరికీ దణ్ణం పెడతా — మీరీ జైలుకు రాకుండా వుంటే.

తెల్లవారింది. కటకటాలు కిర్రుమన్నాయి యమకింకరులు ప్రత్యక్షం యీ చీకటికొట్టు తప్పితేచాలు పదివేలనుకున్నా. కాని ఆ కింకరులు నన్ను మళ్ళీ ఆ యముని - అంటే జైలుసుప.డీ.- దగ్గరకే లాక్కెళ్ళారు. యముడు ఎంత వుదారుడో - సావిత్రి - సత్యవంతుల కథ చదువుకున్న మీలాటివారికి నేను చెప్పనక్కరలేదనుకొంటి. ఇంకెప్పుడూ పొగరుమోతులా ప్రవర్తించవద్దని హెచ్చరించి నాకు ఖైదీలకిచ్చే గళ్ళ దుస్తులు యిచ్చి - మోటలాగడంమట్టుకే శిక్షన్నారు.

నా గుండెలు గతుక్కుమన్నాయి మోటలాగడమంటే మాటలా? ఏనుగుల్లా మేసే. జైలు ఎద్దులే లాగలేక వొదిలిపెట్టిన మోటది. దాని కష్టం - ఒక్క ఎదుబోతులే చెప్పాలి గాని మానవులు చెప్పలేరు.

పొగలోంచి లాగి పెగలోకి త్రోసినట్టయింది — నాకు. అయినా మోట లాగక తప్పిందికాదు బయట పూర్వం ఎంత పెద్ద కలపనయినా అమాంతంగా త్రోసుకెళ్ళ గలిగిన నాలాంటి మోటవాడ్ని మోట త్రాడు పట్టుకున్నాక. పది నిమిషాలకుగాని అడుగు ముందు పడలేదు. అప్పుడు వార్డరు లాఠీతో పొడిచాడు. పొడవగానే అడుగు ముందుకేశాను. అలా వేయడంతో జారిపడ్డాను. అంతే వార్డర్లు ఒక్కుమ్మడిగా మీదపడి దబ దబా బాదారు.

ఇదంతా చూస్తున్న మనుషులైన ఖైదీలు కొందరొచ్చి — "ఇదేంటి అన్యాయం!" అన్నారు అంతే వాళ్ళందర్నీ, నన్నూ కలిపి మూకుమ్మడి లాకప్‌లో పారేసారు — ఒకటికొచ్చినా, రెంటికొచ్చినా, కిటికీల్లోంచి వాళ్ళువదేసే తిండి తినాలన్నా — అంతా అందులోనే. దానికి తోడు — చోళ్ళు విసరడం మాకు విధించిన కొత్తశిక్ష ఈ శిక్ష మూడు రోజులు అనుభవించాలి. ఇక మాకు రిలీజు వచ్చింది — అంటె మీఅందరి మధ్యకూ కాదండోయ్! జైలులో మా ఖైదీల మధ్యకు. "అమ్మయ్య!" అనుకున్నా. ఈ జైలే కష్టాల గొలుసు. వూపిరిపీల్చుకో గలిగితే చాలు — వాడు నందనోద్యానవనంలో పూలపాన్పుపై పవ్వళించినట్టే. ఇప్పుడు నాకు స్వేచ్ఛ లభించింది. బీడీముక్కలు దొరుకుతాయ్. ఏముందండీ వార్డరుకి రూపాయి పారేసేమా! పావలా బీడీలు ఎగిరి గంతేసుకుంటూ వస్తాయ్! అలాగే కాలక్షేపం చేయడం, నాకు సులభమనిపించింది — అందుకే మంచి పీళ్ళ ప్రాయంగా రోజుల్ని గడిపా.

## 44

హఠాత్తుగా ఒకరోజు మొత్తం ఖైదీలందరినీ లాకప్‌చేసి పారేసారు — మేమంతా ఆశ్చర్యపోయాం. జైలువింతా కాదుకే. ఏమూల చూసినా పోలీసు ఆఫీసర్లే, మా ఖైదీలనందరినీ బంధిస్తే. ఇక జైలులో మిగిలిన — ప్రతిగోడకీ, చెట్టుకీ, ఒక్కొక్క పి.ఐ.డి. అనేక పోలీసులు సెంట్రీగాళ్లా ప్రత్యక్షమయ్యారు.

ఇక ఖైదీల ప్రతీ బ్లాకునూ, రిజర్వ్ పోలీసులు చుట్టుముట్టి, కొందరు వార్డర్ల సాయంతో, పోలీసుఆఫీసర్లు మా బ్లాకులోకి ప్రవేశించి, ప్రతీఖైదీ ఎముకలిరగ్గొడుతున్నారు. సరుదన్నవాడు యమునిపాశం సుండైనా తప్పుకో గలడుగాని యీ దెబ్బలకు తట్టుకోడం కష్టం. నన్ను మరీ బావగొట్టారు. అదంతా వింటె మీరు నేనేదో ప్రభుత్వంపై లేనిపోని అన్యాయాల్ని ఆపాదిస్తున్నానని అనుకుంటారు. నా నిజాయితీనే నమ్మితే యీ విషయానికి ఆశ్చర్యపోతారు మీరు.

కాని అసలు విషయం తెలిసాక మేం దెబ్బలు మరిచిపోయి. బ్లాకులు దద్దరిల్లేలా ఫక్కున నవ్వేం. మరునాడే మమ్మల్నింకో జైలుకు ట్రాన్సుఫరు చేసారు. అయినా మా మనుఖాల్లో విచారం లేదు. ఆ ఘటనకు సంతోషమే నిండుకుంది.

ఇంతకీ ఆఘటన ఏంటంటారా? ఒక బ్లాకులోనున్న కమ్యూనిస్టు డిటెన్యూలలో కొందరు అర్ధరాత్రే, జైలుగోడలుదూకి పారిపోయారు. వాళ్ళు పారిపోతే తన్నులు మాకు. చూడండెంత విచిత్రమో?

కాని నాకు అంతకంటె—విచిత్రమనిపించిం దేమిటంటారా? జైలుచుట్టూ వున్న మూడు నిలువులెత్తు రాతిప్రహరీగోడ ఆ గోడచుట్టూ బయట విచ్చుకత్తుల మొనల మెరిసే తుపాకులు ధరించి ఇరవైనాలుగు గంటలూ పహారాచేసే పోలీసులు, ఆ గోడలోపల, చూస్తే కళ్ళు తిరిగే రెండు నిలువులలోతు నీరు, మళ్ళీ దాని చుట్టూ కంటిపై కునుకులేకుండా కాళ్ళరిగేటట్టు, రాత్రింబగళ్ళు కవాతుచేసే వార్డర్ల కాపలా, ఆ లోపల వుక్కువూసలతో బంధించబడ్డ బ్లాకులు—ఆ బ్లాకులలో డిటెన్యూలే పరారీ చూడండెంత విచిత్రమో ఈగ చొరడానికి వీల్లేనంత కట్టుదిట్టమైన ఖైదు

నుండి తరార్థీ — కూడలా? సింహం కోరలకు, ఏనుగు తొండానికి చిక్కు-కొని తప్పించుకోవచ్చుగాని, యీ కూపాన్నుండి తప్పించుకోడం, వెయ్యి మాయలు తెలిపిన విష్ణుమూర్తి తరం కూడాకాదు.

నిజంగా ఆరోజు అధికార్లు అంత కేంద్రీకరించి సాధించి, వుక్రోషంతో మండడానికి కారణమేమిటంటారా?

కొందరు కమ్యూనిస్టులు పారిపోయాక — మిగిలిన కమ్యూనిస్టులను పోలీసు అధికార్లు అడిగారట —

"వాళ్ళెలా పారిపోయారో చెప్పండి!" అని.

దానికి ఆ డిటెన్యూల నాయకుడు తొణక్కుండా 'ఒకే' మని చెప్పాడట జవాబు.

ఏమనో తెలుసాండీ?

"ఆ పారిపోయిన విధం తెలిస్తే, మేమిక్కడెందుకుంటాం!" అని.

చిటికెలో చిత్తయిపోయారు అధికార్లు.

మేం కష్టాలు మరిచిపోయాం. కొంతసేపు నవ్వాలనుకున్నప్పుడల్లా, యీ డిటెన్యూ నాయకుని మాటలు మేం జ్ఞాపకం తెచ్చుకొనేవాళ్ళం, అంతే. కడుపుబ్బ నవ్వు. కొనకుండా దొరికే నవ్వు. మీకైతే, ఏ మణిమాణిక్యం కథకో డబ్బు ఖర్చుపెట్టి. చదువుకొన్నాక నవ్వాలంతే.

అయితే, నాకు మొదటినుంచీ ఆలోచించకుండా తీసిపారేసే అలవాటు లేదు కాబట్టి, ఆలోచించకుండా సహజంగా ధర్మసందేహమే వచ్చింది. పెద్ద సందేహమే ఏమిటంటారా? జైలులో మా అందరికి అధికార్లిచ్చేది అరణాల పరక. వాళ్ళకో, మూడురూపాయలపైన అరణాల పరక. ఎంతలేదో చూడండి? అదేగాక వాళ్ళకి పత్రికలు, దోమతెరలు, వారానికి రెండు

మైసూరుశాంతుల్ని. మూడు మాసాలకోసారి — కోరిన చిన్నిబట్టలు. జోళ్ళు. పుస్తకాలు. పత్రికలూ. ఒకటేమిటి ? సర్వసౌకర్యాలు వుండేవికందా ? ఎందుకు పారిపోవాలని వచ్చిందా ? — అని.

ఈ రోజుల్లో బయట బ్రతకడమేం మజాకాదు అరణాలపరక తిండి తినే—వాళ్ళోటి ఖైదీ ఒకసారి అంటాడూ ? "ఇక్కడ బాగుంది నారాయణా ! బయట తిండికే ముఖం మోమేవాళ్ళం" అని. ఇక మూడురూపాయల అరణాల వరక తిండికి ఒప్పుకునేవాడు — పారిపోతాడంటే—ఏదో వుండివుండాలి. నేను ఇంకో జైలుకి మార్చబడ్డాక అక్కడ ఒక డిటెన్యూ చెప్పిన తరువాత కాని ఆ రహస్యం నాకు అర్థం కాలేదు అయనన్నాడు కందా ? —

"ఆదేంటోయ్. నీటిలో చేపను గట్టున పెడితే. బ్రతుకుతుందా ? అలాగే ప్రజల్లో పనిచేసే మనుష్యుల్ని జైలులో పెడితే, చేప గట్టున తన్నుకొని తన్నుకొని. నీటిలో దూకినట్లు దూకరూ ?" అని.

ముమ్మాటికీ నిజమింతే గదండీ ?

# 45

మమ్మల్ని మార్చిన మరునాడే. డిటెన్యూలను కూడా మా జైలుకే మార్చారు. అయితే. ఆ డిటెన్యూలకు వంటచేసిపెట్టడటం మాకా జైలులో కొత్తపని. ఆ జైలు, మన తెలుగుదేశంలోవిదికాదు — ఒక సముద్రతీరాన వుంది. ఇకా జైలులో డిటెన్యూలదే సర్వాధిపత్యం — ఏదో కొందరు వార్డర్లు, జైలరూ, సూపరెంటూ వున్నా — వాళ్ళు దిష్టి బొమ్మలే.

మా మొదటి జైల్లో డిటెన్యూలకూ, మాకూ సంబంధమే వుండేది కాదు. ఇప్పుడు కొంచెమించుమించు అంతా కలిసే నివాసం.

అక్కడికెళ్ళిన రోజునే ఒక డిటెన్యూ మాపక్కకొచ్చి. ఓ చిన్న లెక్చరు మొదలెట్టాడు.

"సోదరులారా ! మనదంతా ఒకజాతి. దొరతనం చెలాయించ గలిగిన జాతి. కాని మనలను దొంగల్లా శిక్షించి, నానా హింసలు పెడుతోంది దొరతనం. నిజానికి నేడు దొరలై మనల్ని పాలిస్తున్న వీరే—దొంగలు ?...."

నా చెవులు నిక్కబొడిచాయ్. కుతూహలం హెచ్చింది. ఆయన వాగ్ధాటి హెచ్చింది.

"పదునైన కత్తులతో పీకలుకోసి, కనబడని కత్తెరతో జేబులుకోసి పాపం పెంచినట్టు ధనం పెంచి ధనాన్ని తమ ఇనుప్పెట్టెల్లోనూ, పాపాన్ని మన నెత్తినా వుంచి యీ దుర్గతి కల్పించింది—దొంగలైన దొరలే.... ....

ఆమాటలు, నా పూర్వపు జీవితాన్ని, నా కళ్ళముందు సినిమా చూపి నట్లు చూపాయ్. అతను మాట్లాడుతున్నవి మాటలేకావు, జీవితాను భవాలనుకున్నా.

ఇక ఆయన ఆవేశంలోంచి, కర్తవ్యాల్లోకొచ్చాడు. ఆతని మాటల్ని బట్టి అతను వెర్రి ఆవేశపరుడు కాడని, వున్నతాశయాలు, వాటికోసం త్యాగ బుద్ధి గల పరచింతనాపరుడని నాకు నమ్మకం కలిగింది.

ఇంకా అంటాడుగదా !

"అంచేత ఇక మనం నిప్పులాంటి నీతిని, నిర్భయమైన నిజాయితీని, స్వచ్ఛమైన నడవడికను పెంపొందించుకోడానికి — మనమీ జైలును ఒక యూనివర్సిటీగా వుపయోగించుకోవాలి. వుత్తమ పౌరులుగానే గాక, వుత్తమ నాయకులుగా కూడా తయారై బయటకెళ్ళి, ఎత్తుపల్లాలను సరిచేసి, కష్టజీవుల రాజ్యాన్ని సాధించగలిగిన నేటి నాయకులుగా తయారవ్వాలి!"

ఓహో! నిజంగా ఆ మాటలు — నాకు నిషాలాగ అంటుకున్నాయ్. నాలో పట్టుదల తీవ్రమైంది. అవును మరి! గుండె చీల్చుకొని, గొంతు చించుకొని చెప్పినా నామాటే నమ్మని — కఠిన పాషాణమైన యీలోకంలో ఆయన నిజంగా దేవలోకంలోంచి వచ్చిన యతుడో, సిద్ధుడో అనిపించింది నాకు. మీరనుకుంటారు — కమ్యూనిస్టుల మాటలు బూటకాలని.

అయితే ఆ చెప్పినాయన మీరనుకునే కోవకు చెందిన రకంకాదు. ఒకవేళ మీరలాగే అనుకుంటే ప్రపంచంలో తప్పులే చూస్తున్నారన్నమాట.

వెంటనే నే నడిగేశా —

"మీరన్నట్టుగానే తయారవ్వాలని వుంది. కాని మీరు మాకు తయారవడానికి సాయం చేస్తారా?" అని.

ఆయన నిజంగా పొంగిపోయి —

"తప్పకుండా! ఇదిగో ఇక్కడ మీరేదైనా నేర్చుకోవచ్చు. మా డిటెన్యూల లైబ్రరీనుండి మీకే పుస్తకం కావాలన్నా తీసుకొని చదువుకోవచ్చు. ఇక తిండా? మాతో సమానంగా మా పంక్తిని కూర్చొని తినొచ్చు. మీకేమైనా, సిగరెట్లు, చుట్టలూ కావాలంటే, మన డిటెన్యూ స్టోర్సునుంచి తీసుకోవచ్చు ....... ....

అవి యేవేవో చెప్పడం మొదలెట్టారు.

మీరేచెప్పండి; చదువు చెప్తానంటున్నారు. తిండి పెడతారంట? ఇంక నాకు కావలసిందేముంటుంది?

ఆయనలా మనసిప్పి మాట్లాడేసరికి, నా చేతుల కట్లు తెగి ఆయనను కౌగలించుకున్నాయి. మందహాసంతో ఆయన వెళ్ళిపోయాడు. అంతలోకే వార్డర్లు కూడా వచ్చి, లాకప్పు టైమైపోయిందని తొందర చేసారు. మేం మా కంచాలపై తాళం వేసుకుంటూ వెళ్ళిపోయాం. మేఘాలు గర్జిస్తున్నప్పుడు నెమళ్ళు ఎంతానందంగా నాట్యం చేస్తాయో అంత ఆనందంగా మేం నాట్యం చేసుకుంటూ పోయాం.

# 46

నేనేదో అక్కసుకి అనడంలేదు. చెప్పండి? రాత్రిని పగటిగా ఎవరన్నా మార్చగలరా? పగటినిమాత్రం రాత్రిగా మార్చేయగల ప్రబుద్ధులున్నారంటె ఒప్పుకోవచ్చు. ఎందుకంటే — వాళ్ళకు కావలసిందే నిద్రగాబట్టి. పగటినికూడా రాత్రిగా మార్చుకుంటారు' కాని నేను మాత్రం రాత్రినే పగలుగా మార్చేసుకున్నా. అలా ఆరునెలలు గడిపా,

అప్పటికి నా కళ్ళకట్లు విప్పారు — డాక్టర్; ఇంకేముంది. ఇదివరకు మసకగా కనబడిన ప్రపంచం నాకిప్పుడు అరచేతిలో అరటిపండొలిచినట్టు కనబడుతోంది. నిజంగా నాకళ్ళకాపరేషను చేసిన డాక్టరును నా జీవితంలో మరచిపోలేను, మహోపకారం చేసాడాయన. ఆ డాక్టరే — మా మేష్టారు.

విద్యలేని వింత పశువునైన నాకు విద్యాదానం చేసిన మహోపకారుడాయన. ఆరు నెలల్లో పూర్తిగా పుస్తకము చదివి అర్థం చేసుకోగలిగిన జ్ఞానం ప్రసాదించాడు. విద్యనివ్వటం అంటె గ్రుడ్డోడికి కళ్ళిచ్చినట్టే కదండీ?

నిజంగా వెనుకబడుతున్నప్పుడు మోహన్ ఇచ్చిన "అమ్మ" పుస్తకం ఇప్పుడు రెండుసార్లు చదివాను. అంతేకాదు. మోహన్ ఒకప్పుడు చెబితే అర్థంకాని "ఆదనపుశ్రమ సిద్ధాంతం" చదివి ఎగిరి గంతేసానంటే నమ్మండి.

నాకిప్పుడు నామంగి, బిడ్డడు కాదు — కనబడేది, పుస్తకాల బొంతర్లు, అక్షరాలు ఒంట్లు గుణింతాలు, మాటలు, పదాలు. ఇక పుస్తకము అనర్గళంగా చదివేస్తున్న నాకు ఇక ఇంగ్లీషు, హిందీ, సంస్కృతం, ఎప్పుడు ప్రుంగేద్దామా. అన్నంత వుత్సాహం వచ్చేసింది ఈ పి మాటలా, విద్యను. బిడ్డన్ని పెంచి — పోషించుతున్నట్టు, పోషించుకోవాలి. గబుక్కున పెరగమంటే బిడ్డడు పెరుగుతాడా? కాని జైలులో వున్న అవకాశము చూస్తే నాకిద్దే అని పిస్తోంది. చదువు

మా జైలులో — సౌకపాటు — యూనివర్సిటీలో నాలుగు భాషా తరగతులున్నాయ్. ఆ నాలుగు భాషల్నీ నలుగురు పండితులు బోధిస్తుండేవారు.

కోప్పడకండి. ఆ పండితులెవరో కాదు. ఓ పెన్నూలే. నాకిప్పుడు ప్రతి ఓ పెన్నూ ఒక రక్తబంధువై పోయాడు. ప్రాణస్నేహితులమైపోయాం. అసలు నాకు ఖయిదీగా వుంటున్నట్టేలేదు. దేనికి లోటు చెప్పండి. తప్పితే ఖయిదీ దుస్తులు మాత్రం ధరించాలంతే. డొక్కశుద్ధి కావాలిగాని దాబు సరేందుకండీ?

# 47

తెలుగు తరగతి పూర్తిచేసుకొని, ఇంగ్లీషు తరగతిలో కెళ్ళా. పురుగుల్లా పరిగణించబడే ఖైదీలం ఇలా కావడం అందులోనూ, డిటెన్యూలకూ మాకూ వున్న సంబంధాలు ఇంత దృఢం కావడం, జైలు అధికారులకు కలవరం పుట్టించాయ్. మాటలా ? ఇక్కడున్న ప్రతీ ఖైదీ, ఒక్కొక్క మేధావై పోతున్నాడు విడుదలై బయటికెళ్ళాడా ? వెయ్యేసిమంది మహావీరుల్ని తయారుచేయగలడు. ఈ అధికార్లకు జీతాలిచ్చి పోషిస్తున్న ప్రభుత్వమే పటాపంచలై పోతుంది. ఇదంతా తలచుకొని గుండెల్లో ఫిరంగులు ప్రేలి, జైలు అధికార్లు ప్రభుత్వానికి రిపోర్టులు పంపినట్లున్నారు. వెలుతురుని జూచి భయపడేది చోరులు, జారులే కదండీ ! అయినప్పుడు మాలో పొటమరించిన వెలుతుర్ని చూచి, వీళ్ళకి భయమెందుకు చెప్పండి.

ఒకరోజు సూపర్నెంటు ఒక ఆర్డరు మా మేయరు కిచ్చి — డిటెన్యూల నాయకుడ్ని 'మేయరు' అంటారులెండి.

"సిద్ధంగా వుండమనండి !" అని హెచ్చరించా డాసూపర్నెంటు.

ఆ ఆర్డరు కాగితం ముక్కే అయినా మాలో కార్చిచ్చు రగిల్చింది. ఇంతకీ ఆ ఆర్డరేమిటంటారా ?— మాకు భిక్ష పెట్టిన నాయకుల్ని కొందర్ని ఇంకో జైలుకు మార్చటం. అంటే— ఆ జైలు ఎక్కడో కాదు సిక్కిం ఎడారిలో ఒక కాన్సన్ట్రేషన్ క్యాంపు అన్నమాట.

పీక తెగిరిపోయినా యీ మార్పు జరక్కూడదనుకున్నాం మేమంతా. పాలుత్రాగే బిడ్డనుండి తల్లిని విడదీస్తే, ఆ బిడ్డ ఏడవదండీ ! అలా

ఏడ్చాం. కాని మేం యువకులం. ఈ అన్యాయాన్ని జరగనివ్వకూడదను కున్నాము.

"నిజంగా యీ మాత్రం జరగనివ్వకూడదు" అని జైలు కమిటీకూడా అంటే డిటెన్యూల కమిటీలెండి. ఒక నిర్ణయం చేసింది.

ఆ రాత్రే ఆర్డరు వుపసంహరింపజేసేలా వొత్తిడి చేయడానికీగాను లాకప్'ను ధిక్కరించడానికి కూడా నిర్ణయించింది.

ఆ నిర్ణయం....సూపర్నెంటు కెళ్ళింది.

సూపర్నెంటు హడలిపోయి, మదరాసు సెంట్ జార్జికోటకు వెంటనే ఫోను చేసి, ఏదో ఆర్డరు తెప్పించి, మళ్ళీ మా మేయరుకు చూపించాడు

అందులో పిడుగులాంటి వార్త వుంది—

"తుపాకు ల్నెదిరించ గలిగితే లాకప్‌ను ధిక్కరించవచ్చునంట !"

యీ వార్త విని జైలంతా అట్టుడికిపోయింది. ఒక్కముక్కలో అందరి అభిప్రాయాల్ని మేయరు అందజేసాడు—సూపర్నెంటుకు.

"తుపాకులు మా నాయకుల్ని వేరుచేయలేవ్ !"

ఇక సయ్ అంటే సయ్ అనేవరకూ వ్యవహారం ముదిరిపోయింది. నాకు మతిపోయింది. రాత్రిం బగళ్ళు చదివిన చదువంతా గంగపాలై పోయింది.

ఇంతలోకే మా ఖైదీల దగ్గరకు డిటెన్యూల నాయకుడొచ్చి — అడిగాడు.

"మీలో డిటెన్యూలతో భుజాలు కలిపి నిలబడే దెవరు ?" అని.

నేను మాత్రం తెగించి ముందుకొచ్చి—

"దేనికైనా నేను సిద్ధం" అన్నా.

ఇంకా కొందరు ముందుకురికారు. కాని ఆ నాయకుడు—

"యీ పోరాటం ఆషా మాషీది కాదు తుపాకీ గుండ్లను ఎదిరించి పోరాడవలసిన విషయం. మీరో శిక్షపడ్డ ఖైదీలు. మీరుగాని యిందులో పాల్గొంటే మార్కులు తెగ్గోస్తారు. శిక్షాకాలం కూడా పెంచేస్తారు. ఆలోచించుకోండి!"

యీ మాటలు నాకాశ్చర్యాన్ని కలిగించాయి మీకు కూడా కలిగిస్తాయనుకుంటా. ఎవడైనా సొంత అవసరానికి, ఇతరులను వుపయోగించుకుంటాడుగాని, ఇతరులే తమంతట తాము ముందు కొస్తుంటే దూరంగా వుండమనే దెవ్వరు? చెప్పరేది.

నేను మాత్రం — మనుష్యుల్ని పరీక్షించడానికి యిలా ఆయనంటున్నాడనుకున్నా.

"ఏమైనా సరే—కూర్చున్న కొమ్మను తెగ్గొట్టుకునే మూర్ఖులం కాదు.... దేనికైనా సిద్ధమే!" అన్నా నేను.

మా ఖైదీల్లో తను గురించి ఆలోచించుకునే వాళ్ళెక్కువలేంది బయటికి 'సిద్ధంగా లేము' అనలేక బుర్ర లొంచేసారు కొందరు.

కాని నాతోపాటు మరో ముగ్గురు మాత్రం — అన్నింటికీ తెగించి ముందు కొచ్చారు.

అలా ముందుకొచ్చిన నలుగురం ఆరాత్రి దీపెన్యాలతో వుండిపోయాం వార్డర్లను ధిక్కరించి. మిగతా ఖైదీలు మామూలు ప్రకారం — దీపెన్యాలతో సంబంధం లేని జైలుబయట, ద్వారంపైనుకు పోయారు— వార్డర్లతో.

అంతే ఇక మొదలు. విషాద గాథ.

# 48

సూర్యుడు ఆతృతతో ఆరోజు కాస్త ముందుగానే. తూరుపు కొండలెక్కి నుంచున్నాడు. డ్రైవరు బ్రేకు వేస్తున్నా. ఆగక, రొప్పుతూ, రొదుతూ పతిపం పట్టిన రాక్షసుడిలా 'బొయ్' మన్న రైలుకూత మాట వినబడింది.

జైలు బయట "బర్ ! బుర్ !" మంటూ లారీల ధ్వనులు కూడా మిన్నుముట్టుతున్నాయ్. జైలు టవర్‌నుంచి ఏదో దుర్వాసన ముక్కులు బ్రద్దలయ్యేటట్టు వస్తోంది. ఆ దుర్వాసన మకిలిపట్టి, బురదలాంటి చెమట పట్టిన పోలీసుల దుస్తులనుండి వచ్చేదనుకునేరు గనుక ! కాదు. ఆ వాసన పడినవాడు రంభాసంభోగానందం అనుభవించేస్తాడు. పడనివాడికది—మనుష్యుల నెత్తురు పీల్చే నల్లులకంపు. ఆ దుర్వాసన — "సారా" అన్న మాటండి.

మద్య నిషేధం అమలులో వుందికదా అది అబద్ధమనుకునేరు. కాదు కాదు. మానవుడు తనలోని దయాదాక్షిణ్యాలు ఎప్పుడు మరచిపోతాడు ?— యిది పుచ్చుకున్నప్పుడే. ఆ దయాదాక్షిణ్యాలు నేడు పోలీసుల్లో కనిపించ కూడదు. అందుకే యీ సారా ! అంచేత నేను చెప్పింది ఎలా అబద్ధమౌతుంది. ఇంకా అబద్ధ మనుకుంటారా ? సాక్ష్యం కావాలంటే బయట మీ చుట్టూ, ఇంటింటా ఖాదీ కంటె ముందు లెక్కకొచ్చే కుటీరపరిశ్రమల్లా దిన దిన అభివృద్ధి చెందుతున్న సారాబట్టీలనడగండి ! ఎందుకంటే నేను జైలులో వున్నాను కాబట్టి నా తరఫున అవి మీకు సాక్ష్యమిస్తాయి.

లాతిలో కప్పకు తిండెవరు పెడుతున్నాదో ? — ఏ మార్గంలోంచి మీకూ, నాకూ కనబడకుండా ఆ తిండి ఆ కప్పకు అందుతుందో, ఆమార్గం లోంచే. మాకు ఒక కబురందింది. ఏమనో తెలుసాండీ ?

"లొంగిపోతారా, కాల్చేయమన్నారా ?" అని అధికారులు హెచ్చరిక పంపడానికి సిద్దంగా వున్నారని, కాదంటే, వెయ్యిమంది బయట తుపాకులతో సిద్ధంగా వున్నారనిన్నీ.

ఈ కబురు రాకముందే మాపక్షమంతా నరసింహమూర్తులై స్థానాల్లో సిద్ధంగా వున్నారు. రోటిలోతలదూర్చి రోకలిపోటుకు వెరవడ మెందుకు ?

తప్పించి తన్నడం మన ప్రభుత్వ సాంప్రదాయమేగా ?

వచ్చింది — హెచ్చరిక.

అందుకు సిద్ధంగానే వున్న మాపక్షాన్నా హెచ్చరిక చలింప చేయ లేదు కాని—

హెచ్చరికతోపాటే ప్రత్యక్షం.

ఏమిటి ?

భయంకరమైన మారణం. బ్రెన్, స్టెన్, త్రినాట్ త్రి తుపాకులతో వుక్కుటోపీలు ధరించిన కర్కశ దానవులు—అయిదువందలమంది ముందు ప్రవేశించారు.

ఎంత ఘోరం ?

నాలుగుగోడల మధ్య నిరాయుధులైన మానవులపై, మారణాయుధాలు ధరించిన దానవుల యుద్ధం—వినండా. ఆరోజు చరిత్రలో తుడిచేసినా చెరగనిరోజు—మానవ దానవ సంఘర్షణాదినం.

హెచ్చరిక లేకుండా తొలుత తుపాకులెత్తి కాల్చారు.

మాపక్షంనుండి గణ గణ గణ గంట మ్రోగింది. అంతా ఆత్మ రక్షణ చేసుకొమ్మని.

ఆ గంటమ్రోత, ఆబోతుల ముఖంపై పేడకొట్టినట్టయింది. బారులుతీర్చివున్న అయిదువందల దానవుల వెయ్యి వుక్కుబూట్లూ ఒక్కసారి రంకెలేసే ఆబోతుల్లా దూకాయ్. ఆ అయిదువందలమందినీ రక్షించే మలబారుపోలీసుదళం దాని వెనుకే దూకింది.

హరహరా. ఎంత దారుణం.

ఇక జైలుగోడల బయట ఎంతమంది పోలీసులున్నారో తెలీదు కాని. జైలులోకి వాళ్ళు ప్రతీ అయిదు నిమిషాలకూ. వందకు తక్కువగాని టియర్ గ్యాస్ బాంబులు వేసేవారు. దానిపై, మలబారు స్పెషల్ పోలీసులు, జైలు లోపల ఎదురుగా, నేలకరుచుకొని, పడివున్న నిరాయుధులపై మంటల బాంబులు విసరడం. దానిపై అగ్రగామి దాళవవర్షం. బ్రెన్ — అంటే త్రినాట్ త్రి ఒక గుండు వెళ్ళేకాలంలో విష్ణుచక్రాల్లా తిరుగుతూ, కొన్ని గుండ్లు పెడతాయ్. ఆ ఒక్కొక్క గుండూ, వరుసగా అరడజనుమంది మానవుల ప్రాణాలను అమాంతంగా తినేయగలదు. ఆపైని స్టెన్స్. త్రినాట్ త్రీలు. ఇక చూచుకోండి. ఎటు పరుగెడదామన్నా. గుండ్లవర్షం. తలెత్తితే తలెగిరి పోడం తప్ప తిరుగులేదు.

ఇక మా పక్షం అయోమయంలో పడిపోయింది. ఏదోదారి చూచుకుందామంటే, టియర్‌గ్యాస్ తాకిడికి, స్పృహతప్పిన వారే—అంతా. అక్కడికి తట్టుకొని లేస్తే శరీరాన్ని మంటలతో, దురదలతో కాల్చుకుతినే మంటల బాంబులు. లేస్తే తుపాకి గుండ్లు.

తుపాకిగుండ్ల వర్షం మొదలై అరగంట గడిచిందోలేదో. నేలంతా ఎర్రబడిపోయింది. అంతటి విశాల మైదానంలాంటి బహిరంగస్థలమూ, ఎర్ర

వారింది. పక్షుల్లా మా జనం రాలిపోతున్నారు. కాని కనికరం లేని కసాయి పోలీసులు. తరిమి తరిమి మరీ కాలుస్తున్నారు. సరిగ్గా ఓమూల ఓ పెద్దనాయకుడ్ని కాల్చివేద్దామని రివాల్వరు ఎత్తి పొంచికూర్చొన్న ఒక సార్జెంటు గురి తప్పిద్దామని మా ఖయిదీలు నలుగిరిలో ఒకడు రాయి ఎత్తాడు. అంతే. సార్జెంటు కనిపెట్టి కాల్చాడు. మా సహచరుడు వెంటనే కుప్పలా కూలి పోయాడు.

ఇంకా ఆ సంఘర్షణ__అరగంట సాగింది. మరో వీరుడు నేలకొరిగి పోయాడు ఆ వీరుడు డిఔన్యూ. అహా ! దారుణహత్య. కిరాతకత్వం. మాటికి మారుపాఖ్యా తనబడిందా వీరుని బలిదానంలో.

ఆ వీరు డెవరనుకున్నారు ? అనుభవంలోను, వయస్సులోనూ పండిన నాయకు డాయన. పాతికేండ్లు నిత్య ఖద్దరుధారియై, నిరంతర సత్యవ్రతుడై బ్రిటిషు సామ్రాజ్యంపై పోరుసల్పిన, ధృఢతర దేశభక్తుడాయన జైలులో నున్న 500 మంది డిఔన్యూల తిండి విషయంలో కంటికిరెప్పలా కాపాడిన కన్నతండ్రాయన.

తుపాకిగుండుకు వొరిగిపోయినా కసితీరలేదు – దానవులకి – ఆ విందు మానవుని శరీరంపై . విడవకుండా నల్గురు కాల్చారు. మొత్తం 28 రౌండ్లు. శరీరం తూట్లు పడిపోయి. ఆయన నెత్తురు ప్రక్కకాలువలో సెల యేరులా ప్రవహించింది.

ఇదంతా నేనున్న స్థానానికి పదిగజాల ముందు జరిగిన భయానక ఘట్టం.

తుపాకి కాల్పులకు జైలుగోడలు దద్దరిల్లి పోయాయి. బంధింపబడిన నిరాయుధులపై కాల్చిన కాల్పుల ధ్వనులకు, ఆ జైలుకు అయిదుమైళ్ళ

దూరపు పట్టణంలోని ప్రజలంతా వచ్చి, బయటనుండి చూస్తున్నారు. యీ అమానుష కృత్యాలకు, నిజంగా జైలులో జరిగిన ఆ కాల్పులు వాళ్ళ కళ్ళనే పడివుంటే, అనాడే ఆ జనంలో తిరుగుబాటు తత్వం ఆవేశించి, జైలుగోడలు బ్రద్దలుగొట్టి వుండేవారు.

సరిగ్గా — ఇంకో అరగంటకు జైలంతా స్మశానంగా మారిపోయింది. డిటెన్యూల గదుల్లోని, ప్రతీసామాను తునాతునకలై బయట పడివున్నయ్. జైలు హాస్పటల్ ప్రాంగణంలో రెండువందలమంది డిటెన్యూలను పారేసారు అందులో చనిపోయినవారెందరో, వికలాంగులైన వారెందరో లెఖ్కవేయడం కష్టం. దూరానికి ఆ ప్రాంగణమంతా రక్తపు మడుగులా కనబడింది. అంతకంటె ఘోరం. నేనేది పోతుందని, తెగించి యీ పోరాటంలో కలిసానో, ఆ జైలు లైబ్రరీ అంతా తగలెట్టి, బూడిదచేసారు. ఈ నరహంతకులు. విజ్ఞానాన్ని బూడిదచేసినోడి బుద్ధి ఎటువంటిదై యుంటుందో వేరే చెప్పనక్కరలేదు.

స్మశానంగా మారిన జైలు ఆవరణంతా నిశ్శబ్దం నిరాశ ఆవరించేసింది. వృక్షాలుసైతం, ఆత్మ బలిదాన మొనరించిన వీరులకై, తలలు వొంచాయ్. నాకండ్లు కన్నీటి కడవల్లా అయిపోయాయి. ఆ వీరులు మమ్ములను విశిధ, విషాద విష్కంభంలో వీడి వెళ్ళిపోయారు.

అలా జరిగిపోయిందా విషాదగాథారోజు.

# 49

ఇక పైచేయి సాధించిన జైలుఅధికారులు, డిటెన్యూల రేషను విలువను తెగ్గోసారు.

నన్ను బలవంతంగా వేరుచేసి పూర్వపు క్వారంటైనులో పారేసారు. పారేసి వూరుకున్నారా ?

నాలో పౌరుషం చంపడానికి, నా బట్టలిప్పి, నన్ను 24 గంటలు ఓ దండేనికి వ్రేలగట్టారు. వృషనాలు చిదుకగొట్టేస్తామన్నారు. ఎందుకో తరువాత ఆ పనిచేయలేదు. మానవుడు భరించలేని బాధలన్నీ పెట్టేరు. తిండిపెట్టడం మానేసారు అలామానేయడం, జైలులో పెద్దనేరమని వాళ్ళకు తెలుసు. కాని, ఖయిదీలను కాల్చి చంపడానికై నా అధికారం పొందిన రాక్షసులు వాళ్ళు. ఏపని చేయలేరు ?

"దాహం దాహమని" అరుస్తున్నా ఒక్క నీటిచుక్క కూడా యివ్వ లేదు. పైగా ఒకరోజు నాలుక పీక్కుపోయేంతటి దాహమేస్తే నోటివరకూ మంచినీళ్ళందించి, వళ్ళిని నేలకొట్టారు. ఇంకోరోజు, "ఆకలి ఆకలి" అని ఆక్రందిస్తోంటే, అన్నం తెచ్చి, చూస్తుండగానే దోసె దిసకపోసారు. ఇన్ని పాపాలకు ఒడిగట్టుతున్న అధికార్లపై నాకు కోపం తీవ్రమైంది.

ఆదేకాలంలో జైలులో డిటిన్యూలు, రేషను విలువ తగ్గించినందుకు నిరసనగా నిరాహారవ్రతం బూనారు.

నేనుకూడా యీ ఘోర హింసాకాండకు అసమ్మతిగా నిరాహార వ్రతం బూనాను.

విరమించుకోమని మరల బాధించారు — అధికార్లు నన్ను. కాని ఒక సత్యంకోసం పోట్లాడుతున్నప్పుడు ఎంత ఓర్పు, సహనం అవసరమో, జ్యూలియస్ ఫ్యూజిక్, జైలులో వురికంబాలెక్కుతూ కూడా రాసిన 'రక్తాక్షరాలు' నన్ను మరింత పట్టుదలకు లాగాయ్.

ఏమైనా విరమించుకోనన్నాను. శిక్ష పెంచేస్తానన్నారు. జంకలేదు. కాని, యిరవై ఆయిదవరోజు నిరాహారవ్రతం నన్ను తూచారు. తూకం చిని నాకే బెగులు పట్టింది.

ఏనుగులాంటి నా శరీరం పీనుగులా అయిపోయింది. నూటయాభై పౌనులనుండి, తొంభై ఎనిమిది పౌనుల కొచ్చేసింది.

నాలో ఆవేశించిన సడలని పట్టుదల. నాకు ధైర్యాన్ని మరల నూరి పోసింది. ఇంకో వారం గడిచింది. నాలో వూపిరి తప్ప. సమస్తం ఆగిపో యాయ్ అతి నీరసంవల్ల — రెప్పలు కూడా వాలిపోయాయి. ఆ వూపిరి కూడా ఆగిపోతుందనే భయమేసింది. కావి, బయట పత్రికా ప్రపంచం యొక్క ఆందోళనవల్లనైతేనేమి – డిటెన్యూల పట్టుదల కయితేనేం ? ప్రభుత్వం పరాజయం పొందింది.

నన్ను మరల డిటెన్యూలలో కలవనిచ్చారు. నేనూ ఆహారం ముట్టాను. అప్పటికి శిశిరవృక్షంలా నన్న నా శరీరంలో చిగురు మొల కెత్తడం ప్రారంభించింది.

సరిగ్గా అయిదోరోజుకల్లా, డిటెన్యూల కమిటీ చలవవల్ల, నాశిష విష యంలో వాళ్ళు చేసిన అప్పీలు నెగ్గి, విడుదల వుత్తర్వురావడం జరిగింది.

ఆ వుత్తర్వులో ఆంతవరకూ అనుభవించిన అయిదు శిక్షగా పరిగ ణించి విడుదల చెయ్యాలని వుంది.

ఇక నా ఆనందానికి మేరలేదు. నాకావేళ పట్టపగ్గాల్లేవు. డిటెన్యూల వార్డులో, అయిదు వందలమందినీ — అయిదు నిముషాల్లో కలిచేసుకో గలిగానంటే నిజంగా మీరాశ్చర్యపోతారు.

ప్రతీ డిటెన్యూ నేనేదో ఆదర్శప్రాయుణ్నంటూ పొగిడేవాళ్ళే. డిటె న్యూల నాయకుడు — మరీ నన్ను ఆకాశాని కెత్తేసి మాట్లాడాడు.

"హనుమంతునికి తన శక్తి తనకు తెలీదు. అలాగే నీ శక్తి నీకు తెలీడం లేదు. నీవిప్పుడు సుశిక్షితుడవైన ప్రజాసేవకుడవే గాక, ప్రజలను నడప గలిగిన నాయకుడివి కూడా" అన్నాడాయన.

అని వూరుకున్నారా ? అతని వెచ్చని గుండెలకు నన్నద్దుకున్నాడు.

ఇంతకీ నేను పొడిచేసిందేమిటో చెప్పలేదు. పైగా అంటాడుగందా - "మాటల్లో నీ ఘనతను వర్ణించలేను నారాయణా !" అని. నాకు సిగ్గేసింది.

నేనా సిగ్గులోంచి యింకా తేరుకోననేలేదు. వార్డరొచ్చి — "నీకు విడుదల ఆర్డరొచ్చింది. నీకోసం బయట ఎవరో వచ్చారు కూడా !" అని తీసుకుపోయాడు.

నేను గేటులోకి వెళ్ళగానే నా బట్ట లూడపీకి, నా పాతబట్టలిచ్చారు. అవి రక్తసిక్తమైన దుస్తులు. ఇంద్రుడికి వొళ్ళంతా కళ్ళంటే నా చొక్కాకు నిండా చిల్లులే. ఇంతట్లోకే, డిటెన్యూల నాయకుడొచ్చి రెండు జతల బట్ట లందించాడు.

ఇంకేం ? నిజంగా ఆ బట్టలేసుకుంటే, నా మంగి నన్ను పోలికే కట్టలేదు. దొర ననుకొని ముఖమైనా ఎత్తదేమో ?

గేటు ద్వారాలు తెరువబడ్డాయ్

అందరి వద్దా సెలవు తీసుకొని బయట స్వతంత్ర భూమిపై అడుగు పెట్టా — 'అమ్మయ్యా !" అని.

తలెత్తేటప్పటికి తార్షపడింది.

ఎవరు ? నా మంగి !

బిడ్డతో వచ్చేసింది — ఎగిరి గంతేసాను.

ఒక్కసారిగా నా మంగిని గాఢంగా గుండెలకత్తుకున్నాను. [illegible] నా మంగి శరీరం. ఎముకలగూడులా వుంది. అయితే ఏం ?

నన్ను చూడగానే జేవదేరిందికూడాను. సిగ్గుతో నా గుండెల మీద శిరస్సు పెట్టేసింది.

నెత్తిన నూనెలేని సిగను దువ్వి ముద్దు పెట్టుకొన్నా. నా బిడ్డడు కూడా పెద్దవాడయ్యాడు.

నిజంగా వాడు – మమ్మల నానందడోలికల నోలలాడించే ముచ్చటే.

"బాబూ!" అన్నా. వాడికి నేనెంత ప్రేమో. వెంటనే వాడి గ్గడ్డ కొరికేసాడు. నా మంగి వాడిని అందుకోబోతే దాని బుగ్గలు కొరికేసాడు "చూసావా! ఎలా తయారయ్యాడో!" అంది నా మంగి. నేను జవాబు చెప్పలేకపోయాను.

ఎందుకంటారా! నా మంగిని తనివిదీరా చూడటంలో తన్మయుడనై పోయా. నామంగంటె — నిజంగా అదెంత కృషించిపోయినా — ఆ కండ్లలో, మిణుమిట్లు గొలిపే జ్యోతుల ప్రకాశం మరీ ఎక్కువైంది.

నామంగికూడా అలా చూస్తూ నిలబడిపోయింది. ఏంటో దానిలో పుప్పొత్తున పొంగింది – మధురవాహిని.

బయట పోలీసులు విప్వెరపాటుతో మమ్మల్ని కూడ్డం కవిపెట్టాం. "పద మంగీ! పోదాం" అంటూ ఎదుటనున్న బండి ఎక్కాం ఆ జైలు టవర్లోంచి అప్పుడే ఎగిరిపోయిన పావురాల జంట మా బండికి ముందు వెడుతూ మాకు త్రోవ చూపించాయి.

# 50

రాజమండ్రి చేరాం. కంబాలచెరువు గట్టుపై, చల్లని గాలి వస్తున్న వటవృక్షం వలసల కెదురుగానున్న మా ఇంటి గుమ్మంలో అడుగు పెట్టాం.

ఒక్కసారిగా వూరంతా ఏకమై అరచినట్టు పెద్దరొద. ఆరాత్రి అంత ఓశీవాన్ని చీల్చుతుంటూ జనం నాలుగు మూలలనుంచి అడుస్తూ, రోదిస్తూ ఒండరవండరగా పరుగెడుతున్నారు.

ఒక ముసలమ్మ గుండె బాదుకుంటూ "అమ్మయ్యో గోదారితల్లి నాయిల్లునేం చేస్తుందోనమ్మోయ్" అంటూ పోతోంది. సాకప్పుతర్థమైంది. గోదావరికి వరదొచ్చిందని.

ఇక నేను నిముషం వుండలేకపోయా.

నేను జైలునుండి తెచ్చుకొన్న ఆ ప్రీతో — "మానవులపై ప్రేమా దానవులపై ద్వేషం" తో గుమ్మం దిగి కోటిలింగాల రేవుపై పుకి పరుగెత్తా నా ముంగి. బిడ్డన్ని చంకనుండి దింపి. అలాగే గుమ్మంలో బొమ్మలా నిల బడిపోయింది.

ఇంకేముంది ! కోటిలింగాలగట్టు గండిపడిపోయింది. సురగలు గక్కుతూ గంగమ్మతల్లి, జుట్టు విరబోసుకుంటూ సందెటలో కలప నంత టినీ ఎత్తుకుంటూ పోయి, ఇళ్ళన్నింటినీ ధ్వంసం చేసేస్తోంది. విలయ తాండవం చేసేస్తోంది.

హాయిగా కన్నుమూసి, యోగుల్లా నిద్రపోతూన్న చంటిపాపల్ని సైతం వుయ్యాల తొట్లతోనే తన గర్భంలో కలిపేసుకుంటోంది.

ఒక గంటలో అటు ఆలకట్టకోట, ఇటు ఆర్యాపురం, తుమ్మలా వంతా మహా సాగరంగా మారిపోయింది. ఇళ్ళన్నీ తెప్పల్లా తేలిపోయాయి. ఇక మనుష లేమైపోతారో మీరూహించుకోండి.

కనికరమైనా లేక, పూజామందిరంలో భగవత్సాన్నిధ్యంలో హరినామ సంకీర్తనం చేసుకుంటున్న పుణ్య స్త్రీలను తనపొట్టన పెట్టుకుంది గంగమ్మ.

తన కరుణారస ప్రవాహినిచే. రాజమండ్రి జనులను చల్లగా చూచు కొస్తున్న గంగమ్మతల్లికి. ఇంతలో ఇంతటి మహాకోప మెందుకొచ్చిందని ఎవ్వరూ వూహించలేకపోయారు. గంగమ్మను అదుపులో పెట్టగలిగిన ఇంజనీర్ల అంచనాలను సైతం తల్లక్రిందులు చేసేసింది — తల్లి.

నగరమంతా హాహాకారాలతో నిండిపోయింది. మెరక ప్రాంతాలకు చేరిపోయారు జనం. కష్టజీవుల కొంపలన్నీ పునాదుల్లోనే లేచిపోయాయ్. కాస్త పక్కాగా వున్న మేడలుకూడా కూలిపోయాయ్. రెండు లక్షల జనాభా ఒక్క గంటలో నిరాశ్రయులై పోయారు. నిరాశులై పోయారు. మోకాలెత్తి చేతులెత్తి, గంగమ్మతల్లికి నమస్కారాలు చేస్తున్నారు. తల్లి చల్లబడలేదు. పైగా పొంగడమే గాక పోటెత్తింది.

మరునాటి వుదయానికల్లా పూర్వపు ఇళ్ళపై లాంచీలు తిరగాయంటే గంగమ్మ ఎంతటి మహోగ్ర స్వరూపం దాల్చిందో అర్థమైపోతుంది.

ఇక దానవులకు అవకాశం దొరికింది. బియ్యం కుంచం అయిదు రూపాయలు. రెండు గదులున్న ఇంటికి అద్దె రోజుకు అయిదురూపాయలు.

ప్రజాసేవకు దన్నుపాటికి పరీక్షాసమయం. ఇది నిస్వార్థ త్యాగులకు. చేతినిండా పని.

నాకా రాత్రల్లా నిద్రలేదు. పోయిన సామాను పైకి తీయించడం. నిండు ప్రాణాలను రక్షించడం. ప్రజల ధన, ప్రాణాలను కాపాడ్డం, గుడ్డ లేక, గూడులేక తిండిలేక అల్లాడి పోతూన్న ప్రజలకు ఆహారాన్ని అందివ్వడం మాటలా ?

శుష్కించిపోయి వున్న నేను, బలవంతంగా ఏనుగుబలం తెచ్చుకున్నా. గబగబా వాలంటీర్లను ఏర్పాటు చేసా. ఒక వైపు మంది వరద వుధృతం నుండి ప్రజల వస్తువులను, బయటికితీస్తూ ఎవరివి వారికి అప్పగించుతూనే, రెండోప్రక్క బియ్యం గొడౌంలకు రాత్రింబగళ్లు కావలాలు, అధికార్లవద్దకు, ప్రజల రాయబారాలు నడపడం, వుచిత బియ్యం డిపోలూ, చౌకడిపోలూ పెట్టించడం, మెరకప్రాంతాల్లోని ప్రజల ఇంటింటికీ వెళ్ళి బియ్యం. బట్ట ఇవ్వగలిగిన ప్రతీదాన్నీ దండడం — ఇకాపైని

అమను కనిపెట్టి, అన్యాయాలకూ, దొంగతనాలకూ పాల్పడ్డ దుర్మార్గులను బట్టబయలుచేయటం — ఇవన్నీ ఒకరు చెప్పకుండా అన్నిరంగాల్లో నేనే వుంటూ చాలా తీవ్రంగా పనిచేసా.

పదిహేనురోజులు, కంటిపై కునుకూ, కడుపునిండా తిండి మరిచి పోయి, ఏకధాటిగా పనిచేస్తే, కాస్త నగరంలో ప్రశాంతత ఏర్పడింది. దాంతో బయట సహాయం కూడా అందుకుంది. నాకోసం నా మంగి బిడ్డన్ని చంకనేసుకొని వెదుక్కుంటూ వూరంతా తిరిగేది.

ఆ పదిహేనురోజులూ, నన్ను వెదకి, ఎక్కడున్నానో తెలుసుకోడం అసాధ్యం.

నా అంతట నేనే పదిహేనురోజు లయ్యాక నెమ్మదిగా ఇంటికి చేరు కున్నా. నా నీరసం, బలహీనత తూగిపోడం చూచి, నా మంగి ఇంట్లో మంచం వాల్చింది. నేను మంచంపై మేను వాల్చాను.

ఆ వాల్చడం వాల్చడం మూడు మాసాలకు గాని మంచం దిగలేనంత జబ్బు చేసేసింది — నాకు.

నేను లేనప్పుడు నామంగి ఎలా గడిపిందో ఆ దైవానికి, తెలియాలి. నా జబ్బులో మందులకు డబ్బులేకపోయింది. శరీరం బాధతో పాటు విపరీత మైన ఆర్థిక బాధ.

దానికితోడు ఆరోగ్య శాస్త్రమేతప్ప అర్థశాస్త్ర జ్ఞానం లేని డాక్టర్లు. వాళ్ళు ఏమేమో మందులు కాగితాలపై రాస్తారు. గాని రోగి ఆర్థిక స్థితి గమ నించరు.

గమనించి ఆదుకున్న వాళ్ళూ వున్నారు.

ఇంతవరకూ నేనెవరికోసమైతే బాధపడ్డానో, వాళ్ళప్పుడు నాకోసం బాధపడుతున్నారు. నన్నాదుకున్నవాళ్ళు వీరే.

ఇంత జబ్బులో కూడా నాకు విచారం కలుగకుండా ఆనందాన్ని చేకూర్చింది వీరే. నిజానికి నాయెడల ఇంత గౌరవాభిమానం వీరిలో వుందని కలలో కూడా వూహించలేదు.

ఊళ్ళో వున్న సంఘాలన్నింటినుండీ తలకొక పదిరూపాయలు చందాలు దండి నా కందచేసేవారు — నా కార్మికసోదరులు. నేనెంత పుణ్యం చేసుకుంటే వారి సహాయం నాకు లభిస్తుంది?

ఇక కార్మికులేగాక, నన్నెరిగిన పేటల వాళ్ళంతా చిన్నా పెద్దా తారతమ్యం లేకుండా రోజూవచ్చి, నన్ను ఓదార్చి పోతుండేవారు. కష్టకాలంలో డబ్బు ఎవర్ని కాపాడుతుందండీ? హృదయమున్న సానుభూతి కాపాడాలి గాని!

అలరికి యముని పాశంనుండి తప్పించుకున్నా ఇలా తప్పించుకోడం నా జీవితంలో ఇదే పదోసారో

నాకు కాస్త స్వస్థత చేకూరాక నేను అనుకోనిది — నా పూర్వపు పని మళ్ళ నాకిచ్చింది — సంఘం. ఇక మళ్ళ నా కార్య కలాపాలు మొదలెట్టా.

అదే ఏరు—రాజమండ్రి ట్రేడు యూనియన్ — అంటే మీకు తెలిసే వుంటుందనుకుంటా. కార్మిక సంఘాలన్నిటికీ మాతృ సంస్థ. ఎన్నికలు జరిగాయ్ ఒద్దంటున్నా నన్ను ప్రెసిడెంటుగా ఎన్నుకున్నారు.

నా జీవితంలో ఎంతో పెద్ద పెద్ద నాయకులున్న రాజమండ్రిలో — వున్నతమైన పదవి నలంకరించడం ఇదే మొదలు.

ఎన్నికంటే జరిగింది గాని, నాపాత జీవితం వెనక్కి తిరిగి చూచుకున్నప్పుడల్లా ఏదో భయం గలిగేది. నేటి ఎత్తునుండి, నా జీవితం అగాధం చూస్తుంటే కళ్ళు తిరిగేవి. కాని పదవితోపాటు సంక్రమించిన బాధ్యతను విస్మరించలేకపోయా.

నా జీవితంలో పిచ్చైన ఎక్కుతున్నప్పుడల్లా ఏ పామో కరవడం, ఏ పిల్లి, బల్లి, పక్క కదుపులోనో పడ్డం జరిగేది. అందుచేత నాకు విపరీతమైన భయం. ఎందుకంటారా? పిచ్చైన ప్రక్కనే కదండీ! పాముండేది?

నిత్యకృత్యాలతో రోజులు ఇకసాఫీగా జరిగిపోతున్నాయి. నన్నిప్పుడెవరూ దొంగవడంలేదు. పైగా కలపమోతకు ఇంటినుండి బయలుదేరానా? అడ్తీకి వెళ్ళడానికి గంట పట్టేది. నిజానికి మా ఇంటికీ అడితికి మైలున్నర వుంటే, గంటెందుకు చెప్పండి?

త్రోవలో రకరకాల మజిలీలు. ఒక్కొక్క సంఘం వేసే యక్ష ప్రశ్నల కన్నింటికీ సమాధానం చెప్పుతుంటూ పోవాలి. ఒక్క ముక్కలో జవాబు చెప్పేసి బయలుదేరుతున్నా గంట పడుతోంది. ఇక ఎన్నడూలేనిది త్రోవపొడగునా పళ్ళాలు పెట్టేవారే. ఒట్టి చెడు సాంప్రదాయం ప్రవేశ పెట్టారు — మన పెద్దలు.

సరిగ్గా ఆ 'మేదే' ఎన్నికలొచ్చాయి. అంటె అవి అసెంబ్లీ ఎన్నికలు రాజకీయ పార్టీలన్నీ మహాకోలాహలంగా పనిచేస్తున్నాయి. అయితే మా కార్మికసంఘాల తరఫున ఎవరికి ఓటెయ్యాలో మేమింకా నిర్ణయించుకోలేదు.

నిజానికి, రాజమండ్రిలో రాజకీయాల్లో సంబంధమున్న ప్రతీవానికి తెలుసు. మా సంఘాలన్నీ ఎవరికి ఓటేస్తే వాళ్ళే గెలుస్తారని. ఎందుకంటే మొత్తం ఓట్లలో మూడింట రెండువంతులు మా ఓట్లే. అయితే మా కార్మికులు చదువూ, సంధ్యా లేనివాళ్ళు కాబట్టి — ఈ రహస్యం తెలుసుకోలేదు.

అందుకే కావిచారికల్లా ఓట్లేసి, తమ నెత్తిన తామే మరమేకుల్ని దిగ్గొట్టుకొనేవారు గెలిచేది కూలీల వోట్లతో, తీరా అక్కడికి పోయి, చెయ్యే త్తేసి — డబ్బున్న వాళ్ళకోసం.

కూలోడు - తను జీవించాలనే అనుకుంటాడు. ఇతరుల జీవితాల్ని నాశనం చేయాలనుకోడు. అలా అనుకునే ప్రతినిధులు మాత్రం స్వార్థులే వాళ్ళు కూలీల కోసం పని చేస్తామననీయండి, మరేమైనా ఒరగబెడదామన నీయండి — జరిగేది మాత్రం — కూలీలకు ద్రోహం. ఇక తెల్లబట్టలేసు కొని కూలీలకంటె అధ్వాన్నంగా జీవించే, మధ్యతరగతికి కూడా ద్రోహమే జరుగుతుంది.

ఇకముందు యిలా జరక్కూడదనుకున్నాం. అన్ని సంఘాల ప్రతి నిధుల్ని సమావేశపరిచాను

వాళ్ళంతా నా యభిప్రాయమే బైటన్నారు. పైగా యీ దఫా కూలీల ప్రతినిధినే గెలిపించా లన్నారు.

నేను యిక్కడికి రాగానే మా మోహన్ని అప్పటికే డిటెన్యూగా ఇంకో జైలులో ఎక్కడో బంధించారు. జైలులో నుంచే నేం?

నిజమైన ప్రజాసేవా తత్పరు డాయన. నిష్కళంక దేశభక్తుడాయన జనంకోసం సర్వం త్యజించిన, ప్రజలకు ప్రేమపాత్రు డాయన.

అయన్నే యీ అసంబ్లీ ఎన్నికలకు నిలబెట్టాలని ప్రతిపాదించా.

చర్చ ఇంకా మొదలవుతుందనగా. వెనుక మోహన్తో అండర్ గ్రౌండ్లో పిడివాదం చేసాడన్నానే — ఆ యువకుడు. అనగా అతనో

కమ్యూనిస్టు నాయకుడు లేండి. అప్పుడు ఆతను వచ్చి ఒక వుత్తరం చదువుతానన్నాడు.

ఆ వుత్తరం మోహన్ రాసారు. అంతలో—ఆతని కెలా అందిందో యీ సమాచారం— నేను పూర్వమున్న జైలులో డిటెన్యూల కమిటీ అభిప్రాయమంటూకూడా రాసారు.

ఆ యువకుడు చదివాడు. చదవగానే జనమంతా మిన్నుముట్టేలా చప్పట్లు ఏకధాటిగా అరగంట కొట్టారు.

ఇంతకీ ఆ వుత్తరమేమంటారా?

నన్ను వుక్కిరి బిక్కిరి చేసేసిందది,

అసంబ్లీ ఎన్నికలకు నేనే రాజమండ్రికి అర్హుడనట!

దిగ్గజాలు పోరాడుతున్న రాజమండ్రి ఎన్నికలో నేనొక అభ్యర్థినా? ఇది నాకు మింగుడు పడలేదు. కాని, మొత్తం ప్రతినిధులంతా "తప్పద"న్నారు. వెంటనే నా చేతికి రక్షరేకు కట్టేసారు — పూలదండ వేసేసారు.

వారం తిరిగే టప్పటికల్లా ఆకాశంలో మేఘాలు క్రమ్ముకున్నట్టు రాజమండ్రి వీధుల్ని ఎన్నికల బోర్డులు క్రమ్ముకున్నయ్.

అన్ని పక్షాల ప్రచారం మిన్నుముట్టింది.

ఇక ప్రతిపక్షాలు నా జీవితం అంతా అచ్చేసి పంచేసారు. ఆ కరపత్రాలనిండా "దొంగ! అంటే దొంగ!" అని, ఖైదీనని ఏవేవో రాసేసారు

నాకు నిరుత్సాహం రానురానూ ఎక్కువైంది. అనేక సమయాలలో ధైర్యాన్ని సడలనివ్వని నేను — నిరాశపడ్డా.

మా మంగి – నన్ను మరీ దిగజార్చేది.

"మనకెందుకీ బాధ." అని.

మీరు నిజంగా నా మంగి అమాయకురాలనుకుంటారు గదూ?

"ఇదేంటిరా? లక్షలు ఖర్చుపెట్టి మహామహావాళ్ళంతా శంగంలోకి దూకుతుంటే — బాధంటుందీ" అని

కాని — మా సంఘాల పెద్దలుతేరూ? వాళ్ళు మా మంగికి ధైర్యం చెప్పేవారు. "ఇదుగో మంగీ! మినవాడి గెలుపుకోసం. మా నెత్తురు ధార బోస్తాం. సంఘానికి వందేసుకున్నాం. ఇంకో వందేసుకుంటాం. వాళ్ళ లక్షలూ, మన శక్తి సమానం" అని.

ఏదో అప్పటికి భుజాల్లో తల దూర్చుకునేది.

ఊళ్ళో దబున్నోళ్ళంతా ఒకటైపోయారు. నెత్తీ గుండె బాదుకొని మరీ చెబుతున్నారు. వాళ్ళ సొద. నేను కాని నెగ్గితే వాళ్ళ కొంపలన్నీ కూలిపోతాయట! వాళ్ళకొంపలు కూల్చితె నాకేమొస్తుంది.

పోలింగు దగ్గరకొస్తున్నకొద్దీ – ఓటరు కాళ్ళ ముందు డబ్బు క్రుమ్మరిస్తున్నారు. ఒక తమాషా! ఇంకో అర్డీ వర్తకుడు కొత్తపద్ధతి పెట్టారు. అదేంటో తెలుసా? ఇంటికి గుండెత్తు బియ్యం.

"వాడికంటె ఘనుడు అవంట మల్లన్న" అని. ఇంకో అభ్యర్థి – ఈ గొడవంతా ఎందుకని – "మగోడికి చాపు. ఆడదానికి చీర" అన్నాడు.

ఇక గుళ్ళు గోపురాలు కట్టిస్తామని కొన్ని పేటల పెద్దల మూర్తత్వాన్ని పెంచి, మరీ లొంగదీసుకుంటున్నారు.

ఇక మా వాళ్ళంటారా ? రోజూ వూరంతా వూరేగింపులు జరిపేది — "ప్రజల కష్టాలు ఏకరువు పెడుతూ, అవన్నీ పోవాలంటే కూలీ ప్రతినిధికి ఓటెయ్యండి" అని.

ఇలా వుంది వరస :

సరిగ్గా ఆరోజు ఓట్ల లెక్కింపు రోజు.

సాయంత్రానికల్లా వోట్లలెక్క పెట్టేసారు. ప్రతిపక్షాలవాళ్ళు, పూల రథాలు తెచ్చుకున్నారు — వూరేగడానికి. ఊళ్ళో పూలన్నీ వాళ్ళే కాంట్రాక్టు చేసేసారు.

పాపం వాళ్ళను చూచి నాకు జాలేసింది. వాళ్ళందరికి ఎన్ని ఓట్లొచ్చాయో నాకొక్కడికి అన్ని ఓట్లూ వచ్చాయి. వూరేగడానికి నాకేముంది ? అయితే మా కూలీలు మాత్రం అన్నింటికంటె ఎత్తయిన వాళ్ళ భుజాలెక్కించేసారు. నిజంగా ఆ రోజు వూరేగింపు తెల్లవారిపోయిందంటే నమ్మండి. సందెవేళ యింటికి వచ్చేటప్పటికి బిడ్డన్ని చంకకందించి కళ కళలాడుతున్న లక్ష్మిలా నాకు హారతి యిచ్చింది — నా వంగి.

ఇక నేను ఎక్కవలసిన నిచ్చెనా లేదు — ప్రక్క ఇదివరకున్న పాములూ లేవు.

వాళ్ళెంత దొంగని ప్రచారం చేసినా నమ్మలేదు. జనానికి నేను ఎంతో ఋణపడి వున్నాను. అప్పటికి నా మచ్చలు చెరిగిపోయినట్టుగా భావించా.

కాదంటారా ?

ఇప్పుడు చెప్పండి ? నేను దొరనని అంతా అనుకున్నా. నేను మాత్రం అనుకోను.

కాని నేను దొంగను మాత్రం కాదు. నాలో ప్రతిరక్తకణం దొంగను కానని సాక్ష్యం చెబుతుంది.

మీరేమంటారు ?

మీరేమన్నా పాటించడానికి నేనెప్పుడూ సంసిద్ధమే. మీరే అంతిమ న్యాయనిర్ణేతలని నా అభిప్రాయ, నాపై అభిప్రాయమివ్వగలహక్కు మీకుంది. దొంగనో కాదో తేల్చి చెప్పండి। నాలో ఇంకా మచ్చఉంటె మాపు చేసుకోడానికి అడుగడుగునా కృషిచేస్తా. ఆత్మశోధనం చేసుకుంటా. గతాన్ని దిద్దుకొని భవిష్యత్తుకు అడుగువేస్తా. ఏం ? చెప్పలేరూ? మీరంతా మాట్లాడలేక పోతున్నందుకు నాకు చాలాబాధ కలుగుతుందనుకోండి। పోనీలెండి ప్రస్తుతంలో మీరు నిర్ణయించలేకపోయినా. భవిష్యత్తు మీకాశక్తిని ప్రసాదించి తీరుతుందని నా నమ్మకం। సెలవ్.

— * * * —

# శ్రీ పడాల ముద్రిత రచనలు

1. విప్లవ మహోయుగం
2. శివకన్య 4 భాగాలు
3. ఆంధ్రశ్రీ
4 సీతారామరాజు
5. సామ్రాట్ అశోక్
6 సింహగిరి
7. కట్టబొమ్మ నాయకుడు
8 పలనాటి యుద్ధం
9 వీరబొబ్బిలి
10 శివయోగి
11 వసంతసేన
12 శాక్యముని
13 టిప్పు సుల్తాన్
14. ఖడ్గ తిక్కన
15 వీరహనుమంతు
16. చంద్రకాంతామణి
17. రాణా రాజసింహ
18. అభిషిక్తుడు
19. రామాయణం
20. మహాభారతం
21 భాగవతం
22. ఉత్తర రామాయణం
23. శృంగారనైషధం
24. కాదంబరి
25. శకుంతల
26. మనుచరిత్ర
27. పారిజాతాపహరణం
28. కళాపూర్ణోదయం
29. గంగా – గౌరి
30. నాస్తికుడు
31. శ్రీముఖం
32. తిరుపతి
33. చరిత్రహీన
34. సంఘం
35. గ్రామదేవత
36. ఖైదీ
37. నిజమా, నాటకమా ?
38. కాంతా కాంచనాలు
39. జై జవాన్
40. గోర్కీ—నా ప్రపంచం
41. ,, అమ్మ
42. ,, డాలరు పిశాచం
43. మహాకవి గోర్కీ
44. భయం
45. ఘోరం
46. ద్రోహం

